శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయ నమః.

---

శ్రీమద్రామచంద్రకరుణాకటాక్షసమాసాదిత

కవిత్వవైభవ వావిలికొలను రామచంద్రరాయతనూభవ

సుబ్బరాయ ప్రణీతమగు

# శ్రీ కుమారాభ్యుదయము.

మూఁడవకూర్పు, ౧౦౦౦ ప్రతులు.

చెన్నపురి:

బ్రిటిష్ మాడెల్ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

౧౯30.

# కృతివిమర్శనము.

"శ్రీకుమారాభ్యుదయము" ఇది, కడపజిల్లా రాజముపేఁట తాలూకా టంగుటూరు రేంజి రివిన్యూ యిన్స్పెక్టరుగారగు మహారాజశ్రీ వావిలికొలను సుబ్బరావు పంతులుగారిచే రచింపఁబడిన తెలుఁగుఁ బద్యకావ్యము. ప్రద్యుమ్నోదయకథాది ప్రసంగసంబంధమగు ప్రబంధము. ఈ గ్రంథకర్త బ్రాహ్మణుఁడు, గోలకొండవ్యాపారి. కడప మోచముపేఁట కాపురస్థుఁడు. మాపట్టణమున నీకవిబంధువులనేకులున్నారు, ఇపుడీక్కవికి షుమారు ముప్పదియేండ్లుగలవు. ఇక్కాలమున నూతనముగా రచియింపఁబడిన మిశ్రప్రబంధములలో నిట్టి పదగుంభనము గలిగినట్టియు నింత చమత్కారమైనట్టి కావ్యము లేదు. బ్రహ్మశ్రీ-ఓగిరాల జగన్నాథముగారి సుమనోమనోభిరంజనమునకన్న భావగాంభీర్యాదులతో నిది సదృశముగాదన్నఁ బదశయ్యాదుల దానికన్న నిది మిన్నగనున్నయది. ఒకపక్షమున దానికన్న భావమాధుర్యమున నించుక కొఱవడినదన్న నన్యాపేక్ష లేక బాల్యప్రభృతి సంస్కృతాంధ్ర భాషామహార్ణవము నహర్నిశము మథించి చిట్టచివఱకు సుమనోమనోభిరంజనమగు సుమనోమనోభిరంజనమును మనోభిరంజనముగాఁ గావించిన జగన్నాథునకు నెరసాటి గాఁగలరు. ఇక్కవియో, చిన్నటనాఁటనుండి, యుదరపోషణమునకై ఆంగ్లేయభాషా పరిజ్ఞానము సంపాదించి స్వకుటుంబరక్షణమును జేయుచుఁ దన స్వల్ప వయస్సులో సకలజనసేవ్యంబగు నిట్టి మహాకావ్యము రచియించుటయే మిగుల నాశ్చర్యము. ఇక్కవి గ్రంథమున నచటచట రచియించిన కొన్ని పద్యముల సంకేతములఁ బట్టి చూడ నితఁడు రామభక్తుఁడని యగపడుచున్నది. అట్టిసంకేతములనన్నిటి నీపత్రిక యందుఁ బ్రకటింపఁబడు. "ఉప్పులేక ముప్పందుముఁ ద్రాగఁగలఁడు" అనుసామెత రీతి గ్రంథమును మిగుల సొగసుగ రచియించినాఁడన్న పొల్లుమాటలతోఁ-బుటనింపుటకన్న గ్రంథమునందలి గొన్ని పద్యములఁ దత్కవివాగ్ఘరిం గనుపఱుచుటకుఁగా నిందుఁ బ్రకటించుచున్నారము. ఈ గ్రంథము సాంతముగఁ జదివిన, బ్రహ్మశ్రీ మండపాక-పార్వతీశ్వర కవీశ్వరులవారు వ్రాసిపంపిన యభిప్రాయములకన్న నితరుల యభిప్రాయము లంత విశేషములుగావుగాన వారి యభిప్రాయముమాత్ర మిందుఁ బ్రచురించుచున్నారము. ఎట్లన:—

## ఉత్పలమాలిక.

"అభ్యుదయార్థులైనకవు లందఱు నబ్బుర మంద సాధుసౌ
లభ్యముగల్గు వావిలికొలన్వభిధానకులాంబురాశియం
దభ్యుదయంబు నొంది సకలాదరణీయకళాకలాపుఁడై
సభ్యజనాగ్రగణ్యుఁడయి సత్కృతి నొందినసుబ్బరాయనా
మేభ్యుఁడు గూర్చు నేర్పుగడు నేర్పునఁ జెప్పినయట్టి 'శ్రీకుమా
రాభ్యుదయప్రబంధము' మదర్థము పంపఁగఁజూచినాఁడ సౌ
రభ్యము ఘుమ్ము ఘుమ్ముమని క్రమ్మఁగ నీనఁ బ్రసూనమై, కవి
త్వాభ్యసనాభిలాషగల యాధునిక ప్రజకొజ్జయై, కళా
లోభ్యఖిలాస్తికాళికతి లోభ్యమునై, పదసంధిహీనతం
కాభ్యనకర్షణంబునకు నందనయుండెపగోఁగు నొండియై
యభ్యుపపన్నపుణ్యపురుషాదరణీయకథానిధానమై
యభ్యుపగమ్యరమ్యరచనాస్పదమై, బహుదుస్త్యజాభ్యసూ
యాభ్యమితాళికుగ్రభిష గగ్రణియై, విలసద్రసాది తే
యాభ్యవహారమై, కృతిగణార్హసమస్తగుణాప్తిచేఁ గరం
బభ్యధికంబునై, మిగులనందమునొందుచునున్న దౌర! దా
ర్లభ్యముఁ జూపుబంధపటలంబులఁ బటనభేద్యమంచు నా
ర్షభ్యసమానులంట దమ సాహితిశోపము చేతఁగాని - యీ
నాభ్యది తాండవమండలమునం గలమంగళకావ్యకోటిలో
సుభ్యసుకంఠలంబికుచ తుల్యనిరర్థకవాక్ప్రయోగవా
గ్లభ్యము గల్గుమాత్రమున లంభనముం బచరింపవచ్చునే,
లభ్యములైనరీతులు నలంకృతులాదిగఁ దత్తదర్హతా
శోభ్యనుబంధముల్గనుచు సుస్థితినొందఁగరాదె, రైభ్యదా
లభ్యవసిష్ఠముఖ్యముని లక్ష్యచిదాకృతి, ధీరనారదా
రభ్యపగీయమానసమరక్రమరమ్యచరిత్రుఁడాత్మభ
క్తభ్యపహర్తయైతనరు తత్కృతిభర్త, ప్రపంచకర్త, శ్రీ
స్తుభ్యమితోధికాస్తు, పరిశుద్ధతయాపరితోజయోస్తు - తే
బిభ్యతిశత్రువోత్ర - కృతిభిస్తువశోస్మిత వేతినక్తయై
లిభ్యకృతంబ్రసన్నుఁడయి - లిబ్బుల నేలుత సుబ్బరాయనిన్."

పూండ్ల - రామకృష్ణయ్య,
శ్రీ "అముద్రితగ్రంథ చింతామణి"
పత్రికాధిపతి, నెల్లూరు. ౧-౯-౯3.

౧. శ్రీ కుమారాభ్యుదయము, ఇది యనేకార్థబోధకనామము. ఎట్లన. శ్రీకుమారాభ్యుదయము. కుమారాభ్యుదయము. మారాభ్యుదయము. రాభ్యుదయము అని యనేకార్థకవాచకము. ‹‹కుమారో మాసు తేస్కందే›› ‹‹రః పుమాన్ పావకే కామే›› అని నానార్థరత్నమాలగాన నిట్టిపేరుగల గ్రంథ మిదివఱకుఁ గనుపడదు. షష్ఠ్యంతకందములలో మొదటిమూఁడుపద్యముల ప్రథమాక్షరములఁ జేర్చి చదివినచో ‹‹ఓం రామాయనమః›› అని యేర్పడుచున్నది. ౩-౨-౧, యీ యాశ్వాసాంతపద్యముల యంత్యాక్షరములఁ జేర్చి చదివిన యెడల ‹‹శ్రీరామా›› యని యేర్పడుచున్నది. ఆ ౧-పద్యము ౧౧-లో నాంధ్రకవిస్తుతియందు ‹‹కవీశ్వర›› శబ్దములోని యీశ్వరశబ్దసారస్యమును జూడ నీశ్వరులనఁగా రుద్రులు ౧౧-మందిగాన నిందుఁ బేర్కొనఁబడిన కవులును ౧౧-మందియే యగుట కవిప్రౌఢిమను వెల్లడిపఱుచుచున్నది. మఱియు నీ గ్రంథమున శ్వేతచ్ఛత్ర చ్ఛత్రగుచ్ఛ నాగ గోమూత్రికాది బంధములును తోటకవృత్త గుప్తచక్రబంధమును గవి వ్రాసియున్నాఁడుగాని యిందలి చక్రబంధము చక్రబంధలక్షణమునకు వెలియైయున్నది. ఇందుకుఁ గారణము మృగ్యము, ఏకాక్షర ద్వ్యక్షర త్ర్యక్షర చతురక్షర సహితమగు పద్యము లిందుఁ జేర్చఁబడియున్నవి. హరిగతరగడ మిగుల రమణీయముగనున్నది. దండకము యించుమించుగ భోగినీదండక శైలిం బోలియున్నది. శృంగారనైషధము రామాభ్యుదయము పాండురంగవిజయములోని పద్యములవలె నిందుఁ గొన్ని పద్యము లగుపడుచున్నవి. అప్పకవీయమునందలి ‹‹పంచాశదంధ్రపద్యగర్భిత ప్రహరణకలితవృత్తముఁ›› బోలినవృత్త మిందునుఁ జేర్చఁబడియున్నది. కవి దీనినివ్రాయుటకుఁ బడినప్రయాసముం బేర్కొనుటకు నలవియగునని తోఁచదు. గ్రంథము సలక్షణముగ భాసిల్లుచున్నయది.

పూండ్ల - రామకృష్ణయ్య,
శ్రీ ‹‹అముద్రితగ్రంథచింతామణి››
పత్రికాధిపతి, నెల్లూరు. ౧-౧౧-౯౩.

౨. మహారాజరాజశ్రీ విరాజమానులగు మహారాజశ్రీ వావిలికొలను సుబ్బరాయమహాకవి శిరోమణిగారి సమ్ముఖమునకు, వి. మండపాక - పార్వతీశ్వరశాస్త్రి,

కం. శ్రీనరగౌరీవరహా, ణీవరకరుణాకటాక్షుని త్యస్తుత్య
శ్రీవఱలుముసద్గుణసాం, ద్రా వావిలికొలను సుబ్బరాయకవీంద్రా. ౧

ఇత్యాశీర్వచనపూర్వకముగా మన్నించి విన్నవించునది యేమన్నను, కవికులతిలకా? తాము దయతో నంపిన శ్రీకుమారాభ్యుదయంబను భవత్కృతిరత్నము వచ్చిచేరినది, దానిందిలకించి మనంబులకించితి, మృదుమధురవిధినథాటీకయుఁ బ్రౌ

ధమికాధునిక సాధుకరసుకరప్రయోగ నిదర్శన ప్రదర్శనటీకయునగు నొకటీక లేక లోకవి లోకంబునకు సులభవేద్యంబుగాదని నివేద్యం బగుచున్నది, నిత్యప్రత్యాహారాహిత్యంబుగల తమసాహిత్యంబు మనస్సాహిత్యంబొనర్చుచుఁ దనర్చుచున్నయది, యుష్మత్కృతికన్యాపతియగు క్షితికన్యాపతి యిందునందు నమందానందసంధాయకుండై మీమది నెడఁబాయకుండుఁగాత. తమకబ్బంబబ్బురంబుగనున్నదని నిబ్బరంబుగ ననంగలను.

సీ. అబ్బరాయజునకీయజనక్రియాధుర్యుఁ డచ్యుతాభిఖ్యుఁడైయలరుకతన
జబ్బరాయచలాత్మజాసూతికీతండు పటుమహాకృతిశక్తిపరఁగునతన
గుబ్బరాయలపల్కుగుబ్బెతకీగబ్బి ప్రబ్బినసాహితీపటిమవలన
గిబ్బరాయగసుతాంకితమూర్తికీమహీ సుకుకీర్తిధర్మవిస్ఫూర్తివలన.
ప్రబ్బరాయలనియతినిర్ఘరణికీతఁ,డిబ్బరాబరికవులు లేదబ్బురాల
నుబ్బురాయనఁదనరునీకబ్బమందు, సెబ్బరాయరయఁగలేదు సుబ్బరాయ. తే

మండపాక - పార్వతీశ్వరశాస్త్రి,

బొబ్బిలి సంస్థానకవి. ౨౦-౭-౯౩.

3. శ్రీమద్విద్వా నభినవపండితరాయ బిరుదాంకితులును. శ్రీభరతాభ్యుదయాది కావ్యకరణనిపుణులు శతావధానచణులగు శ్రీమాన్ మాడభూషివిద్వాన్ వేంకటాచార్యులవారి యభిప్రాయము.

తాము పంపిన గ్రంథమును సాంతముగాఁ జూచితిని, దివ్యముగానున్నయది; అన్నివిషయములశ్లాఘనీయమైయున్నది మీయోగ్యతకుమిగుల నంతసించుచున్నవాఁడ, ఆగ్రంథ విషయమై నాకుఁ గలయుత్సాహముఁ దెల్పుటకొక సీసపద్యమును రచియించి యిందుతో నంపుకొన్నాఁడ.

సీ. వావిలికొలనుసద్వంశాబ్ధిచంద్రుఁడౌ సుబ్బరాయ కవీంద్రుకబ్బమగుచు
శ్రీకుమారాభ్యుద యాకృతివిలసిల్లు నాకృతిపటు పదాటీకనంబు
సమయోచితరసప్రచారణంబనుప్రాస ములుఘనవృత్తిరీతులుసమత్వ
మాశయవైదగ్ధ్యమనఘత్వమునుసుకు మారతాదులుసలంకారములును
వివిధబంధనిబంధనవిలసనంబు, ప్రమదకర రసగర్భవృత్తములుగలిగి
ప్రౌఢవనితాశిరోమణి భాతిసకల, రసవదగ్రేసరమనోహరతఁదలిర్చె. ౧

మాడభూషివిద్వాన్ - వేంకటాచార్యులు,

మద్రాసు. ౨౨-౭-౯౩.

౪. శ్రీమదాంధ్ర భాషాసంజీవ నీపత్త్రికాధిపతులును, సంస్కృతాంధ్రానేక కావ్య రచనాధురీణులగు శ్రీమత్ కొక్కొండ - వేంకటరత్నము పంతులవారి యభిప్రాయము.

శ్రీకుమారాభ్యుదయము:—ఇది బ్ర॥ మ॥ వావిలికొలను సుబ్బరావుగారిచే రచియింపఁబడిన చంపూప్రబంధము, ఇందలికథంబట్టి దీనికి ప్రద్యుమ్నవిజయమని పేరుబెట్టఁబడినం దగియుండును, ఇందు శబ్దార్థాలంకారములు కొల్లగానున్నవి, వైదర్భీరీతియు ద్రాక్షాపాకమునే ప్రకటముగాఁ గనుపట్టెడు, ఇది యదియననేల? చతుర్విధకవితలుంగలవు, కుదిరీకుదరని ప్రథమ కవనమగుటవలన, ఊరీయూరని యూరుగాయవలె నీకృతియతిరుచ్యముగానున్నది. కాని పూనిచూడ నీకవిత్వము సహజపాండిత్యుఁడగు పోతనామాత్యుని కవితవోలెఁబోలు,

తే. కలిగివావిలికొలననుకులమునందు; సుకవియనఁగసుధాసూక్తి సుబ్బరావు
శ్రీకురామాభ్యుదయము రచించెనౌర,వాసురాయాఖ్య వెలయుత వసుధయందు.

ఆంధ్రభాషాసంజీవని,
విజయ సం॥ ర॥ సహజాషాఢమాసము. ౪౯ - పేజి.

౫. తమగ్రంథము మిగులఁ బ్రౌఢముగానున్నది, ఈకాలమున నిట్టి గ్రంథములు సాధారణముగాఁ బుట్టుచుంటలేదు,

సీ. వావిలికొలను సుబ్బారాయకృతము తత్ప్రేషితంబైనది శ్రీకుమార
కాభ్యుదయాఖ్యమహాప్రబంధంబు వందనపూర్వకముగఁ జేకొనిపఠించి
యానందమొందితినాయనసాహిత్య మత్యద్భుతావహం బయ్యెనాకుఁ
బదినిఘంటులు నాల్కతుదనున్నవనితోఁచు శబ్దజాలముఁగన్న శయ్యమిన్న
జాతులు త్ప్రేక్షలుపమలుచాలఁగలవు, కల్పనలపూర్వములు యమకంబుమెండు
కథమనోహరమీలాటికావ్యవరము. నాదరింపరెసకలకలాధిపతులు. ౧

విధేయుఁడు వడ్డాది - సుబ్బారాయఁడు,
రాజమహేంద్రవరము. ౨౫-౧-౯౪.

౬. ప్రౌఢసరస్వతీ బిరుదాంకితులగు శ్రీగంధ్రకోట - శంకరకుమారస్వామి శాస్త్రులవారి యభిప్రాయము.

కం. శ్రీమదఖండైశ్వర్యో, ద్దామాయుఃపుత్రపౌత్ర తతినిడియడర్చ
భూమహితస్థేమాంత, ర్యామియయినయాంధ్రనాథుఁ డాంధ్రకవులకై. ౧

ఉ. సభ్యులయారె! నా రసవిశంకటవృత్తిఁ జెలంగుశ్రీకుమా
రాభ్యుదయాఖ్యసత్కవితయర్థిని వావిలికొల్నుసుబ్బరా

యేభ్యసమర్పితాంధ్రకృతియియ్యది యిియ్యలలోనశ్రీకుమా
రాభ్యుదయప్రదంబగుటనందఱు సంతసమందుదుర్బుధుల్. ౨

సీ. నన్నయకవితాసమున్నతిఁజెన్నారుమండపాకేశ్వరుమహిమఁగొంత
భట్టుమూర్త్యాదులవాక్పటుతఁబెంపొనరిన కొక్కొండపండితుగుణతఁగొంతఁ
దిక్కనార్యవచోవిధేయతనలరారు మాడభూషణకవిమూర్తిఁగొంత
కవదుత్ప్రబంధ వేంకటకృతిరాజిల్లు శతఘంటవేంకటసరణిఁగొంత
సేకరించికృతీశ్వర సేవసేయ, శ్రీకుమారాభ్యుదయమను లోకైకరమ్య
కావ్యసుందరినాంధ్ర విద్యావ్యమనిపె, వావిలికొలనుసుబ్బరాడ్భావిదితుఁడు. ౩

ఉ. సర్వకలాకలార్భకులు జానుగనీవరపుస్తకంబుధీ
ధూర్వహఫక్కివేచదున దోషవిహీనసదంధ్రభాషయం
దుర్వరనార్యసన్నుతి సముద్ధతినొందెదరన్నచిన్నయే?
పర్వముపండితాళికిట భాసిలువ్రాసిగ సద్రసోద్ధృతిన్. ౪

గీ. శ్రీకుమారాభ్యుదయమిల శ్రీమార, కాభ్యుదయమౌట శ్రీకుమారాభ్యుదయము
గాఁగుమారాభ్యుదయలసత్కల్పకగతి, శ్రీకుమారాభ్యుదయమయ్యెఁజిత్రమరయ.

ఇట్లు,
జి. యస్. కె. స్వామిశాస్త్రి,
బళ్లారి. ౨౪-౯-౯౩.

కవికంఠీరవా.

౭. యుష్మద్రచితగ్రంథమిప్పుడయంది యమందానందంబొందించె. మిక్కిలి చక్కగానున్నయది, ఆధునికుల కిట్టిరచన యిదివఱకేరికిని సిద్ధించలేదు, అవతారిక శ్రీనాథనైషధమునందలి దానితోనుబోల్చుటకు వీలయి యంతకన్న గూఢార్థములగు శబ్దములతోఁగూడియున్నది, వేయిమాటలేల. ఆధునికులలో మీవలె నెవరును కవన మొనర్చలేరని నాయభిప్రాయము.

మచ్చ - వెంకటకవి,
పర్లాకిమెడి. ౯-౯-౯౩.

కం. ముదితమనస్కులైసుకవి ముఖ్యులునిన్గొనియాడునట్లుగాఁ
దుదమొదలెంచికన్గొనక దుమ్మవిజాల మసూయఁజెందఁగా
మృదుపదయుక్తకృత్యుచిత కృత్స్నగుణాఢ్యము శ్రీకుమారకా
భ్యుదయమొనర్చె వావిలికొలనూత్తమవంశ్యుఁడు సుబ్బరావిలన్. ౧

విధేయుఁడు,
మచ్చ - వెంకటకవి,
పర్లాకిమెడి. ౧౯-౭-౯౩.

౮. తే. వావిలికొలను సుబ్బరాట్కవిదకృత, శ్రీకుమారాభ్యుదయమనుసిరికుమారు
చరితమెంతయుహృద్యమైపరఁగుకతన, నేను వ్రాయంగఁదలఁకొంటినివ్విధమున
కం. మృదుపదములు మధురంబగు, సదమలవాక్యవితతియునుసద్వర్ణనముల్
పొదలఁగనీకావ్యరమణి, చదురొప్పఁగఁగాంచినెగడుసరసతమెఱయన్. ౨
తే. భావములకుఁదగుపదముల్పూఁతులాడఁదగినమాటలుసతులకుఁదగవుమెఱయ
గూర్చికావ్యంబురచియించికొమరుగాంచు,కవులుకవులుగాకెల్లరుకవులుకవులె
కం. ఒకటియురెండక్కరములు, నొకపరినేర్చికొనివాని నుడుగనికడఁకన్
తకమగుతీరును దగవెఱుఁగకకకవిక కవితఁజేయు కవులుంగవులే. ౩

పట్నం, హైకోర్టువకీల్
పి. అనంతాచార్యులు, బి. యల్. గారి
కుమారులైన,
పి. శ్రీనివాసాచార్యులు, బి. ఎ.
౨౦-౭-౯౨.

మిత్రమా?

౯. మీరుపంపిన కుమారాభ్యుదయంబు సాంతంబుగా నాలోకించితి,
కం. ఔరావాగ్ధోరణిమే, లౌరారసపోషణంబహా మధురతజా
నౌరాయుపమానాలం, కారంబులు సుబ్బరాయకవికృతికిఁదగున్. ౧

తమమిత్రుఁడు,
ధరణి వెంకటరామయ్య,
రివిన్యూ యిన్స్పెక్టరు, చెన్నూరు.
౯-౧౦-౯౩.

౧౦. గ్రంథమంతయుఁ జూచినాఁడను:—పురాతన వసుచరిత్రాది గ్రంథములకు న్యూనాధిక్యత లేనందున న్యూనాధిక్యముఁ బరిశోధించ నక్కరలేదు, చాలా సంతోషమైనది. ఇచ్చట పండితులందఱు తమ బుద్ధికౌశలమునుగురించి చాలా శ్లాఘించినారు. అయినను కొందఱికి కష్టసాధ్యమైన నైఘంటికపదములు ప్రచురముగా నున్నంబున నీగ్రంథమునకు టీకను మీరే రచించిన సర్వజనశ్లాఘనీయముగా నుండును, వసుచరిత్రాదిగ్రంథములవలె టీక యేర్పడని గ్రంథములు చాలా పడుబాటయియున్నవి, గనుక యటుగాకుండ ప్రతిపదము నేర్పరుచవలయునని వేఁడెద. ఇంతే ఆశీర్వాదములు.

చెట్లూరు-నృసింహాచార్యులు,
కంపసముద్రం. ౨౭-౭-౯౩.

౧౧. శ్రీమత్, బాలసరస్వతీ బిరుదాంకితులగు శ్రీమాన్ రంగనాథాచార్యుల వారి యభిప్రాయము—

శ్లో. 'శ్రీరామం శరణాగతైక నిఖిలాభీష్టప్రదం స్వామినం
విశ్వస్యామృతనామనిత్యమననస్వాన్తైకదం శాశ్వతం
పూర్వాభాషణపూరితాశ్రితమనః కామ్యాఖిలోద్దేశినం
పుణ్యం పుణ్యజనారిమద్భుతదయం ప్రేయాంసమేమశ్రయే.' ౧

నవరత్నములు.

శ్లో. వావిలికుల్యాకులజం శ్రుత్వాసుబ్బాభిధానవిబుధంతత్
తచ్ఛ్రీకుమారసూక్తం శ్రియమివకాంచిత్ప్రపద్య మోదేహం. ౧

శ్లో. వ్యర్థానదోషాంశ్చతురోపిమానం, నితాంతపాఠోస్యసుఖం ప్రపద్యాత్
యద్గ్రంథదేవస్య వశాత్త్రిలోకే, శ్రీకేశివాపి ప్రతిబంధకాదృతే. ౨

శ్లో. అన్వర్థతాత్ప్రాయ ఉదారబంధ, శ్శ్రీకోశ ఏష ప్రతివర్ణమేస్తు
తద్యోతయన్నస్య పురోక్తమాదరాత్, సమస్తవర్ణాన్స్వరగాన్ప్రవీతి. ౩

శ్లో. పుల్లంపేటోద్దేశః వావిలికుల్యాఖ్య సుబ్బరాయేణ
పుల్లగ్భాగీభాతిప్రాగనుగచ్ఛత్స్వరం త్రిలింగేభూత్. ౪

శ్లో. మామకయనుకం నమకం ఛేకోగమకంచ వృత్త్యనుప్రాసః
అనువృత్తిమస్యకోశదర్శన ఆప్నోతి నిశ్చితం వచ్మి. ౫

శ్లో. ప్రాసాదిమప్రకాశే భాగవతగ్రంథ కల్పకందతమ్
పోతన్ననామసుకవిం త్యక్త్వాన్యంచైనమాదరాదీక్షే. ౬

శ్లో. అత్రప్రశ్రితరత్నమాదృత మనుప్రాప్యంచ తత్ప్రాపకమ్
స్పష్టం శిష్టజనాశ్రయం ననుతతోనందామిమందేతరమ్
క్ప్తంతచ్ఛినవక్త్రదివ్య శశినిప్రాప్తంచమష్టీష్వహ
గ్రంథ్యానంగ సహాయదివ్యకవచం ప్రాభాతి పారార్థ్యతః. ౭

శ్లో. శిరస్థదారోనతు గీరుదారః శ్రీరస్తదారోయమతీవనూనమ్
శిరస్తదారోవిదధాతినమ్రం నమస్యతాంసన్నిధి మాప్యధీరః. ౮

శ్లో. విదూరరత్నంహారినీలసక్తం మిత్రంచగోమేదక వాక్సువజ్రమ్
ముక్తాదరంమారతకంముఖాబ్జం, సుపుష్ప రాగంకలయేనుమానికమ్. ౯

శ్లో. కాంచీజబాలవాణీమహాదాశీఃప్రాప్తనామధారోయమ్
ఆచార్యపుమభిజాతో వ్యలిఖచ్ఛ్రీరంగనాథవర్యోత్ర. ౧౦

౧౨. ఉ. శ్రీకరవాల్లికొల్లు కులసింధుసుధాకరసుబ్బరాయనీ
ప్రాకటకావ్యపుత్రికశుభస్ఫుటపూర్ణగుణాప్తిగుల్కుచుక్
జోకగశ్లేషసౌరభవిశుద్ధపదక్రమరాగవిస్తరా
స్తోకరుచుల్చెలంగరహిసూరిమనోధనపాళిమ్రుచ్చిలున్.

మచ్చ - వెంకటకవి,
పర్లాకిమెడి, ౩౦-౧-౯౪

ఆర్యవర్యా నీపొత్తంబుఁ దదాయత్తత చూఁచినాఁడ,
నాయాశయంబీపద్యంబున వేద్యంబగు, బి. శే

సీ. అతులపదన్యాసచతురతావిభవంబు బహువిధాలంకృతి ప్రాభవంబుఁ
దత్తద్రసోచితవృత్తివిస్తారంబు ఖ్యాతిసమీచీనరీతిగరిమ
లోకైకవినుతమాపాకనై పుణియును సరసజనశ్లాఘ్యశయ్యనేర్పు
గురుసౌకుమార్యాదిగుణగుంభనంబును శ్రీరమ్యమగుభావ గౌరవంబుఁ
దనరునీ శ్రీకుమారాభ్యుదయముముద్దు, చెలువగతిరాజిలంగసృజించితీవు
సుబ్బరాయకవీంద్రనీకబ్బమవని, నెగడునాచంద్రతారార్కమగుచుమిగుల. ౧

ఇట్లు సుకవివిధేయుఁడు,
నుభయభాషాభూషణుఁడు,
బిరుదరాజ శేషాద్రిరాజకవి,
వెంకటగిరి, ౧౭-౫-౯౪.

౧౩. సీ. వావిలికొలనుసద్వంశపీయూషపారావారపర్వకైరవహితుండు
నాంధ్రభాషా కవిత్వైశ్వర్యసామ్రాజ్య పట్టాభిషేకప్రభాసురుండు
రామానుజాంఘ్రినీరజసమారాధన బంభరాయితచిత్తబంధురుండు
రమణీయవిభవ భారద్వాజసంతాన విఖ్యాతికారణ విమలయశుఁడు
సుబ్బరాయసుకవిసూరిలోకహితుండు, బహుళసరసరీతి భరితముగను
మహిమఁజెప్పె శ్రీకుమారాభ్యుదయనామ, కావ్యరత్నమొకటికవులుమెచ్చ

చం. ఆహాహా రసమాధురీపరిమళం బౌరాయలంకారగుం
భౌహాపాటవమద్దిరా గుణవిశేషోక్తుల్బళారీతికా
మీహాపూరణ చాతురీమహిమ లేమీశయ్యయంచుంగవుల్
దేహంబుల్మఱవంగలారుసుమిసం దేహంబులేదీకృతిన్. ౨

ఉ. పెక్కు తెనుంగుకబ్బములు వింటిమి కంటిమిగాని యెచ్చట
న్నిక్కమదీనిఁబోలురమణీయకృతిన్ గనలేదుదీనిఁ బెం

పెక్కుఁగఁ జేయుఁగాతజగ దీశ్వరుఁడైనరమాధినాయకుం
డెక్కుడుప్రేమ చేతఁబరియింతురుగాక మహానుభావులున్. 3

ఇట్లు,
సుజనవిధేయులు కింకవీంద్ర ఘంటాపంచానన విద్వత్కవి
బాలకలానిధి, శతావధాని, బాలసరస్వతీత్యాది
బిరుదాంకితులునగు,
దివాకర్ల - తిరుపతిశాస్త్రి,
చల్లపిల్ల - వేంకటశాస్త్రి,
నెల్లూరు, ౭-౨-౯౪.

విజ్ఞాపనము.

మేధావిధుర్యులార?

౧. "దేశభాషలందుఁ దెలుఁగులెస్స" యను నొకానొక గ్రంథస్థవాక్యము రీతిఁ గవికుంజరుల చే రచింపఁబడిన సరసగ్రంథములను జదువుటవలనను, వినుటవలనను గలిగెడు సంతోషమునకు వెలఁబెట్ట నెవ్వనితరమయానా. అట్టి సౌఖ్యమును గలిగించు గ్రంథము లాంధ్రభాషయందుఁ దక్కఁ దక్కినభాషలలో లేవని పండిత మండలంబంతయు నొప్పుకొనియున్నవిషయము. ఎల్లభాషలకుఁ దల్లి సంస్కృతముగాన దాని నిచటఁ బేర్కొనుట యనావశ్యకమని వేఱ చెప్పనేల. ఆంధ్రభాషయనఁగా శుద్ధాంధ్రమని యర్థముగాన నిపుడిచటి ప్రస్తావన శుద్ధాంధ్రగ్రంథములను గుఱించికాదు. శుద్ధాంధ్రగ్రంథంబట్టి సౌఖ్య మందఱకుఁ గలిగించునన్న సున్న. ఇఁక మధురమగు మిశ్ర ప్రబంధములన్న నందలిశబ్దాలంకార వర్ణనాకర్ణనముచేఁ బామరులను, శబ్దాలంకారార్థ సౌష్ఠవాది వర్ణనాకర్ణనముచేఁ బండితులను సంతోషాంబుధియందు నోలలాడించుచుండు. అట్టి గ్రంథములు పూర్వము విశేషముగఁ గవులచే రచియింపఁబడినవిగాని యిక్కాలమున వ్రాయఁబడినవానిలోఁ బెక్కులగుపడవు అగుపడినవానిలో "సుమనోమనోభిరంజనము. శ్రీ రాధాకృష్ణ సంవాదము" లోనగు గ్రంథములు పండితులను దమకు విధేయులుగఁ జేసికొనునవికావని యెవ్వ రనఁగలరు. ప్రకృతమునఁ బేరుఁబెంపువహించి త్రిలింగదేశమునందలి పండితులవలన మిపులసన్మానింపఁబడిన గ్రంథ లలామమగు "శ్రీకుమారాభ్యుదయము" గూర్చియుఁ దద్గ్రంథకర్తం గుఱించియు నించుక వ్రాయదొరకొంటిమి. ఈగ్రంథ గుణాగుణముల నుద్ఘోషించు మఁ బండితులు వ్రాసిపంపిన లేఖ లిందు ముద్రితములైయున్నవిగాన వానింగంటి రేని గ్రంథ గుణాగుణములు విస్పష్టములవుచున్నవి. ఈగ్రంథకర్త శ్వశురగృహము మాపట్టణమున నుండుటంబట్టి యొకసమయమున వారిచటికి వచ్చినందున వారిని యథోచితముగ

సత్కరించిన విషయమంతయు నిందుఁగ్రిందఁ బ్రకటింపఁబడియున్న "కృతిసత్కృతి" యను శీర్షికంగలవ్యాసమునుజూచిన గోచరించునని విశేషముగ వ్రాయక విరమించుచున్నారము.

## కృతిసత్కృతి.

౧ శ్రీకుమారాభ్యుదయ ప్రబంధసంబంధమగు మాకృతివిమర్శన మింతకుముందిందుఁ బొందుపఱుపఁబడియుండెఁగదా. అక్కైకసరిక్కేసరిపురిం భాసిలు తమ శ్వశురగృహంబునకు మొన్నటి దీపావళ్యుత్సవంబునకు విచ్చేయుటంబట్టి, మాకు వారియెడం గల గౌరవోదారతచే వారి సత్కరించనెంచి, ౧౮౯౩-వ సంవత్సరము నవంబరు తే ౧౨ దీన నొకసభ, మ-రా-రా-శ్రీ. శ్రీవేంకటగిరి రాజాగారి పాఠశాలలో మాచేఁ గల్పింపఁబడియె. అద్దాని కగ్రాసనాధిపతిత్వము నాంధ్రభాషాభిమానమానసులును; రివిన్యూబోర్డు సెటిల్మెంటు మొదటి అసిస్టెంటుగారును, నూపట్టణవాస్తవ్యులునునగు; మహారాజశ్రీ. ఇ. శరభలింగమునాయఁడు, బి, యే. గారియ్యకొనిరి. రాజశ్రీ, వావిలికొలను సుబ్బరావుగారి పాండితీగరిమనుగూర్చి యగ్రాసనాధిపతిగారుపన్యసించుచు, గ్రంథమును సన్మానించి పలుకుటయే కవిని గౌరవించుటయని, యందుండి, యించుమించుగ నిన్నూఱుపద్యములఁ జదువనియమించిరి. శ్రీసుబ్బరావుగారన్యులవలె ధనాకర్షణోద్యోగమునకుఁ గాక యూరక యీయూరికరుదెంచిరిగాన నట్టివారిని గౌరవముగ సన్మానించుటకు వేఱుపాయము లేమింజేసి యక్కవిరాజునకు నొక్కగజమాలను సభాపతిగారి యాజ్ఞానుసారంబుగ సమర్పింపఁగానందునకు వారుపంచరత్నంబులుబదులిడిరి. గజమాల పంచరత్న సహితమై యిందునలంకరింపఁబడి యున్నది.

౨. మఱియొక్కదినంబున, శ్రీసుబ్బరావుగారు మాయూరి "వాక్చాతుర్యాభ్యసనసమాజ" కార్యదర్శిగారగు, శ్రీమాన్, నేలటూరు కృష్ణమాచార్యుల వారిచేఁ బ్రార్థితులై, కార్తికశుద్ధైకాదశీదినంబున, "శ్రీ మత్తల్పగిరి రంగనాయక శతకమును" రచియించినందున, దానింజదివి, వివరించుటకుఁ బైనుదాహరించినపాఠశాలలో, నవంబరు తే ౨౯ దీ ఆదివారంసాయంసమయమునఁ జేరిన సభకు నగ్రాసనాధిపతిగా, బ్రహ్మశ్రీ అ-నారాయణశాస్త్రి. బి. యె. గారియ్యకొని శతకమును జదివించిరి. శతకశైలి మార్దవమై యున్నకతనఁ దత్సమాజకార్యదర్శిగారు దానిముద్రాపణ స్వాతంత్ర్యమును గవిగారివలనఁ జెందిరి. తచ్ఛతకరామణీయక మునుగుఱించి, బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు పంచరత్నకందములు రచియించి కార్యదర్శిగారిచే వారికర్పణసేయించిరి. ఇట్టి దిట్టయగు శ్రీసుబ్బరాయకవిగారన్యగ్రామనివాసులగుట నెట్టన నెడఁబాయుమనసురాక, వారి ప్రతిబింబమునైన నిరంతరమును

జూడఁగోరి, ఛాయాగ్రాహిణీయంత్రమునఁ (ఫోటోగ్రాఫు) ప్రథమదినంబున వారి బింబముఁ బ్రత్యేకముగనుమఱునాఁడు సుహృత్సహితముగఁ గల్పించుకొనియున్నారము.

గజమాల.

చం. శ్రీనగరాజరాజ శశిశేఖరచంద్ర పటీరకీర్తిపా
థోనిధిపుత్త్రికాహృదయ తోయజమత్పదమూర్తి, ధీరపం
చానన విక్రమక్రమజితాఖలదానవ చక్రవర్తి, వి
ద్యానిధిసుబ్బరాయకవికప్రతిమానసుఖంబు లీవుతన్. ౧

ఉ. సభ్యశిరోమణుల్ నవరసస్ఫురితత్వమనిసన్నుతింప, సౌ
రభ్యసమున్నతంబనితిరంబుగ, నాధునికుల్ పురాణవి
ద్యేభ్యులుసంస్మరింపఁగ, బళీ! సదలంకృతులొప్ప "శ్రీకుమా
రాభ్యుదయప్రబంధము" ధరన్ రచియించె, నితండలంతియే. ౨

ఉ. మున్ను, రసజ్ఞులైననృప పుంగవులెంతయునాదరింపఁగా
వన్నెయు వాసియుంగనిరి, పండితులత్తఱి? నిత్తఱిందెనుం
గన్నవిసంబు, తత్కవులహో! పరిహాసపుభాజనంబులై
రెన్నఁగఁ గెట్లు బాసయభివృద్ధియగున్ దెలివెట్లుగల్గెడిన్. ౩

ఉ. హత్తినవేడ్కఁ బెద్దనయొ యారిసమస్యలు పూర్తిసేయఁగా
జత్తవశీకరైకముగ శ్లేషరచింపఁగబట్టుమూర్తియుం
బొత్తఁగరామకృష్ణముఖు లుల్లసిలన్ గనుపట్టు కృష్ణరా
యోత్తముసత్సభందలఁప నొప్పుమెయిన్సుబల కల్గనింపవే. ౪

ఉ. లాఁతిపనుల్ద్యజించి, సకలంబుఁగవిత్వముగాఁదలంచి, భూ
నేతలప్రాపుఁగాంచినప్రణేతలు, వారలశక్తియబ్రమే
యాతఁడో, హూణభాషఁబఠియించి; పరీక్షలనిచ్చి, కొల్వులో
బ్రాఁతిగనుండియున్, రచన వారలతోసముఁడయ్యెనియ్యెడన్. ౫

ఉ. సారతరంగిణీవికచ సారససారమరందమాధురీ
సారసమానమై, భువనజాసనసారసలోచనాకరాం
భోరుహవల్లకీనినదము న్దలపింపఁగఁ జేసెనౌర గం
భీరభవద్వచోరచన పేర్మిబుధావళికింపునింపుచున్. ౬

చం. సరసకవిత్వతత్త్వరససాగరపారగ! సుబ్బరాయ! నీ
సరసత, వాక్యమాధురియుసన్నుతమున్, సముదంచితంబు, ని
ష్ఠురుసునఁ బెక్కుకబ్బములు వాయకొనర్చి, సదాంధ్రభారతీ
స్ఫురదురుభూషణంబులిడి, పొల్పువహింపుమునిత్యకీర్తివై. ౭

చం. అతులవచోమృ తార్క్ష్య విబుధాదరణీయకలాకలాపసం
తతసుమనఃప్రమోదకర నందితసత్కులసుబ్బరాయ! పూ
జితగతినీదురాకకిట సింహపురీద్విజులెల్లఁ బ్రీతులై
మతిఁగడునుల్లసిల్లి, గజమాలనొసంగిరి సంతసింపుమా.

పూండ్ల - రామకృష్ణయ్య,
"అముద్రితగ్రంతచింతామణి" పత్రికాధిపతి.
౧౨-౧౧-౯౩.

కం. శ్రీమద్వావిలికొలనుకు లామృతజలరాశిచంద్రుఁ డనుపమకవితా
శ్రీమహితహితవచస్క గ్రామణిశ్రీసుబ్బరాయకవిరాజెలమిన్.

ఉ. సభ్యజనస్తవార్హసదసంపద సొంపుననింపునింపుసొ
లభ్యముగల్గుశైలి విపులంబగునర్థము నొకవిత్వవా
ల్లభ్యముస్వాత్మసాత్కృతిఁజెలంగనొనర్చినయట్టిశ్రీకుమా
రాభ్యుదయప్రబంధములనాప్తులకీఁదనయొద్దనుంచుటన్.

మ. సనయశ్రీరఘునాథనామపుర వాస్తవ్యుండుసంస్తవ్యధీ
ఘనుఁడుద్యన్నిరవద్యకవితా కల్పుండుభాస్వద్దయా
ఖనియార్ వేంకటసుబ్బరాయార్యమణి ప్రేంఖత్ప్రసూనంపించెఁబే
ర్మినిదగ్రంథముఁ గ్రొత్తపల్లికులజ శ్రీపద్మనాభార్యుచేన్.

కం. శుభవిభవహేతువనిప్ర త్యభివందనపూర్వకముగ దానింగొనినే
నభిలషించితిఁదత్ప న్నిభమితరగ్రంథముందునే యుపుడెందున్.

సీ. ఎద్దానిపదగుంభజృంభణంబరయ ముత్యాలహారముగ్రుచ్చినట్లుమించు
నెద్దాని యర్థసమృద్ధివిమర్శింపఁ గరతలామలకమై గానుపించు
నెద్దాని రసపుష్టి నెంచిచూచినచిన్ని పూఁదేనెపలుకులపురుదు గాంచు
నెద్దానివృత్తియుద్వృత్తినీక్షించినమిన్నేటి పెన్నీటిమెలపుగాంచు
నద్దిరాయెద్దిరాజిల్లు నుద్దిరాఁబు, రాతనగ్రంథములు తన రీతిత్రొక్క
నిఖిల సూరిశిరశ్లాఘనీయగరిమ శ్రీకుమారాభ్యుదయకావ్యశేఖరంబు.

ఉ. లంకలపల్లిసత్కులకలాపకలా పరిపూర్తిశాలిని
శ్శంకరసప్రసార విలసత్కవితాలలితాను భావశ్రీ
వేంకటసుబ్బయార్య సుకవీ యకలంకపుఁగూర్తిపేర్మినా
వంకనుజూపితార్యులు స్వభావశుభావహసౌహృదుల్గదా.

(SD) దేవులపల్లి. సుబ్బరాయశాస్త్రి.
పిఠాపురము. ౨౮-౨-౧౭.

శ్రీకుమారాభ్యుదయంబను నొకగ్రంథరాజము మాకార్యస్థానమున కంపంబడిన దానిందిలకించినారము. ఇయ్యది కడపజిల్లా టంగుటూరి రేంజి రివిన్యూ ఇన్స్పెక్టరు వావిలికొలను సుబ్బరాయకవిగారిచే రచియింపఁబడినది. మూఁడాశ్వాసములు గలది. అందు ప్రథమాశ్వాసము ననంగజాతుఁడనంగుఁడగు కథయు, ద్వితీయాశ్వాసమున శ్రీరుక్మిణీపరిణయ వృత్తాంతంబును, తృతీయాశ్వాసంబునఁ బ్రద్యుమ్నచరితయు, నతిమనోహరంబగు శైలిని వర్ణింపఁబడియున్నవి. ఈగ్రంథమందలి శబ్దార్థాలంకారంబులును, తత్తత్కాలోచిత శైలియు, భావసూచకంబులగు పలుకులును, హృద్యంబులై, యనన్యసాధారణంబులయి, నెగడుచున్నవి, వేయేల? గ్రంథముచూడఁజూడఁ రుచ్యమయి యెన్నిమాఱులు చదివినంగానివిసుగుఁ బుట్టింపనిదియయి యున్నది. గ్రంథమునందలి రసవంతములగు కొన్నిపద్యముల నిందుఁ బ్రకటింతమనిన నేపద్యముఁ జూచిన నొకవిశేషము కలదయి యుండుటంబట్టి యప్పనికిం బూనినచో నీయొకపత్రికయందు స్థలముచాలదని వగచెదము. దీనికి సాటియగు గ్రంథము చిక్కుటయరుదు. నిఘంటువు లెన్నో యీకవిగారికి ముఖస్థములగునని యీ గ్రంథము తెలుపుచున్నది. చతుర్విధకవితల కిరవయి వివిధాలంకారంబులం బొదలుచు నింపునింపు శైలివ్రాయంబడి యుండు నీ గ్రంథము సుజన సమాదరణీయంబగుననుటకు సందియమున్నే? దీనిందుద ముట్టఁజదివి యర్థముగ్రహించినవారికి నాంధ్రంబున నూతనశబ్దము గన్పట్టదని నొక్కివక్కాణింపఁదగును. కావుననీకవి నాంధ్రమాఘుఁడని సంభావింపఁదగును. గ్రంథగౌరవముంబట్టి యెంతవ్రాసినను దనివిచాలకున్నది. ఇట్టి యుద్గ్రంథము మాకొసంగిన నీకవీశ్వరునకెంతో కృతజ్ఞులమై వందనములాచరించుచున్నాము.

ఇట్లు,

ఆంధ్రప్రకాశిక - పత్రికాధిపతి.

౨౮-౩-౯౩.

# పుష్పమాలికా బంధము.

సురవరధీరధీరశుభశుభ్రశుచిస్ఫురహారధారణా
నరవరపారవారణగుణార్ణ్వనాతిచలాచలాచలా
దరికిరిదారితారిధరధర్మధనాధిపరూపగోపయా
శరవరమారమారసమసద్రసవాసపరాపరాపరా.



# ద్వాత్రింశద్దళపద్మ బంధము.

సీ. సురుచివిసుభగసంస్తుతరణశ్రీభూపద్రవగేహాభూసూతిదాషితగుణ
నగవైరివినుతతృణావర్తహాధనుర్భంగదావహారాయనంగతాత
వనచారిపోషక పాపనిర్వాపకహారికలాపరమారథాజ
రిపుభీషణాశూద్రజపదసురుచిరఖరము రారిసద్బింబశమితహారిణ
పాపబవినాశభూతాసువాలిధీవి శాలబకదర్పధుతమహాశిలివాలి
రవివిసాదరయచలజానవజమహిప శ్రీకరాభర్మపటజధీరాక భవన.

తోటకము. సురసూరినుతాపరశూరహతా దరధర్మవిభూషితదానపరా
పరిపాలితసామజభద్రగుణా హరిహారిసుబింబవిహారసరా.



## దీనికి లక్షణము. మం. పా. క. క: తము.

శా. పత్రంబుల్ పదియాఱులోపలఁ బయింబత్రంబులాపాత్రమే
పాత్రంబౌనటుప్రాసి సీసములిఖింపం గేసరాగ్రం—
బత్రాగ్రంబులనున్న వర్ణములచేఁ బద్యాంతరంబ నిద
ద్వాత్రింశద్దళపద్మబంధము ప్రబంధశ్రీకిసద్మంబగున్.

# నాగ బంధము.

చం. నరహరిశాంక ధీరధరణా రవివిశ్రుతరూపకా పరా
స్తర పలలాశివారహననా నరమిత్రక న్యాయకోవిదా
దురితపరా విదూరభయ తోయదచర్మ శిహారి భూమిపా
వరద యనంత శౌరిహరి నారిజపత్రవిశాలలోచనా.



# ఛత్త్ర బంధము.

కం. జా న వనదన క ఖగప వి
భా నవ పర పదప ర ప వ వనజాసన మా
మానస జా నవ భ న కా
కా న భవన భా వి పగ ఖ క వదన వనజా.



# శ్వేతచ్ఛత్రము.

దోధకము. రామ హామస్త మ రా పట యుక్తా, శ్రీమదమచ్ఛమరీకచకస్థా
సామజరక్ష రసారమణీపా, యామరశస్త్ర జనార్దనకృష్ణా.

సుగంధి. తారహీరహారభూష ధాతతాతపూతకా, కారణస్వరూప పాదకంజజా
భ్రదీర్ఘికాకారికావినాశకాసుకామితప్రదాయకా, కారుమాపమిత్రనీలకంఠశస్త
నామకా.



# గుచ్ఛబంధము.

మాణవకము:—రామ కుమారా సమరా
రామసమజ్ఞా ద్రుమరా
రామద్రుమాద్యా గమరా
రామగవస్త్రా కుమరా.



# గోమూత్రికా బంధము.

కం సురవరసంస్తుతవదనా కరిరాజనుతా ధృతదర కరిలేపహారీ
మురహారినిస్తులవదనా గిరిరాజభృతాజితపరకిరిరూపహారీ.

# ఖడ్గ బంధము.

కం. ఖరమురసురపరవరహార కరధృతదరచక్రనందకకమలచాపా
సురహృన్మత్సంధాయక కరపదసాహస్రనీలకంధరరూపా

# పాదగోపనము.

కం. రామా మాధవ వరతే, జా మానవరత్న సముఖ శరజవిభా న
ద్దేమకసుభూమధామా * * * * *

ఈపద్యమందు నాల్గవపాదము గోపనము చేయఁబడి యున్నది, ఎట్లనిన వ్రాసి యుండు భాగమందలి బేసియక్కరముల నెల్లఁ గ్రమంబుగఁ జదువఁగా 'రామావరజానరసఖ రవిసమసుషమా' అనునాల్గవపాద మగపడును.

శ్రీరామచంద్రాయ నమః.

శ్రీశారదాయై నమః.

శ్రీహయగ్రీవాయ నమః.

# శ్రీ కుమారాభ్యుదయము.

## ప్రథమాశ్వాసము.



వైదర్భీవివాహవేళ జనికై చేతోభవుం డుద్ధతిం
గోవిందు న్నిజమాతృకటాక్షశరరుక్కోదండకోదండుఁ డై
తీవి న్నొంచెనొ వేగఁ గైకొనుము తండ్రీ! యంచు నా రుక్మిణీ
దేవీపాదము వట్టుశౌరికరుణాదృష్టుల్ ననుం బ్రోచుతన్. ౧

శా. క్షౌమాబద్ధనితంబబింబముపయిం గాన్పింపఁగాఁ గాంచి సు
శ్రీమన్మంజువతంసనాసనలు వాసింపంగ ముక్తావళీ
గ్రామశ్రీలహరీచరోత్క శఫరీవ్రాతంబు నాఁ గర్ణికా
ధామం బొప్పఁగ నాదుధామమున నిత్యం బుండుమా భార్గవి. ౨

చం. లలితమణీవణీచకకలాపకలాపవిలాసభాస ని
స్ఖలితకలాపనూపుర వసుస్ఫురకంకణమంజులాంగదో
జ్జ్వల తపనీయమంజులనిశాహరిచందనఫుల్ల కేతకీ
దళనవమిత్రజైత్ర మగుతావకరూపముఁ జూపు భార్గవీ. ౩

సీ. ఏచిన్నెలాఁడికి నిర వైనచెన్నులసాహిత్యగీతముల్ స్తనయుగంబు
నేవన్నెలాఁడికి నిం పైనతనవన్నె సాక్షి స్వాశ్రితయశస్సంపదలకు
నేయెమ్మెలాఁడికి నీహచే విహరింప నైగమశ్రేణి ఘంటాపథంబు
నేమందయానచూడామణి యెఱిఁగించు నజ్ఞానతిమిరాపహారి యంచు
నిట్టిజనయిత్రి భువనసమీహ్యగాత్రి, పలుకులకు మేటివేల్పు రేవెలుఁగుఁదాల్పు
వత్సలత్వంబునను సుధీప్రథితుఁగాఁగ, శాంతిసంయుతుఁగాఁగ న న్నలువుఁగాత. ౪

ఉ. తమ్ములసూనుతోడు, వెలిదమ్మి మొలంగెడువాఁడు, తల్లి పొం
దమ్ముల నాడుప్రోడ, పినతమ్ముఁడు దమ్ములఁ జిమ్మువాఁడు, వా
దమ్ముల ముందునాలు, బలుదమ్ములతూఁడులతిండి తేజి, వా
దమ్ములు పెట్టువట్టి, గలధాత చిరాయు వొసంగుఁ బొంగుచున్. ౫

ఉ. వారిజనాభదివ్యపదవారి శిరంబునఁ దాల్చి భక్తిమై
వారిరుహాక్షుపాదతలభాసురపావనకేశపాశుఁడై
వారిరుహోత్తమంశశరపాలశిఖామణిరామనామచిం
తారతి నొప్పువైష్ణవజనప్రవరు న్నతికెంతుఁ గొల్చెదన్. ౬

కం. రతిపతిరిపుసతి హిమనిల,సుతనయ మృగపతితురంగ హరిసహజాత
న్వితతనిగమవిన్నికరవి,నుత సితకరకచకలాప నుతియింతు నెదన్. ౭

శా. స్విష్వగ్రోగ్రవిలోకనారికులహృద్ధ్రత్యంధకారాయుతా
భీష్వత్యంతప్రభావపూర్ణుఁ బ్రణుతాభీష్టైకదానేచ్ఛు నూ
నేష్వాసారితనూజనాగముఖదేవే శేడ్యు విఘ్నఘ్ను ని
న్విష్వక్సేను మదిం దలంతుఁ గృతి నిర్విఘ్నత్వముం బొందఁగన్. ౮

కం. కైటభమథ్వాద్యరిదు,ష్కూటవరాటకమదేభ శుభ మాంవిభుని
న్స్ఫాటికశిలాభు సన్నుతు, ఘోటకవదనుం దలంతు గురుతరభక్తిన్. ౯

శా. శ్రీమద్రామకథాసుధారసజగీర్వీచీపరిభ్రాజితో
ద్దామోద్ధామగభీరమానససుధోదన్వంతుని న్సన్ముని
న్సోమార్కేక్షణుమాఱుమూర్తి యగువ్యాసుం గాళిదాసు న్వచో
భామాన్యాత్ములఁ దండిబాణకవులం బ్రార్థింతు వాక్సిద్ధికిన్. ౧౦

ఉ. నన్నయభట్టుఁ దిక్కకవినాథుని భాస్కరు శంభుదాసుఁ బె
ద్దన్నను సోముఁ బోతనను దద్దయుఁ దిమ్మనబట్టుమూర్తుల
న్మన్ననమీఱ మానసమున న్సిరినాథుఁ గవీశు రామకృ
ష్ణు న్నుతసత్కవీశ్వరుల సొం పగుతద్వచనాప్తి కెన్నెదన్. ౧౧

ఉ. భూమిఁ గరంబు మేలుపదముల్ గన మేలుపదాళి శ్లోకస
ద్ధామమె గ్రామము న్విమలరాజదలంక్రియలే యలంక్రియ
ల్గామితదాయి రామవరకల్పమె కల్పముగాఁగ నద్దిరా
శ్రీమహిళాకటాక్షమునఁ జేకుఱె మాకిఁకఁ దక్కువేమిటన్. ౧౨

మ. కలనేఁ గోసనె దంతిహీనుఁడు మెసంగన్ నారికేళంబులం
జెలువౌప్రౌఢవరాంగనారతసుఖశ్రీ షండుఁ డేమెంచు ని
స్తులసాహిత్యవిశేషధీరహితచిత్తుల్ మెత్తు, రే మెంత్రు ని
స్తులసాహిత్యవిశేషధీరహితచిత్తుల్ ప్రౌఢకావ్యంబులన్? ౧౩

కం. దోషంబులు పొసఁగినచోఁ, దూషింపక యుండ వేఁడుదుం గుణవిలస
ద్భాషాయోషాహృదయగ, వేషమనీషావిశేషవిబుధాగ్రణులన్. ౧౪

కం. అరయు నెడ దోషగుణములు, పొరసిన లోఁ గొంద్రు బయలు పుత్తురు విబుధు
ల్గరళముఁ గంధరమున నిడి, శిరమున ధరియింపఁడే శశి శంకరుఁడున్. ౧౫

వ. అని ప్రారీప్సితగ్రంథ నిష్ప్రత్యూహ పరిసమాప్తికి సంప్రదాయావిచ్ఛిన్నంబుగ
దేవతా నమస్కరణంబును సుకవిబహూకరణంబును గావించి యొక్కనాఁడు. ౧౬

చం. ఇరువదియేనుహాయనము లేగెను నేఁటికిఁ జూడ నాయువం
దరయఁగ నర్ధ మేగె నన నా నొకయప్పుడు రామ కృష్ణ యం
చిరవుగ నోరఁ బల్క నిఁక నే నిటు కాలము రిత్త వుచ్చినం
గరుణఁ దలంచునే యముఁడు కాటియ వెట్టక పోవ నిచ్చునే? ౧౭

చం. తెలతెలవాఱ లేచి కడుదీర్ఘపథంబుల ముండ్లు గండ్లు కా
ల్వలు బలితంపుటేఱులును వంకలు డొంకలు రొంపి కంపలు
న్జలములు నాక ద్రిమ్మరి నిశాసమయంబున వత్తు నింటికి
న్బలిసిన చెట్లనీడలును బావులపంచలు నావె కావొకో. ౧౮

మ. అవమానంబు సహించి నిశ్చలతఁ దద్ధ్యానంబునే చేయుచుం
బవలు న్రేయును గూర్కు నాఁకలి దగ న్వారించి శీతోష్ణసం
భవఖేదంబున కోర్చి జాములుగ నిల్వం జేసితే దైవమా!
యవురా సేవకవృత్తి! యోగిగతిఁ జేయం జాలితే యన్నిటన్. ౧౯

ఉ. కోపము రాదుగా పలువకూఁతలు కూసిన వించు నుండినం
దాపము తోఁప దాతపమునం జరియించుచు నెంతె యుండిన
న్లేపనభూషలుం బడయ లేదు మనం బిఁకఁ నేమి చెప్పఁగా
నోపిక లెచ్చెఁ గష్టముల; యోగికి మాకు నిఁ కేమి భేదమో. ౨౦

చం. క్రియలను మాకు యోగికిని గీసయు భేదము లేద దెట్లన
న్భయమున మేము భుక్తికయి, భక్తిని యోగియు ముక్తిపొంటె, బ
త్రయమునఁ గష్టము ల్వడుచు వ్రాలుదు మార యమోపమాను లో
భయదులు దుష్ప్రభు ల్నిజమవంద్యులు కారొకో సేవకాళికిన్. ౨౧

తే. నిష్కపటముగ మది నిల్చె నిష్కపటము,లందు యోగికి బ్రహ్మంబునందుబలెను
సేవకుల నెల్ల యోగులఁ జేయఁ జాలు, వీఁక నధికారు లర్థుల నాకునుతికి. ౨౨

కం. తాఁగ యటందురు పలికిన, మూఁగ యితం డండ్రు మానమును వహియింపన్
జోగి యటందురు సాధువు, యోగికి సాధ్యంబె తప్ప కుండం గొల్వన్. ౨౩

కం. పొట్టకుఁ బుట్టంబునకును, జెట్టగు కష్టంపుఁగొల్వుఁ జేయఁగ నేలా
పుట్టించినవిధి నోరను, బెట్టించునె కసవు మొసవఁ బెట్టఁడె కూడున్. ౨౪

కం. ఆపత్కాలమునందును, గూపింపం బడనికొల్వు దూఢిగఁ జేయన్
జాపం బని విడ నింట, న్నాపకటకు లేదు పూఁటసామగ్రి కటా. ౨౫

శా. లా వొక్కింతయు లేదు సేద్య మవలీలం జేయఁగాఁ గానమోఁ
జేవం గ్రాలదు గుత్త కైన నొసఁగం జే నేని లే దొక్కఁడు
స్నీవీనూన్యుఁడఁ జేయ నె ట్లగునొ వాణిజ్యంబు ప్రాజ్యంబుగ
న్దైవంబా మహిఁ గొల్వుదక్క బ్రదుక న్నాకుం బథం బే మిఁకన్. ౨౬

వ. తద్దోషపరిహారార్థంబు. ౨౭

కం. నారాయణవివిధకథా, పారాయణపరత సతతపరవశుఁ డైన
న్ఘోరభవసంభవం బగు, పోరాములు తొలఁగి పోవుఁ బో రాముకృపన్. ౨౮

వ. అని తలంచి విబుధప్రమదప్రదంబును సుగుణానుబంధబంధురంబు నగు నొక్క
ప్రబంధంబు రచియింపఁ దలంచుచున్నెడ. ౨౯

సీ. శతకోటిశతకోటిశితకోటిసత్ప్రభాకలితోరుకౌక్షేయకంబువాఁడు
ననయమ్ము ననయమ్ము గొనయమ్మునను జిమ్మునించుఁదాలుపుజిగి మించువాఁడు
ఖగరాజఖగరాజఖగరాజవ్రతుఁ డిద్ధఖగరాజరాజుల కనులవాఁడు
ఘనఘనాఘనఘనాఘనఘనాఘనరత్న పృథులకాంతుల విడంబించువాఁడు
కరములను విల్లు బాణముల్ గలుగువాఁడు, పొన్నుదుప్పటి నొప్పెడివన్నెకాఁడు
నొసట నూర్ధ్వత్రిపుండ్రముల్ పొసఁగువాఁడు, జానకీపతి మదిని సాక్షాత్కరించె.

వ. ఇట్లు కరుణాశరధి యగుదాశరథి దోఁచి యేతత్ప్రబంధనిర్మాణంబునకు నియో
గించిన నేనును సుగుణగణసంభావనీయయు సువృత్తసమాదరణీయయు లసదలం
కారకమనీయయు విమలవాక్చతురిమామేయయు నర్థవతియునగు నాకృతికన్య
కాలలామంబు నాయనకు సమర్పించువాఁడనై. ౩౧

కం. ఇర నగు నాకృతికన్యను, హరికి సమర్పించుపుణ్య మబ్బెను నాకు
న్ధరణిని మత్పూర్వభవా,చరితతపఃఫలముఁ బొగడ శక్యం బగునే. ౩౨

కం. జగదధిపతి, నాకృతిపతి యగుచుఁ గరం బలరు టెల్ల హాటకమునకుం
దగులుట కాదే వలపులు, పొగ డొందుట యబ్బురంబె బుధసంఘములన్. ౩౩

కం. నిర్విఘ్నంబుగఁ గొనకొని, సర్వామలలలితవచనసంపద లొసఁగ
న్నిర్వక్రగతిని ఖగరా,జార్వుఁడు కలుగంగఁ దక్కు వగునే యనుచున్. ౩౪

కం. మది నిశ్చయించి సుమతిని, జదివిన విన భక్తియుక్తి సరసకుమారా
భ్యుదయం బొసఁగుకుమారా,భ్యుదయంబు రచింతు విబుధు లుత్కర్షింపన్. ౩౫

ఉ. ఎన్ని భవంబులం దొలఁగు నీక్షితిఁ గావు రటంచు జన్మముం
గన్నది మొదిగా నిఖలకష్టముల న్దనకై సహించుచు

న్నన్నఁ జేసి మన్నుతనమాతయుఁ దండ్రియునప్పఁ జిత్తమం
దెన్నఁడుఁ బాపఁగాఁ దలఁపఁ డేని తదీయమహాఘసంఘముల్. ౩౬

వ. అని తలంచి యేతత్కృతిముఖంబున మదీయవంశం బభివర్ణించెద. ౩౭

సీ. మానితవస్తువితానచంచద్ధామ మై పన్నె కెక్కినయట్టికడప
యఖిలపురీకల్పనాభ్యాసకౌశలస్థిరసరోజాసనసృష్ట కడప
యీశసన్నుత వేంకటేశపాలిత దేశగర్భ ప్రవేశసంకలిత కడప
సకలసౌభాగ్యసత్సౌఖ్యప్రదాయకం బై మేలు ప్రోలుగ నమరు కడప
చెలఁగు నవ్వీట సరిదాఢ్య చిత్రకూట,కూటసమమంజులాలయకూట మతుల
మైనసిరి కాటపట్టు బుధాళివాట, మమరు మోచము పేట సౌఖ్యములమూట.

కం. ఆవీథిని వసియించెదు, భావిభవులు గోలకొండవ్యాపారులలో
డీవి స్మితి చెలంగెడు, వావిలికొలనికొలమందు వఱలెడువారల్. ౩౯



శా. ఘోరం బైనతపోవిశేషమున సద్యోజాతవక్త్రంబునన్
గౌరీవల్లభుచేత దీక్ష గొనియె న్నత్తస్థలం దొక్కఁడై
తారావీథి నలంకరించెఁ గనియెం ద్రయ్యర్థ సంఘాతము
న్నారద్వాజమహామునీంద్రుఁ దగదే భక్తిం బ్రశంసింపఁగన్. ౪౦

ఉ. ఆమునిసాధునన్వయమునం దుదయించె సుధాపయోనిధిం
దామరసారిభాతి వసుధాత్రిదశాన్వయ భూషణుండు భా
షామలహారనాయకమహామణి వేంకటరామపంతులు
స్థీమహిమాధికుండు వరధీరగుణుండు కులాగ్రగణ్యుఁ డై. ౪౧

కం. ఆతనికి నిర్మలతనూజాతుం డై వెలసె వసుధ సవనారంభో
ద్యాతఘనధూమమున ఘన, మూతతముగ ధూమయోని యనుపే రందన్. ౪౨

ఉ. వేంకటరామదీక్షితసువిశ్రుతనాముఁడు సద్గుణోత్కరా
లంకరణాభిరాముఁడు విలాసవిశేషజితాబ్జసోముఁడుం
బంకజలోచనాంఘ్రి దృఢభక్తిసుధాముఁడు సత్ప్రభాసము
ట్టంకితదిగ్వటంకుఁడు ప్రథాకలితుండు మనుష్యమాత్రుఁడే. ౪౩

కం అతనికి గాదిలితమ్ములు, క్షితిలో రత్నాజియనఁగఁ గృష్ణాజియు నా
నతులితగుణమణిహారులు, వితతయశుల్ గలరు వేదవిదు లై యందున్. ౪౪

ఉ. ఆమహనీయమూర్తుల మహత్తరకీర్తి జగాన సుస్థిరం
బై మెలఁగున్ స్థిరాకృతిని నావిధుతారకభాస్కరంబుగా
శ్రీమధువైరిసత్కృపను శేషమహాగిరిఁ గాంచి రంగస
ద్ధామమున న్శిలాస్థలిపి దద్దయు సాక్షి చూడ మదుక్తికిన్. ౪౫

తే పిన్నపంతులు నాంచారుపేరఁ బరఁగు, లలనయందుఁ దగం గాంచె లలితగుణులఁ
జెలఁగి శ్రీలక్ష్మణార్యుని శ్రీనివాసు, రంగరాయాహ్వయుని సుధీప్రథితమతుల.

కం అమ్మహనీయులు క్రమమున, సమ్మతి నుద్వాహ మైరి సరసతమై మం
గమ్మను గుప్పమ్మను లక్ష్మమ్మను శృంగారవతుల సాధ్వీమణులన్. ౪౭

చం. లలితసుధీసుధీరగుణలక్ష్మణలక్ష్మణమంగమాంబలం
దలరఁగఁ బుట్టి రంతట నిరంతర సత్యుఁడు రామచంద్రుఁడుం
జెలఁగెడుసీతమ్మాంబయును శీతమరీచియు లోకమాతయుం
గలశపయోధివీచికలఁ గాంతిని సంపదఁ బుట్టినట్లుగన్. ౪౮

కం. ఆరామచంద్రుకీర్తి వి,హారము జగదాళి సలుప నజవాక్సతులుం
గౌరీశివులును గూటమిఁ, గూరిమి విడ రవలఁ బొందు గూరదొ యనుచున్. ౪౯

వ. అతండు. ౫౦

కం. వరపూతగుణోపేత, స్వరశీలవ్రాత భువనవంద్య స్సీతం
గరిమంబునఁ దాఁ గైకొనెఁ, బరమవిధి న్రామచంద్రుభ్రాతిం బ్రీతిన్. ౫౧

కం. ఆవరదంపతులకు వసు,దేవునకుం దేవకికి విధిజనకుభాతిం
బావన తేజుఁడు కృష్ణుఁడు, భావింపఁగఁ గలిగె వంశపావనుఁ డగుచున్. ౫౨

సీ. పరభామినీసహోదరతఁ జూపునెకాని గోడగింపఁడు వారికూటములను
చే నైనయుపకృతి సేయఁ బూనునెగాని పరులసేగిఁ గన నోపండు మదిని
బరులయందును బంధుభావ ముంచునుగాని బంధులఁ బెఱవారిభంగిఁ గనఁడు
వీరవైరులఁ దానె వెడల నడుచునుగాని పురము వీడఁడు మహాదరముచేత
బలముఁ జలమును విమలప్రాభవము యశము, భాగ్యసౌభాగ్యగరిమను బ్రబలువాఁడ్లి
కొలసికృష్ణునితో సాటిగలరె యొరులు, కృష్ణుఁడైన నాతనియన్న జిష్ణుఁడైన. ౫౩

కం. పరమాదరమున ఫణిపతి, గిరికిం బ్రహ్మోత్సవంబు కేళిం గనఁగా
నరిగి యట బంధు లలరఁగ, పరరతిమై రుక్మిణి న్వివాహం బయ్యెన్. ౫౪

సీ. పేరుమాత్రన గాదు సారరూపంబున రుక్మిణి తా నౌట రూఢి పఱిచె
ప్రవిమలసూనృతవాణీ ప్రవృత్తిని సత్య తా నౌటను జూపె జగతి
మల్లికాకుందకుట్మలనింద కద్యుతిఁ దా సుదంతయె యౌట వాసి తెలిపె
సకలసద్గుణగణసల్లక్షణంబుల లక్షణ యని తెల్పె లలితగతిని
నిమ్మహావరవర్ణిని సు మ్మటంచు, లోకు లెల్లను బొగడ నస్తోకమతిని
రంగు మీఱెను గృష్ణునర్ధాంగలక్ష్మి, రుక్మిణీసతి శోభానిరూఢవసతి. ౫౫

చం అరయఁగఁ గీర్తిధన్య మగునమ్మిథునంబునకుం జనించి రా
హారిభుజతుల్యులై దశరథావనినాథతనూభవాపర

స్ఫురదురుమూర్తులో యనఁగఁ బోణిమి నల్వురు సత్కృపానిధు
ల్వరగుణశీలభానులు ప్రభావవిభావసులై వసుంధరన్. ౫౬

ఆ. రామచంద్రరావు రహిమీఱి లక్ష్మణ, రావు శ్రీనివాసరావు వేంక
టనరసింహరావు నన నొప్పిరి వారు, బుద్ధి నలువ యందుఁ బెద్దవాఁడు. ౫౭

ఉ. ఏకసతీవ్రతోన్నతుల నిమ్ముగ నెంచఁ దొడంగి ధాత యీ
ప్రాకటసత్యనిత్యు రఘురాముఁ గనిష్ఠిక నిల్పి యెవ్వఁడు
న్లేకయె ప్రక్కవ్రేలికి లలిం ఘటియించె ననామికాఖ్య నా
హా కలిరామచంద్రుఁ డలయాఖ్య యొనర్చె నిరర్థకంబుగన్. ౫౮

సీ. తనసాటివారిలోఁ దలవంపు గనినట్టి శేషునిభాషావిశేష మెంత
నిజపక్షనాశంబు నెఱి సహించినమేరుధారణీధర మూనుధైర్య మెంత
వెన్నుడిఁ గను నమ్మునిశ్చలభక్తబాధలఁ జూగుహారినతత్రాణ మెంత
సకలభూజనులను సర్వబాధలఁ బెట్టుశిపనతనూజునిదయ యదెంత
యనుచు వేవేలగతులఁ ద న్నభినుతింప, లోకు లెల్లను మీఱె నస్తోకమతిని
రావులకు మేటి నిస్తులప్రాభవుండు, రామచంద్రుఁడు ధర్మసంగ్రామఘనుఁడు. ౫౯

శా. బాల్యంబందున తండ్రి వాసి చన సద్భావంబున న్నమ్మిలం
గల్యాణాత్మకుఁ డైనకృష్ణుఁడు కృపం గౌరవ్యసంజాతకౌ
టిల్యం బందక యుండఁ బాండవులఁ బాటించెం గదా యట్లు సా
కల్యాఘ్యుం డయి కాచుపిన్నజనకుం గాదే ప్రశంసింపఁగన్. ౬౦

చం. లసదసమానదానగుణలక్షణలక్ష్మణుసద్యశఃపయో
ధి సరగ వేల దాఁటి సముదీర్ణవిజృంభణ మొప్ప నొప్పెఁ గా
వెస శశిశాలిభావలకు వీడక వ్యాగ్రగళగోధిదఘ్న మై
పస చెడ మిన్ను ప్రాఁకినను బర్వత మెక్కిన బ్రహ్మఁ దూఱినన్. ౬౧

ఉ. కోద్భవకోద్భవోద్భవజకోద్భవరంజిత మావిలాసముం
గోద్భవకోద్భవోద్భవజకోద్భవరంజిత మాప్రతాపముం
గోద్భవకోద్భవోద్భవజకోద్భవరంజిత మాయశంబు ది
వ్యాద్భుతవృత్తి నీకె తగురా యని సత్కవు లెంత్రు లక్ష్మణున్. ౬౨

సీ. అన్యవస్త్వపహరణాపేక్షఁ బొఱఁడు ప్రబలారికైనను బట్టువడఁడు
నుడివిననుడు వెట్లుఁ జెడఁగను నడవఁడు చెడుకోప మెన్నఁడుఁ జేర నీయఁ
డన్యాంగనాదేహ మంటంగ నొల్లఁడు ధర్మగుణముపట్టుఁ దలఁగఁ బోఁడు
విడనాడ నోడఁబడఁ డెడఁదనేనియుఁ దనబంధువు నతఁ డెంతపగతుఁ డైన
సహావిశ్రాంతి గాంచు చాశాంతములను, సర్వజనమానసరసన ల్పదనములుగ
లలితగతి నొప్పులక్షణకలితుఁ డైన, లక్ష్మణునిసాటియే యాదిలక్ష్మణుండు. ౬౩

సీ. ఇతఁ డాదిలక్ష్మణుండే యటంచును బల్క సకలసద్గురుభక్తి సాక్షి గాదె
యితఁడు రామానుజుండే యటంచును బల్క రామచంద్రుఁడు గాదె ప్రబలసాక్షి
యితఁ డాదిశేషుఁడే యెన్నిటనే నన సర్వచోళహారియ సాక్షి కాదె
యితఁడు విభీషణునేలిక యని పల్క నాశ్రితరక్షణం బగును సాక్షి
యితఁడు సర్వంసహాధారుఁడే యటన్న, క్ష్మావిజయనిర్భరక్షమ సాక్షి గాదె
యనఁగ నొప్పారె భువి నవంధ్యతరకీర్తి, రావులకు మన్నె లక్ష్మణరావుమిన్న. ౬౪

సీ. భారతీమాలతీవస్తులాయతఘనస్తనఘనసార లేపనముగాఁగ
శారదాగమసమునారసుధాకరమండలమౌక్తికమండనముగ
క్షీరపారావారభూరిరంగత్తరంగ శిఖరరాజతసరసీరుహముగ
ఖర్జూరధరపురకచకలాపవిరాజమానభాగీరథిమాడ్కిఁ దనరు
ధరణి నెవ్వానికీర్తి యాధన్యమూర్తి, బహుళయాచనకచకోరసర్వశర్వ
రీరమణుఁ డుజ్జ్వలగుణహారి హారి, రావులం దెన్న లక్ష్మణరావు మిన్న. ౬౫

ఉ. భావభవోపముండు నుతిభాప్రతిభాధకభావరీతుల
న్భావభవోపముండు నుతభవ్యసురూపవిలాసరేఖల
న్భావభవోపముండు పరిపాలితదానవిధానరమ్యత
న్భావిలికొల్లులక్ష్మణుఁ డవారణవారణవిక్రముం డిలన్. ౬౬

చం. దివికిని శ్రీనివాసుఁ డరుదెంచుట శంభళి విన్నవింపఁగా
నవియఁ గుబేరసూనుహృదయంబు తటాలున రంభ వచ్చి దా
నవబిసహారవల్లరుల నవ్వుచుఁ గంఠమునందు వైచి నే
కవుఁగిటఁ జేర్చెఁ జిన్నిపులకల్ చివురింపఁగఁ జన్నుఁ గ్రేవలన్. ౬౭

సీ. తనపుట్టినింటిని ఘనకీర్తిపాల్ సేసె మాన్యుఁ డౌఁగాక సామాన్యుఁ డగునె
పెంపు గానఁగఁ జేసెఁ జేర్చిఁ దోఁబుట్టుల మాన్యుఁడౌఁగాక సామాన్యుఁడగునె
దాయాదులే నాక దగవుగా వగ నేచె మాన్యుఁ డౌఁగాక సామాన్యుఁ డగునె
స్నేహంబుచేఁ జేరఁ జెల్వారఁ గాఁగాచె మాన్యుఁడౌఁగాక సామాన్యుఁ డగునె
ధర్మపరుఁ డీతఁ డన మించుఁ దమ్మిచాలి, నంబుజారిని బలవైరి నాశ్రయాశు
వైరిగజసింహ వేంకటనారసింహ, రావు విశ్రుతశౌర్యధైర్యముల తావు. ౬౮

సీ. అహరహోభ్యర్చితహరిసతీయాచనకకదంబపంరంభ కనకమాంబ
లలితసువ్రతరతకలితసద్గుణముల పెన్నిక్క రామక్క వన్నె కెక్క
సంతతకృతబంధుజనమనస్సమ్మోదసంగమ యైనట్టిరంగమయును
సిదసౌందర్యవిశేషసంప్రాప్తిని బంగారుబొమ్మ సుబ్బమ్మ యనఁగ
నంగభపదంతిమలఁ బోలునఘనతుల, వరుసఁ దప్పక [illegible]ర ఉద్వాహ మైరి
యందు నగ్రజనకు నుదయంబు నొంది, రైహి కాముష్మికసుఖదు లాత్మభవులు.

వ. అంతనగ్రజుండు. ౨౦

చం. వినయవివేకపోషుఁ డతివిశ్రుత సత్యవచోవిశేషుఁడు
సజ్జననుతవేషుఁడు ఘనవిశాలయశస్సువిశేషుఁడు స్సనో
వనజసమర్చితాచలనివాసకశేషుఁడు ధూతదోషుఁడుం
బొనరఁగఁ గంజజాతకులభూషుఁడు శేషుఁడు మాన్యుఁ డన్నిటన్. ౨౧

తే. అతని కాలయి విలసిల్లె నవనియందు, సుగుణమణిపేటి లావణ్యశుద్ధిపాటి
యింతులను మేటి యామరునింతిసాటి, జాళువాబొమ్మ యనఁ దగుజానకమ్మ. ౨౨

చం. వరునకు గాసి తేర దొకపట్టున నైనను గోప మూని ని
ష్ఠురవచనంబులం బలుకఁజూడదు బ్రాహ్మణవంశపావనికిం
దొరకొన దార భూమిని సుతుల్లను నూరులు నాకు లెంతయు
న్నారిది నుతింప జానకి విశుద్ధతకై మఱి పుట్టెనో యనన్. ౨౩

తే. శేషగిరిరావునకు మితభాషణునకుఁ, దమ్ము లిరువురు గలరు యశమ్ముఁగూర్చు
సుబ్బరాయఁడు శేముషీస్ఫూర్తి మెఱయు, రంగరాయఁ డనంగ సత్సంగరతులు.

వ. అందు. ౨౫

కం. సకలుండ సుబ్బరాయఁడ, సుకరమరిద్యౌకలబ్ధసుందరతరవా
జ్జకరందబిందుతుందిల, ప్రకటకవిత్వాతిముదితబంధుజ్ఞుండన్. ౨౬

## షష్ఠ్యంతములు.

కం. ఓంకారవాచ్యునకు దుర, హంకారవివర్జితునకు నఘరహితునకుం
బంకజనాభునకును భవ, సంకటహరణునకు జనకజారమణునకున్. ౨౭

కం. రాధారమణీరమణీ, యాధరబింబశుకమునకు నభ్రపదునకు
న్రాధానందనవిధికి వి, రాధశిరోధిహరదాశరథికి విరథికిన్. ౨౮

కం. మాధవునకు సంతుష్టరు, మాధవునకుఁ బాలితసరమాధవునకు శ్రీ
మ్మాధవునకు నిహతాంగద, మాధవునకు రూపవిజితమాధవున కిలన్. ౨౯

కం. యజ్ఞాహితదుర్హృదునకు, యజ్ఞాహితసుహృదునకును యజ్ఞేశునకుం
బ్రజ్ఞాసమగ్రునకు మ, ద్విజ్ఞాపనగీరుదితమతికి సుద్గతికిన్. ౩౦

కం. నగధారికిని గదారికి, నగదారికి నజని హేతునగధారికిఁ బ
న్నగదారికిఁ గలితారికి, విగతారికి భుక్తిముక్తివితరణమతికిన్. ౩౧

కం మస్కరధరమస్కరగన, మస్కరణోన్మదితహృదయమస్కరిపతికి
న్భాస్కరజితభాస్కరశత, భాస్కరసుతహితగృహీతభాస్కరజునకున్. ౩౨

కం. ధరణీవరధరణీవర, ధరణీవరచంద్రునకును దరధరునకు మా
తరుణీవరధరణీధర, హరిణీవర వినుతునకును హరిశయనునకున్. ౩౩

వ. సమర్పితంబుగ నాయొనర్పం బూనిన శ్రీకుమారాభ్యుదయంబునకుం గథా
ప్రారంభం బెట్టి దనిన. ౮౪

ఉ. పుణ్యము నైరిజంతుపరిపోషితశోషితనృగాహి నాగము
ద్గణ్యము సంయమీశ్వరతతప్రతికృత్యవిహీనయాగనై
పుణ్యము నిర్జరీతతపభుస్వనగణ్యము మించు నైమిశా
రణ్య మగణ్యపుణ్యమునిరాజవరేణ్యశరణ్య భూమి యై. ౮౫

వ. అందు. ౮౬

కం. దోషం బని గ్రసియింపవు, ఘాసనుమమరందబిందుకమ్రఫలాళు
ల్మీసతిపతి ఋషు లంద ఱు, పోసించినదాఁక హరిణభసలశుకంబుల్. ౮౭

కం. గండూషీకృతసుకథా, మండలు మునిమండలాప్తు మధురతరవచో
మండితు సూతునిఁ గని ముని, కాండంబులు పలికి రిట్లు కౌతుకముమెయిన్. ౮౮

కం. సూత సుధామధురవచో, వ్రాత నతత్రాత విష్ణురమ్యగుణకథా
పూత పురాణార్థవ్యా, ఖ్యాత దయోపేత రోమహర్షణజాతా. ౮౯

కం. ధీరునిఁ గమనీయశుభా, కారునిఁ గుసుమశరసారుఁ గాముకలోకా
ధారునిఁ గుమారు నతిసుకు, మారునిఁ గమలాకుమారు మాకు న్వీరున్. ౯౦

కం. శంకరుఁ డగజాచిత్తవ, శంకరుఁడు స్వభక్తనికరశంకరుఁ డేలా
శంకరుఁ డై మెలఁగక యే, శంక రహింప కెటు త్రుంచె సాహసలీలన్. ౯౧

ఉ. ఓలిఁ గపాలిఫాలనయనోద్భవభీకరకీలికీలలం
గాలి స్వరూపము న్విడిచి క్రమ్మఱ నిమ్మహిలోన రుక్మిణీ
బాలకు నుద్భవించి తనుఁ బావఁడటంచన కద్ధి యైన నా
యాలరిశంబరుం దునుము టంతయు మా కెఱిఁగింపు మింపుగన్. ౯౨

కం. అని తను ఋషు లడిగిన విని, ఘన మగుముద మెందను బోదలఁ గమనీయసువా
క్కని వారలఁ గనుఁగొని యను, ననురాగమతోడ నురుచిరాలాపములన్. ౯౩

కం. వాకొనియెద నూఁకొనుఁడీ, ప్రాకట మగుదక్షకృతతిరస్కారమున
న్నీకాళి మడియఁగా ను, శ్లోకుఁడు భర్గుండు దన్ను లోకము పొగడన్. ౯౪

కం. భాసురమహిమాసమకై, లాసధరాధరశిఖరతలంబున యోగా
భ్యాసంబున నచలుం డై, చేసె మహాతపము ధీరచిత్తుం డగుచున్. ౯౫

ఆతనితపోగ్నికీలల, జాతము దుర్వార మగుచు సంతప్తజగ
జ్జాతం బై సుమనోగణ, భీతిద మై యెల్లయెడలఁ బేర్చెఁ బరువడిన్. ౯౬

ఆ. విష్టపత్రయంబు కష్టంబుఁ జెందెఁ ద్రి, విష్టపప్రభుండు వెగడు పడియె
శిష్టవినుత మైన శ్రీభోగభాగ్యవి, స్తారపదవి తనకుఁ దలఁగు ననుచు. ౯౭

వ. అంత నొక్కనాఁడు. ౯౮

కం. తారాగణపరివృతుఁ డగు, తారాధిపుఁ బోలి శితశతారము గేలం
దా రంజిల్ల నుదారత, దారాన్వితుఁ డగుచుఁ గుధరదారుం డొప్పెన్. ౯౯

వ. ఆసమయంబున. ౧౦౦

ఉ. బంగరురంగుపొంగు నడఁపం గలచన్నవబల్బెడంగు మే
ల్రంగము గాఁగఁ బయ్యెద చెలంగఁ దగ న్సరిగంచుచుంగులుం
జంగునఁ జిందు ద్రొక్కఁ బదసంగతి నందెలు మ్రోయ మోవిపై
నం గులుకుల్ ఘటింపఁ జిఱునవ్వులు మేనక వచ్చెఁ గొల్వఁగన్. ౧౦౧

చం. కుసుమవితానమానితము గొప్పగుకొప్పు భుజంగచేతనా
గ్రసనచణంబు భావపరిగర్భితదృష్టియు మందహాసనా
ట్యసదన మోష్ఠము న్సురవిటాలివిలోకనషట్పదోజ్జ్వల
త్ప్రసవగుళుచ్ఛముల్ చనులు గ్రాలుఘృతాచియు వచ్చెఁ గొల్వఁగన్. ౧౦౨

కం. తీవులతా నై తావుల, తా వై తా వలపులకును దావల మగుచుం
జేవ చివుర్పఁగ హేమయు, దావిరి నరుదెంచె సురలు బాపురె యనఁగన్. ౧౦౩

సీ. కప్పొప్పుతనగొప్పకొప్పలినీచయం బని గండుఁదుమ్మెద లరుగుదేరఁ
దాంబూలసంవర్ధితారుణోష్ఠము బింబఫల మని చిల్కలు పరుగువెట్ట
భర్మవర్ణోజ్జ్వలబాహాయుగ్మము మృణాళాశయంబున నంచ లాశపడఁగఁ
గలహంసనడలతోఁ గలహించుపదములఁ గుందె లంచల రచ్చ కమరఁ బిల్వ
లీల దరహాసచంద్రికాజాలకంబు, విబుధనేత్రోత్పలాళికి విందుగాఁగ
నూర్వశియువచ్చె సద్వయోగర్వమునను, సారసాక్షులు చెంతలఁ జేరి కొల్వ ౧౦౪

సీ. వదనవిలాససద్వైభవం బుడుపతిస్పర్ధాళువుగ బొట్టు సరసఁ బెట్టి
సురకుంభికుంభమత్సరవర్ధనస్తనయుగళంబుపై రైక బిగియఁ గట్టి
శ్రీవిలాసంబు నిసీ యనుచెవులను గమ్మల గొలుసులఁ గడఁక నిలిపి
నీలాంబుజంబులనీటు గీటునఁ బుచ్చుకనులఁ గజ్జలరేఖ నునిచి దిద్ది
నయనవిజితహారిణి నవనవలావణ్య,భరణి యానహసితకరిణి జఘన
విజితధరణి వరపవిధరసంసేవకై, హారిణి వచ్చెఁ గొల్వుసరణిఁబట్టి. ౧౦౫

సీ. కుంభికుంభస్మయాలంభసత్కుచకుంభ పీతతనూజితశాతకుంభ
సారంగకరరుచిరోరురంభాస్తంభ నిశ్చలయావనాన్వితవిజృంభ
కుంభినీధరవరోజ్జృంభకటీదంభ శుంభద్విలాససంస్తంభకుంభ
యాయజూకముదావహాగళితారంభ మల్లికాకోరకమంజుదంభ
బంభరవినీలకేశకుసుంభవర్ణ, శుంభదంశుకకనదవష్టంభమునను
జంభదనుజారిఁ గొల్వ నదంభరక్తి, రంభ చనుదెంచె నధికసంరంభమునను. ౧౦౬

కం. క్రతుముఖభాగబవరద, త్రతతహవిశ్చరునిచయవితరణముదితస
త్త్రతుభుజ్నికరుండగుచును, హుతభుజుఁడరుదెంచెను బురుహూతునిసభకున్.

కం. దండితపాపకలంకిత, మండలుఁ డై పాశదండమండనుఁ డగుచుం
జండభటపరివృతుండై, దండధరుఁడు వచ్చెఁ గులిశధరుసన్నిధికిన్. ౧౦౮

కం. అసురసంఘము గొలువఁగ, భాసురదంష్ట్రావళీ ప్రభాభరజనసం
త్రాసదుఁ డగుచు న్నైఋతపు, వేసంబునఁ బొలసుతిండి విసవిస వచ్చెన్. ౧౦౯

కం. సురుచిరదినాంతవేళా, జరఠతరణికోష్ణకరనిచయరక్తశ్రీ
హరిదధిపతి జలనిధిపతి యసుణుం డరుదెంచె దివిజవరుఁ గొల్వంగన్. ౧౧౦

కం. తుంగకురంగతురంగా, భంగురలంఘననిషంగభంగిభుజంగీ
భృంగాంగరంగపరిమళ, సంగతిఁ బవనుండు వచ్చె శచిపతికడకున్. ౧౧౧

ఆ. విత్తరాజు మనుజవీతివిరాజి యై, రాజసమున నుత్తరదిశరాజు
రాజరాజు వచ్చె యోజిత శ్రీభర, రాజి యగుచు నమరరాజుఁ గొల్వ. ౧౧౨

కం. శ్రేష్ఠతపోనిష్ఠాతిగ, రిష్ఠామతినచలధీవరిష్ఠుం డగుట
న్శ్రేష్ఠసఖుం డమృతాంధః, ప్రేష్ఠునిగోష్ఠిని గనంగ వెడలక నిలిచెన్. ౧౧౩

కం. గురుఁ డురుయోగకళాభా, సురుఁడు బుధాగ్రేసరుండు సురనికర శ్రీ
కరుఁ డరుదెంచెను శిష్యో, త్కరములు గొలువంగ వజ్రధరుఁ జూడంగన్. ౧౧౪

ఉ. అంత ననంతరత్నమహితాసనమందు వసించి యప్సరః
కాంతుఁడు చామరగ్రహణికాకరకంకణశింజితంబు ల
త్యంతముసంబు గొల్వఁగ నిజాంకవిభాసిశచీకుచాగ్రవి
శ్రాంతకటాక్షవీక్షణవిరాజితుఁ డై వెలుఁ గొందు చుండఁగన్. ౧౧౫

కం. మహితం బగుమహతి మరు, న్నిహతిని సుస్వరము లెపుడు నిల్వక మొరయం
ద్రుహిణసుతుం డంబుధిరా, డ్దుహితృప్రియుఁ బొడుకొను చుఁదోఁతెంచెనటన్.

కం. నిరతముపరిచయమహిమనొ, యరయ సతతవర్ణనాతిహర్షితహరిస
త్కరుణాసాదితచేతన, గరిమనొ తనుదాన మహతి గానము సేయున్. ౧౧౭

కం. భర్మాంగలసితసతులును, ధర్మకవచధరులు మేటితపసులు యోగు
ల్ధర్మప్రభృతులు గొలువ సు, ధర్మం గొలు వుండి నాకధవుఁ డి ట్లనియెన్. ౧౧౮

మ. పవనాంభోధవశంబరోద్భవదిశాపాలాదిబృందారకు
ల్నవలావణ్యవిలాసభాసురసురీనానామునివ్రాతముల్
సవు రొప్పంగ నలంకరించిరి కదా సంప్రీతులై పార్వతీ
ధవుఁ డేలా చనుదేఁడు నేఁడు సభకుం దథ్యంబుగాఁ దెల్పరే. ౧౧౯

శా. పౌలోమీధవుఁ డీగతి న్సురల సంప్రశ్నంబు గావింపఁగాఁ
గైలాసాలయుసంగడీఁ డిటు లనుం గాత్యాయనీదేవికై
కైలాసాచలకూటమందు ఋషిదీక్షం బూనుటం జేసి తాఁ
జాలండయ్యె శశాంకమౌళి తపముం జాలించి వ్యర్థార్థుఁ డై. ౧౨౦

చం. ఇదియ నిదాన మంచును నిధీశుఁడు వల్కఁగ నిక్క మింతయు
న్వదలనినిష్ఠఁ బూని యనివారణధారణ భద్రవారణుం
డదయత లోక మెల్ల విలయం బొనరింపఁ దలంచినాఁ డహో
మది సురనాథ దీనికిని మాఱు దలంపఁ గదయ్య చయ్యనన్. ౧౨౧

చం. జగదధ్యక్ష భయావహోభవతపోజాతాగ్నికీలావళు
లొప్పుగుల స్ఫీకరతీక్ష్ణదావకశిఖ ల్వ్యాప్యాటవిం గాల్చురీ
తిగ లోకాళి దహింపఁ జొచ్చె లవమేఁ దెంపు న్మదిం డింపఁ జై
ట్లా గదే మా కిఁకఁ బ్రోవఁ దెల్పఁ గదవే లోకాళి మే లెంచవే. ౧౨౨

చం. అని నిజఫాలకీలితకరాంజలులై సురలెల్ల భీతులై
వినయము దోఁపఁ బల్కఁగను వేగిరపాటుల నారిపాటు దాఁ
గనుఁగొని జీవుఁ డున్నెడ మొగంబయి యంజలి సేసి భక్తి ని
ట్లనియె సురాధినాథుఁడు మహావినయాన్వితవాక్పరంపరన్. ౧౨౩

కం. ఏపదవిఁ బొందఁ గోరెనొ, నాపదవిం బొందఁ గోరునా భువనౌఘం
బాపదఁ గుందెడి వేఁడిమి, యాపద మాన్పంగదయ్య యాపదరీతిన్. ౧౨౪

కం. నిస్తులశితికంఠతప, ప్రస్తుల మై కుందునస్మదాదుల కెల్లం
గస్తిం బాయునుపాయముఁ, బ్రస్తుతమతిఁ జెప్పవే యపార ప్రతిభా. ౧౨౫

కం. గురుఁడవు ఘనకరుణాభా, సురుఁడవు సకలసురనికరశుంభన్మోదా
కరుఁడవు మద్గురుఁడవు శ్రీ, హరునితపోభంగ మెట్టు లను వగుఁ జెపుమా. ౧౨౬

కం. భువనకచవినియమోహిత, భువనముల భనత్కృపాబ్ధి భువనంబులచే
నవనం బొనరిచి భువనజ, భవునిపునస్సృష్టికార్యభర ముడుపఁగదే. ౧౨౭

కం. పుష్పశరారితపోభవ, బాష్పావనభవనభువనవరివసితుం డా
గీష్పతి హర్షముతో వా, స్తోష్పతి కిట్లనియె విహిత సూక్తులు మెఱయన్. ౧౨౮

కం. దీని కొకయుపమఁ జెప్పెన, మానుగ నీ వాలకింపు మఱి నీచే నా
చే నిఁకఁ గా కుండుట నీ, మానవతిమణులఁ బంపుమా పనిఁ దీర్పన్. ౧౨౯

కం. సూచివశీకృతకాముక, యాచనకనితాంతసుఖవిహాయితకుశలా
సేచనకసుందరాంగులు, లోచనలబ్ధికి ఫలంబులు గదే పాత్రల్. ౧౩౦

కం. నూటిగ భవ మనుసంద్రము, దాటఁగఁ బాటించుమునులతపము లనుతెరు
లై టొందు మదవతీకుచ,కూటాహతి మదనపవనకుంఠిత మగుచున్. ౧౩౧
కం. తిరముగ సంసారంబునఁ, బొరలెడిపూరుషులచిత్తములు దవిలింప
న్మరులొదవ మరుఁడునన్నిన, యురులుకదా సతులకురులు నూహింపంగన్. ౧౩౨
మ. నవలావణ్యము నీరు తమ్మి ముఖము న్హల్లారము ల్నేత్రము
ల్నవచూడ్కు ల్భ్రమరాళి కుంతలములా శైవాలముల్ మేటిజ
క్కవలుం జన్నులు శ్రోణులు న్దటగతగ్రావాళి గా వారమా
నవతిగాత్రసరోవగాహమున నానందింత్రు కా దే మనో
భవనారాచనుతప్తగాత్రులు స్వతాపం బాఱ నవ్వారిగన్. ౧౩౩
సీ. అతనుభూతాతిబాధితపాంథపాళికి రామాహ్వయంబు శ్రీరామరక్ష
దర్పకసన్నిపాతజ్వరవ్యాప్తికి నధరామృతంబు సిద్ధౌషధంబు
మన్మథాస్త్రకలితమహితవ్రణములకు లేపనం బురుకుచ లేపనంబు
పథికాంత కేక్షణపరికంపితులకు నభయహస్త మూకరస్పర్శనంబు
కామశాస్త్రకర్మకర్మఠులకు నని,మేషభావదంబు మెలఁతచెలువు
యోషిదచలభక్తియోగైకసాధ్యంబు, మోహనాంగినీవిమోక్ష మరయ. ౧౩౪
కం. అత్యుగ్రధూర్జటితపః, ప్రత్యూహంబునకుఁ బంపు రంభాదుల నౌ
చిత్యయుతం బిపు డియ్యది, యత్యంత మవశ్యక మేని నరయుద మవలన్. ౧౩౫
కం. రంభాదివారయువతులు, శంభుతపోభంగకర్మ చణ లగుదురు వి
స్రంభార్హలు సౌందర్యా,రంభలు త్వద్వాంఛితాచరణసారంభల్. ౧౩౬
కం పౌలోమీధవుఁ డంతట, గోలోమీగణముఁ గాంచి కుతుకముతోడ
న్నీలో మాపనిఁ దీర్పఁగ, హేలావతి యెవతె యోపు నెఱుఁగఁ దెలుపరే. ౧౩౭
కం. అని రంభ చాయఁ గనుఁగొని, యను ననురాగంబు తొలఁక సాదరఫణితి
న్ఘనవేణీవిసరంబున, ఘనసుందరవృత్తిఁ బ్రథమగణ్యవు కావే. ౧౩౮
చం. అగణితతావకీనసువయోతివిలాసవికాసలోకనా
శుగశతధాభిదాహృదయసూనశరాసనతాపనష్టచి
త్తపురుషాళిజీవనప్రదానవిధానప్రథావిధాలస
న్మృగమదగంధబంధురసుహృద్యపయోధర వోట చోద్యమే. ౧౩౯
కం. నీకొఱకుఁ గాదె పుణ్యులు, నాకంబును గోరు టెల్ల నాకొఱకట వే
నీకొఱకుఁ గాదె ద్విజులుఁ, లోకంబున సప్తతంతులోలుభు లగుటల్. ౧౪౦
కం. నీగణనీయవిహారా,భోగము నొకమాటు గనులఁ బొడగనిన మహా
యోగుల జోగులఁ జేయవె, భోగంబులఁ గఱపి మరపి భ్రూచలనములన్. ౧౪౧

కం. ప్రళయము నొందిన వేళల, లలనా దరహాసకలనలబ్ధస్మృతులం
జెలువుగఁ జేయుదు విటులను, దలపఁగ నీకు నిది కష్టతరమే తరుణీ. ౧౪౨

మ. స్వకసుధారాహతిఁ గానికార్యముల నోసంపూర్ణచంద్రాస్య నీ
సరసాలోకనచాతురీమహిమల న్సాధింతు నక్లోట నా
స్వకరు నాలంకృతిమాత్ర మా బెళుఁగనే జంకెల యింకైన శం
కరుచిత్తంబుఁ గలంచి యీభువనము ల్గావంగదే పైదలీ. ౧౪౩

వ. అని యందఱం గనుంగొని. ౧౪౪

సీ. క్షణమాత్రమునను వీక్షణమాత్రమున నిల్వ నీరుగాఁ బోవరే నేరుపగలు
నాలాపన మొకిరతే యాలకించినయంత గండశైలము లైనఁ గరఁగి పోవె
పాటలాధరలార పాటఁ బాడినయంత మ్రోడుమ్రాఁకులు నును మొలక లిడవె
కూడినభుజగుల్కుట్టమితము గన్నఁ గుట్టమితంబుగాఁ గొదవ విటుల
కట్టిమాయట్టిదిట్టలపట్టు కలిగి, నెట్టన జగంబు చెట్టఁ జేపట్టు చుంద
నెట్టుచూ పెట్టుకొందునో యింతులార, సరసముగ నేగి చెఱుపరే హరునితపము. ౧౪౫

సీ. గాధినందనతపోగర్వంబు నణఁపరే భ్రూలతాక్షిప్తిని బాలఁతులార
బదరికాశ్రమవాసు భంగపెట్టఁగఁ బోయి మేటిగాఁ గొనరె యీబోటులు నటఁ
బర్వతంబుల మేటిపర్వతంబును నీరుగాఁ గరఁగింపరే కాంతలార
నిస్తులమునితపోనిష్ఠలఁ జెఱుపరే నిమిషమాత్రంబున నెలఁతలార
యింతులార మనోజుపూబంతులార, జాణలార జగావేల్పుగాణలార
భామలార సుసౌందర్య సీమలార, మాన్యలార సుసౌజన్యధన్యలార. ౧౪౬

సీ. విడువనినిష్ఠల విఱ్ఱవీఁగుట లేదు పెండ్లమునకై కడగండ్లు వడఁడు
సురతంబు మదిలోన నిరసించుటయు లేదు మునులభార్యలఁ గూడు మోసగాఁడు
నాదిభిక్షు వటంచు నతకరింపఁగ రాదు వినుతమహైశ్వర్య ఘనత కలఁడు
వార్ధకమునఁ గార్శ్యవంతుఁడౌ తఁడు గాఁడు పర్వతంబుల నైన వంపఁ గలఁడు
కావునను మీకుఁ గష్టంబు కాదు హరుని, తపముఁ జెఱుపంగ సులభసాధ్యంబ మీర
లెంత వారల నైనను జెంతఁ జేరి, యొడిని వైవరె చెలులార గడియలోన. ౧౪౭

కం. భర్గతపోభంగంబున, స్వర్గం బేలింప లేరె స్వర్గపదశ్రీ
సర్గముఁ దొలఁగించెదరే, దౌర్గత్యము పాలు సేఁత తగునే మీకున్. ౧౪౮

వ. అనిన వార లిట్లనిరి. ౧౪౯

కం. ఉగ్రుం డఁట భీముం డఁట, యాగ్రహమునఁ దపము సేయు నఁట యబలలచే
నిగ్రహము పొందు నఁట మా, కీగ్రహచారంబు కతన నెగ్గొదవెడినో. ౧౫౦

కం. రిసి యగు విశ్వామిత్రుఁడు, గుసిగుంపులు వెట్టి గోడు గుడిపింపఁడె తా
మసి గాఁడె శరభుఁడు తా, మసి యగుటకు సందియంబె మతి డగ్గఱినన్. ౧౫౨

కం. పోకడ కలిగిన నది కడ, పోకడ కే మనికి గనఁగఁ బోలదు చిత్త
మ్మాకర మాఁకరమునకుం, గా కుండఁగ మమ్ముఁ గరుణఁ గావవె దేవా. ౧౫౩

సీ. వల్లకాటను సదావాసంబు వేసంబు పాషండదుర్మతప్రస్తుతంబు
మాసినపులితోలు వాసంబు గ్రాసంబు పునుకను భైక్షాన్నమును గ్రసించుఁ
బూసినబూది దధివాసంబు వీసంబుఁ బడయఁడు నీటి నిల్కడను మోయు
రూఢి యూతనిమది రోసంబు మోసంబు కాదు పౌరుషవృత్తి కడమువడుట
స్ఫుటముగా లేదుసత్త్వమంగిటనువిసము, పాములాడించుకొనుచును బ్రతుకుచుండుఁ
గొంటెతలనుగోఁపురంబుంచుమండుఁడతఁడు, వలతు రేయిట్టివానినేపోలఁతులైన.

ఉం. నవనవనీతకోమలఘనాఘననీలసుకేశవాశ లే
భువనమునందు నేనియు నపూజ్యపుఁబుస్కలఁ దాల్చువారల
న్నిర్వసనదేహుల న్విగతబీజుల వెండి విరూపనేత్రులం
బలనభుగోఘభూతగణబంధురుల న్మది నిచ్చగింతురే. ౧౫౪

ఆ. పాఁపకూట మెపుడుఁ బాయఁడు దాలుచు
నంగిటను విసంబు నింగలంబు
కనులఁ గురియుచుండుఁ గాన నీబోఁటి నే
బోటు లైనఁ జేరఁ బోదురయ్య. ౧౫౫

సీ. ఆదిభిక్షుకుఁ డయి హాలాహలము మ్రింగుహరుఁడు వేశ్యామనోహరుఁడె యెందు
నిర్ధనుం డయి చెట్లనీడల వసియించుహరుఁడు వేశ్యామనోహరుఁడె యెందుఁ
గాలు సేతులు లేక మూలలో నుండెడిహరుఁడు వేశ్యామనోహరుఁడె యెందు
బోడిబాఁపలతోడఁ గూడియాడెడుజోగి హరుఁడు వేశ్యామనోహరుఁడె యెందు
భువనమోహనలీలాప్రభూతపురుష, వివిధమోహనదేవత ల్వేశ్య లేఁడ
విగతవస్త్రవిరూపాక్షవికృతవేషు, లగుచుఁ బరఁగెడిషా రేడ నగవిదారి? ౧౫౬

వ॥ అదియునుం గాక. ౧౫౭

సీ. బృందారకసుబృందబృందారకముకుందకుందాదినిధినాథవందితుండు
మారుతౌఘాహారహారచారువిహారిహారిగౌరీమనస్సారసరవి
ధీరావనోదారదారదాబ్జాకారకారనానాసురకారకుండు
గంగాపగాభంగభంగాగ్రసారంగరంగసంకలితోత్తమాంగకుండు
కనఁగఁ దాపసమాత్రుండె గరళకీలి, వాలుకానూలికాలీఢలోలలోక
భరణహరణమహాటోపపరిణతుండు, శంకరుండు స్వభక్తవశంకరుండు. ౧౫౮

కం. ఏపున నిందాఁకను నీ, ప్రాపున బ్రతికితిమి మేము బ్రతుకుటకు మాకుం
జూపోపమి గలిగినచోఁ, బోపొమ్మనరయ్య యితరభూముల కైనన్. ౧౫౯

ఆ. మమ్ముఁ గనుణఁ జూడు మా ప్రాణమానము, ల్గావఁగదవె దేవ పోవఁ జాల
ముగ్రుఁ జెనకి సనుచు యోషిజ్జనంబులు, దీనవృత్తిఁ బలుక దేవవిభుఁడు. ౧౬౦

కం. ఇం కేమి తెరువు గల్గునొ, పంకజలోచనలు చనఁగ భయ మందెద రా
వంకకు నీసంకటము వి,శంకటగతిఁ దీర్చుధీరజను లెవ్వారో. ౧౬౧

కం. యోచనతోఁ బదిఁకే యా,లోచన కని మీఁది కైత్తి లోచనముల నా
లోచన సేయఁగ నిర్జర,వాచంయమి వల్కె సత్యవాచాయుక్తిన్. ౧౬౨

కం. ఆఁడంగులె యీ కార్యముఁ, బోఁడిమిగను జేయువారు పొలుచుతపపుబ
ల్వేఁడిమి నీకైకూలరె, యాఁడంగియె భర్గుఁ డంతయనదయె తలఁపన్. ౧౬౩

కం. ఇంతు లలంతులు గాని వ,లంతులు కా లేరు రిత్తలంపట కాన
న్స్వాంతమునఁదెలియుమోపెకిఁ,గంతుజనకుఁడోకఁడయతనిఁగనుఁగొనుటొప్పున్

వ. అయినను. ౧౬౫

కం. మాకుఁ బితామహుఁ డగునా, లోకపితామహునిఁ గను విలోలత్వమునం
బ్రాకటగతి నెఱిఁగించుఁ గృ,పాకరమతియుక్తి ననిన నమరపతి వెసన్. ౧౬౬

చం. తరలి పితామహుం డగుపితామహుపాలికి నేగి కాళికా
వరునితపంబు పెంపు ననివారిత మైనజగంబుఱంపు వా
విరి నెఱిఁగించి దైన్యమునఁ బ్రీతి జనింపఁగఁ బల్కె సత్కృపా
పరత నుపాయ మొక్కఁడనపాయత నీ వెత లాఱఁ దెల్పెడిన్. ౧౬౭

వ. అని. ౧౬౮

చం. పదఁడు పదండు పోద మని పల్కి నిలింపులు గుంపుగూడి బ
ల్పుదమున నేగుదేర దనముంగల వెన్కను బారు తీఱి వే
కదలెఁ బులోమజాపతి జగత్పరిరక్షణవాంఛ భారతీ
మదగజగామినీధవసమాశ్రయలాలసచేతనాబ్జుఁ డై. ౧౬౯

తే. సత్యమార్గావలంబు లై చనిరి బుధులు, ఊర్ధ్వలోకంబులందలియొప్పుఁ గనుచు
సత్యమార్గావలంబులై చనరెబుధులు, ఊర్ధ్వలోకంబులందలియొప్పుఁగనుచు?

ఉ. నాకవిభుండు కాంచె లలనాకలనాకలనాదగానసు
శ్రీకము శ్రీకరాబ్జజవశీకరభాకరసాకరాబ్జపీ
ఠాకలితారవస్ఫుటసనాతనలోకము యోగిరాట్సమూ
హాశోకముఁ బాపదారనిగమాకము శ్రీకము సత్యలోకమున్. ౧౭౦

కం. నాకేశుఁ డంతఁ గాంచెను, వీకాశవిలాసకంజవేశు న్నీశు
న్లోకేశుఁ బాపనాశు, న్లోక గ్రథితాను నీత్యలుప్త్వావాసున్. ౧౭౨

వ. కని భక్తియుక్తుండై సాష్టాంగదండప్రణామంబు? లాచరించి కరకమలంబులు ముకుళించి యిట్లనియె. ౧౭౩

ఉ. ధాతవు జీవిజీవనవిధాతవు సర్వసుపర్వకోటికి
న్నేతవు ప్రాతవిద్దల ప్రణేతవు తాతవు భూతకోటిసం
త్రాతవు భక్తభవ్యఫలదాతవు కిల్బిషజేతవు న్జగ
ద్వ్రాతముధర్మసేతువవు తామరసోరువిలాసమందిరా. ౧౭౪

కం. మడికానుగుంటిపై నుక్కడముగ ముక్కంటి తపముఁ గావించెడి బ
ల్మిడిమేలంబుగ దూపను, గడ గనె జగ మెల్ల దీనికడ గనఁగదవే. ౧౭౫

కం. ఘను నిన్ను నాశ్రయించియు, వన టనుసంభ్రమున మునిఁగి వనరుదుమే వి
న్ననువున ననువునఁ బ్రతికృతి, మనమునఁ దలపోయవయ్య మహితప్రజ్ఞా. ౧౭౬

కం. వింగడపుటింగలం బు,ప్పొంగుటచే లోక మెల్లఁ బొం గడఁగెడి నీ
సంగడము చేర మేలు పొ,సంగుటకు న్నందియంబె సజ్జనవినుతా. ౧౭౭

వ. అనిన. ౧౭౮

కం. ఇంచుక దలంచి మది రా,యంచలసరదారు పలికె నచ్చపుఁ బెరిమం
గొంచెపుఁబని కా దిది మీ, రెంచినగతి మనకు వెన్నుఁడే గతి నుండీ. ౧౭౯

ఆ. నల్లనయ్య పాలవెల్లియం దున్నవాఁ, డున్నవితము లెల్ల విన్నవింప
నుపమ లెల్లఁ దానె యూహించు సాగించు, నాతరంబె శివుని సేత నూన్న.

చం. వలమురిదాల్పు వేల్పుఁ గన వచ్చెదఁ జెచ్చెర రం డటంచునా
జలరుహసంభవుండు త్రిదశప్రకరంబులఁ గూడి వేగమే
నిలయము వీడి సారసలినీగ్రసనాలసహంసఘోటకా
కలనము నొప్ప నేగె ధుతకల్మషమాధవదర్శనార్థ మై. ౧౮౧

వ. ఇట్లు చని. ౧౮౨

ఉ. అం దరవిందమందిరుఁ డనంతముదంబునఁ గాంచె సుందరేం
దిందిరబృందమందిరవినిర్మలకాంత్యరవిందపుంజసా
నంద మమందనందనసనందనవందితనందనందనా
స్పందము నిందిరాంగవరచందనగంధముఁ బాలసంద్రమున్. ౧౮౩

శా. అంతర్భ్రాజితబాడబానలసధూమాగ్నిచ్ఛటాకాంతు లం
తంత న్వెడ్క బహిఃప్రదేశగము లై వ్యాపించె నా నింపుగ,

ధ్వాంతశ్యామలబంభరోత్కరము పైపైమూఁగ రక్తాంబురు
ట్పుంతానంబు నితాంతకాంతిఁ జెలఁగె న్నమ్మోదముం గూర్చుచున్. ౧౮౪

సీ. గరళకంధరనామధరుఁ డయి హరుఁ డుంట గనుఁగొన నీతనికతనఁ గాదె
శ్రీయుక్తుఁ డైశౌరి చెలువు గాంచుట లెల్లఁ గనుఁగొన నీతనికతనఁ గాదె
వెలిగారుపై తీవి వెలయుట యింద్రుండు గనుఁగొన నీతనికరుణఁ గాదె
పలుసౌఖ్యముల కాటపట్టు నాకం బంట గనుఁగొన నీతనికరుణఁ గాదె
నామమునఁ గాదు లసితసద్ధామమునను, బ్రస్తుతగుణావళులయందుఁ బాలరాశి
భాగ్యరాశి ప్రభాభాసి పటుపలాశి, శాసి సువిలాసి యనిషాసివాసిసురలు. ౧౮౫

సీ. శౌరి శ్వశురగేహసౌఖ్యానుభూతికై యిల్లటంబుండఁగఁ జెల్లు టెల్ల
దారుణమరణసంత్రాసంబు వాయంగ విబుధు లమర్త్యులై వెలయు టెల్ల
నడుగుటే యడ్డిగా నిడుపెయ్యకలుచెట్లు గలిగి నిలింపులు గులుకు టెల్ల
సోమాసులై నరుల్ నేమంబులఁ జరించి యచ్చరలం గూడి యలరు టెల్ల
నతులు నలంక్రియామాత్రమై వెలుఁగక, లబ్ధసాఫల్యమునను జెలంగు టెల్ల
నీదయారాశికరుణచేఁ గాదె యనుచు, క్షీరవారాశిఁ బొగడిరి సారమతిని. ౧౮౬

విచికలిత. కనుఁగొని నయమును బ్రియమును గడలుకొనఁగ సరసి జా
సనుఁ డను సురనికరముఁ గని సరగున మనమున హరి
న్వినయము దొలఁకఁగ వినుతులు వివిధగతుల మనము చే
సిన నెదురుగఁ గనఁబడినను జెలు వలరఁగ మనవులన్. ౧౮౭

కం. ప్రీతి సలుపుదము మనల, స్మితరుణీనాథుఁ డలరఁ జేసెడి ననుచు
న్వే తగ వినుతులు సేసిరి, శ్వేతాకూపారతీరసీమ న్స్వామిన్. ౧౮౮

కం. ఆయ్యా! మాయాపదలం, జయ్యన వారింపవయ్య చనుదేవయ్యా
యియ్యెడకు దయామతితోఁ, గుయ్యాలింపవె యటంచుఁగూయిడిరిసురల్. ౧౮౯

వ. ఇట్లు మొఱ లిడుచున్నసమయంబున. ౧౯౦

శా. క్షీరోదాంతరభాగమందు విలసచ్ఛేషాహితల్పంబున
క్షీరోదాత్మజ మందహాసలలితశ్రీనర్మభాషావళీ
హారాత్మీయమనస్సరోజ యయి పాదాబ్జంబు లొత్తంగ లో
కారాధ్యుండు విపన్ననిర్జరగణాహ్వానంబు వీతెంచినన్. ౧౯౧

సీ. కలుములచెలి దేహకాంతులు చెంతల హొన్నువల్వ కొకింతవన్నె వెట్ట
యిందిరాసుందరీదృ ఙ్మిళిందంబులు తనుకాంతి కొకవింతతళుకు లూనఁగ
నరిదరంబులనిగ్గు లరిదరకరములై యుభయకరంబుల నొప్పుచుండఁ
బరిసరవర్తులై పరిజనములు ముందు సారూప్యములను బ్రశంస సేయ

నురమునను దివ్యవనమాల యొఱపుగోలుప, వైనతేయాధిరూఢుఁ డై పద్మజాది మండలంబులకును గనుపండు వగుచు, ముందరను దోఁచెభార్గవీమోదకరుఁడు.

వ. ఇట్లు ప్రత్యక్షం బైనలక్ష్మీశ్వరుం గాంచి హర్షభయసంభ్రమంబులు ముప్పిరిగొన దేవత లెల్ల వినయంబు దోఁప నిటలతటఘటితకరకమలు లై ధ్యానించి రంచు విరించి యిట్లని నుతియించె, నదభ్రవిభ్రమభ్రమణసంభ్రమాభ్రగత శుభ్రాభ్రవాహినీధవాంభస్సదంభాత్యుగ్రాగ్రహో దగ్రవ్యగ్రనిర్వక్రవిక్రమక్రమచక్ర చంక్రమణామ్నాయ మోషకప్రతిపక్ష దక్షరక్షోవరసూక్ష మోక్షకా మోక్ష ఫలప్రదాయకా నమస్కారంబు, వీరాహితదనుజాకృతపీడాధుత ధైర్యార్దితశరణాగతవిబుధాదృతకరుణాన్వితనఖరోదితక్షీరోదమధ్యసవ్యాపసవ్యమథ్యమాననిర్మంథ రమందరమహీధరధారణా రక్షోవరవిదారణా సుందరనయనార విందనిష్యందసానందమందమందదృగంతదర్శనశిక్షితశతా కమఠా నమస్కారంబు, సముదితేక్షణాలోకనదుస్సహ నిబరీసాక్షీణ తేజోజాత దిగంతదంతావళశ్రవోదంతురభయంకరా రావకంపితారాతిమండల ఘోణాగ్రవిదారిత వసుంధరాకార ణాకారణ హిరణ్యాక్ష ప్రముఖక్షపాటశిక్షణవిచక్షణా వసుమతీరక్షణా నమస్కారంబు, హరిదంత చతుర్దంతాదిదంతావళ ధైర్యఖండనబ్రహ్మాండభాండ పరస్పరసంఘట్టనని దాన భయదాట్టహాసగర్జాన్విత ప్రళయాశుశుక్షణి భామర్షరా గాయతప్రోక్షణేక్షణశోభాశంపాయుత కాంచన మహీధరకందరా యతనానా పుట నిర్గత శ్వాసప్రభంజనోపేత నిజనఖరశిఖరవిచ్ఛేదితసూక్ష రక్షోవరనక్షోక్షయ క్షీరధరగళన్నిర్గళాస్రవర్షధారాసంపాత పునరంకురిత సుమనోమనఃకేదార ధీరతాంకురా రమారమణీమనోవశంకరా నమస్కారంబు, శతేజ్యపూజ్య ప్రాజ్య స్వారాజ్యసామ్రాజ్యసంపాద నార్థాంగీకృత దంభడింభవామనావతారా బలి విసృజ్యమానదానవారిధారాపతనక్రియావారణా శయోళనోవ్యవహారా నమస్కారంబు, అఖండకాండగండవేదండ శుండోద్దండదోర్దండప్రచండఖండకుండలి కుండలశిరోమండన మండలాకార పరశ్వధధారాఖండితాఖండభూమండల మండలేశ్వర భండనయశోవిశాలా మనోహరకాంచనదుకూలానమస్కారంబు, మృదుభాషణఖరదూషణ మదశోషణనతతోషణ పరిభాషణసవిశేషణదృఢదారుణమదరావణప్రవిదారణ ప్రవిదారణ ఖండపరశుకోదండఖండనపిచండిలచండ యశోవిహారా జానకీమనోహారా వక్షోదేశవిశోభితమణిమయూంచితహారా మహానటమానససంచారా నమస్కారంబు, నరకాసురప్రముఖాశరసముదాయక క్షముదాయక పరివర్జనదళితార్జునతతాయల్లకధూపాయితవల్లవీమానధనతస్కరాఘోరైనస్తమోభాస్కరా భక్తజనశ్రేయస్కరాక్షుల్లకగణతిరస్కరా నందకకౌమోదకీ

శార్ఙ్గదగభాస్కరా గోపాంగనావశంకరత్వనిపుణమస్కరా నమస్కారంబు, సకల నరసురభరితవిష్టపరిష్టదదుష్టకష్టపూర్వ సుపర్వసుందరీబృందా నూనమానభంగ కృతీ పాదాక్రాంతసురపతీ భవన్నామ పారాయణపరాయణపశుపతీ నమస్కారంబు, గర్వదుర్లోకానేకశార్వరానీకవరూథినీసంహారణార్థ సంభావిత ఖడ్గఖేటక కృపాణఘోటక ముఖసుభగంభావుకా కల్మష శుష్కవన ప్రళయపావకా సంతత పరిపాలితాత్మీయసేవకా నమస్కారంబని నుతియించి యిట్లనియె. ౧౯౩

కం. జనకుం డవమానించిన, ఘన మగురోసంబు మదిని గ్రాలఁగ యోగా
గ్నిని దేహము విడిచినసతిఁ, గనుఁగొనిమునియగుచు గరళకంధరుఁ డనఘా.

కం. రోసంబుతోడఁ దాఁ గై, లాసంబునఁ దపము సేయ లా వటె లోకు
ల్గాసిం జెంది రిఁ కెయ్యది, చేసెదరో యేమి సేయ సెల విచ్చెదరో. ౧౯౫

కం. శరణంబుఁ జొచ్చినారము, శరణార్థులఁ గావు జగము శంకరుచేత
న్మరణంబు నొందు జలనిధి,శరణా త్వచ్చరణయుగళి శరణము మాకున్. ౧౯౬

వ. ఇట్లు. ౧౯౭

కం. పుష్కరకచభూరితపః, పుష్కర ముపసంహరింపఁ బుష్కరజాదు
ల్పుష్కరశరణుని శర ణనఁ, బుష్కరతల్పుఁడు గభీరపుష్కలఫణితిన్. ౧౯౮

చం. వెఱవఁగనేల మీకు సురబృందములార నితాంతచింత సొం
పఱఁ బని యేమి యింద్ర తగునా కర మారట మింతలోన వే
సుఱసుఱ స్రుక్క నేల ననుఁ జూడుఁడు గో డుడిగింతు మంతు మీ
రుఱక భవన్నివాసముల నుండుఁడు నిండుముదంబు పెంపునన్. ౧౯౯

కం. చనుఁ డని మధురక్షోభం,జనుఁడు నిమేషంబులోనఁ జనె మాయం బై
చనిరి విరించనముఖ్యులు, మనముల నూఱటలఁ బొంది మాని భయంబున్.

ఉ. ప్రస్తుత మయ్యె శీతము తుషారకరభీకరపాదపాతవి
ధ్వస్తఘనాంబుజాతము నితంబవతీవిలసత్కుచాశ్రయా
ప్తానితాంతశీతము నిరంతరదర్పకబాణవిద్ధసం
త్రస్తవియోగిజాతము చరద్బహుశీతలశాతవాత మై ౨౦౧

కం. కుందమ్ములు వికసించెను, గందమ్ములభయము వాసెఁ గందమ్ములకుం
జిందమ్ము లనఁజెలఁగె మా,కందమ్ముల భసలరవము కడురభసముగన్. ౨౦౨

కం. కమలాధవకమలోద్భవ, కమలాలయకమలమిత్రకాములఁ జేరెం
గమలంబులు పంచతఁ గని, కమలారిహిమాంశునికరఘాతంబులచేన్. ౨౦౩

చం. అదురుచుఁ దెల్లవాఱె నని యత్తలభీతికి లేవ వల్లభు
ల్వదలక యున్న వేఁడుకొని ప్రాఁచిపను ల్నెఱవేర్చుబోటులు

న్మనమునఁ బ్రొద్దునం దలకు మున్గెడిలోకులు గుండ నీటికి
వ్రదనము లొప్పఁ జేసె నవురా చలికాలము గుండెగాల మై. ౨౦౪

కం. ఉడికింప మిత్త్రుఁ డనియె, ర్పకఁజల్లనిధారను దనుత్పాటుండనుట
న్వదఁకించెనొ చంద్రుఁడు నా, గడగడమనిజగము వడఁకెఁగడుఁ జలిచేతన్.

కం. పేరిచె హిమమున సితరుచి, ధారిణిఁ గానలును నదులుఁ దరులుం గిరులుం
బేరిమి గలదినములలో, సారూప్యం బొసఁగె విధుఁడు జగమున కెల్లన్. ౨౦౬

ఆ. పటునిరంతరాయపరిరంభసంభోగ, సౌఖ్యదంబు దీనిసమమె విరివి
మంచ మంచు మంచుసంచు మించిన నెంచు, గొల్లమంచములను గోపజనము.

సీ. వేసంగి నెంతయు వేసటఁ బుట్టించుమూలకొట్టికములకు మేలు గలిగె
ఘననిదాఘంబులఁ గాలిత్రోపులు దినునాలువులకుఁ బేర్మి చాలఁ గలిగె
వేసవియప్పుడు విరివి చాలనియట్టిసంచము గొప్ప వై మించు చుండె
నాకు నా కనిపిరుపీఁకులాటలఁ బెట్టువ్యజనంబు లటుకలఁ బ్రాఁతి వయ్యె
బయలఁ బండ నీక పరుసంపుసాలువుఁ, గప్పి యొప్పిదంపుఁగౌఁగిళులను
దంపతులకు విసరులంపటఁ బాపెను, మించుమంచుమహిమ లెంచఁ దరమె.

కం. స్తనధరములు నిజపీడిత, జనముల కభయంబు లిచ్చి సంరక్షింప
న్ఘన మాళతార మంత మ,దనదేవేశ్వరునకు నవతంసం బయ్యెన్. ౨౦౯

వ. ఇట్లు శిశిరంబు ప్రాపించిన నొక్కనాఁడు. ౨౧౦

ఉ. మంగళదేవతావదనమంజుల కంజమరందలోలుపా
పాంగమిళిందుఁ డై పలికె భామిని కంటె జగంబుదుఃఖము
న్భంగము గూర్పఁగా వలయు భర్గుతపంబున కింత నిర్వహిం
పం గలవాని వేగఁ బనుప న్వలయుం గజరాజగామినీ. ౨౧౧

కం. నీకడగొట్టుకుమారుని, ఫాకకు వే లోకములయెడఁదలుం బవులు
న్నీకంఠతపోవిభవముఁ, బోకార్పఁగఁ జాలు వాఁడెపో పోకడకున్. ౨౧౨

తే. రతివిహారు మనోజ్ఞసురతివిహారు, మతివిహారుని యౌవతమతవిహారు
విపరివారునిఁ గామినీవిపరివారు, నాకు మాఱుగఁ బంపుదు నాకుమారు. ౨౧౩

వ. అని మనంబున సంకల్పించినంత. ౨౧౪

సీ. విహగకంఖాణుండు మహితశార్ఙ్గధరుండు గాంగేయవసనోత్తరాంగకుండు
కృష్ణాభ్రవర్ణుండు శ్రీ శ్రీనివాసుండు పుష్కరచరకేతుభూషితుండు
పుండరీకాక్షుండు పూరుషసింహుండు సింహాసంహననుఁ డక్షీణబలుఁడు
కమలాంచితకరుండు ఘనసుకుమారుండు మధుసూదనగుణుండు మాధవుండు

కోమఫలదుండు పంచాస్త్రధామకుండు, పూతప్రద్యుమ్నుఁ డజుఁడు సనాతనుండు
క్షితి మనోజవసుం డన రతిని గూడి, మారుఁ డుదయించె సంకల్పమాత్రమునను.

ఉ. మంగళహస్తయుక్తసుకుమారుఁ గుమారుఁ గుమారు నిత్యస
న్మంగళదేవతాతిసుకుమారకుమారకు మారు మత్త సా
రంగగుణాసితాంగు నపరాజితు రాజితరాజతాంశుకు
న్భృంగభుజైణనాభసువిశేషవిశేషు విశేషభూషితున్. ౨౧౬

కం. తెర జాఱఁ దోఁచువేసము, పరుసునఁ దనయెదుర నున్న భాస్వరతేజు
న్మరుఁ గని సిరి పెరిమెను మది, కరఁగెను సుతుఁ గాంచి సతులు కరఁగుట యరుదే.

ఉ. మీఱినభక్తిచే రతిసమేతముగాఁగఁ బ్రదక్షిణించి ప
ల్మాఱును మ్రొక్కి లేచి కమలాకనులాక్షులదాపు చేరిన
న్గాఱనికూర్మి వారల రమాసతి చేరఁగఁ దీసె నోడిక
ల్జాఱుచు వేపఱుసున్న చనులం గనులంగొనలం జెలంగఁగన్. ౨౧౭

కం. కడగొట్టుచిన్ని కొమరునిఁ, దొడపైఁ గూర్చుండఁ బెట్టి తోరపుఁబ్రేమం
గడఁకఁ దమి ముద్దు లిడియెం, గడకొడుకులమీఁదికరుణ గాటను కాదే. ౨౧౯

చం. జనకునిఁ జూచి యిట్లనియె సారసబాణుఁడు భక్తియుక్తుఁడై
వినయవిశేష మొప్పఁ బృథివీవర యిట్టులు సన్నలంపఁగాఁ
బని గలదేనియు న్ఘనకృపాపరతం దెలియంగఁ జెప్పవే
యనిమిషవంద్య చేయుదు నటంచును బల్కఁగ శౌరి యిట్లనున్. ౨౨౦

కం. కరశేఖరునిచేతను, గుంఠిత మై లోక మెల్లఁ గుందెడి మహిమా
కుంఠితకైలాసావ్యప, కంఠంబున ఘోరతపము గావించుటచేన్. ౨౨౧

కం. నాకు సమానుఁడవు బల, ప్రాకటతేజోవిశేషరాజితమతుల
న్నీకన్న నన్యు లెవ్వరు, నాకుం గనరారుగా పినాకిని జెనకన్. ౨౨౨

చం. అగునోకా నీ కొనర్ప నుదనా యన నాయన నాయనా యనం
దగునోకా నీకుమారుని నదత్ముఁ డటం చగునా యనా యనం
దగునోకా నీకు మాఱుగఁ గదా ననుఁ బుచ్చుట దాన నోర్తు నే
మగఁటిమి గోలుపోక యనుమానము మానుము మానసంబునన్. ౨౨౩

కం. పుచ్చము చెచ్చెర నచ్చికఁ, గ్రచ్చఱ నచ్చిచ్చుకంటి రచ్చల నిచ్చ
న్రచ్చెద నచ్చపుములుకులఁ, బెచ్చుగ బిచ్చంబు దెచ్చుభిక్షుకుఁ డెచ్చే. ౨౨౪

ఆ. నాదుప్రతిన వినుమి శ్రీదునిచెలికాని, గాట మైనతపము గడియలోనఁ
జెఱుపఁ జాల కున్న శిఖిశిఖావళికి దే, హంబు నే సమర్పణం బొనర్తు. ౨౨౫

కం. భీషణముగ నిటు పల్కిన, శేషశయానుండు నిరవశేషం బగుసం
తోషమున నిట్టు లనె నని, మేషాంకుని రథకలితసమీరు న్మారున్. ౨౨౬

కం. ఏటికి నీబోఁటికి నిటు, గాటముగాఁ బల్కఁగా విఘాతము కలదే
మాటికి నీధాటికి నె,చ్చోటను గలఁక కలుగంగఁ జోద్యము కాదే. ౧౨౭

కం. శంకరుతపంబుఁ జెఱుపఁగఁ, బొంకంబుగఁ బొ మ్మటంచుఁ బోరి దీవించె
న్సంకల్పసిద్ధి యగు నని, పంకజనాభుండు పుత్రుఁ బ్రవిమలగాత్రున్. ౧౨౮

చం. వలగొని మ్రొక్కి తండ్రికిని వారిధికన్యపదాంబుజంబులం
జెలువుగ సాఁగిలంబడినఁ జిత్తజుఁ జూచి మదీయభాగ్యమా
కులమణి శత్రుజేత వయి గొబ్బునఁ గార్యముఁ దీర్చి తండ్రి కిం
పలరఁగఁ జేయవయ్య జగదావళిఁ బ్రోవఁగదయ్య చయ్యనన్. ౧౨౯

కం. పొమ్మని సెల విచ్చిన నె,య్యమ్మున దేవేరిఁ గూడి యరిగెను బిససూ
నమ్ములవాలమ్ములదొర, నెమ్మది జనకాజ్ఞ వేగ నెఱవేర్పంగన్. ౧౩౦

ఉ. చక్కెరవిల్లు దాల్చి వెలిచక్కెరతిండిహుమాయి నెక్కి పే
రుక్కునఁ బువ్వుముల్కిగమి సూనుచు గేదఁగిరేకుబాకుల
న్మక్కునఁ బూని వేగఁ బవమానరథంబును నక్రకేతువుం
దక్కులఁ గ్రాలఁగా బయలుదేఱె మరుండు హాళాయ ల్చెలంగఁగన్. ౧౩౧

కం. కోకిలకులకాకలికల, కేకలు కొలఁకుల కెలఁకుల కేకులకూకల్
కాఁకలకలుకులకలుకులు, లోకులకలకలలు కలఁకలు కులుకు లలుకల్. ౧౩౨

వ. చెలంగె నప్పుడు. ౧౩౩

తే. ఊసరక్షేత్రజాతంబు నీసడించి, యీసవోవక దిట మయి యేస లేక
నున్న నై వెన్నుచూపక యున్నయట్టి, చెఱకుసింగిణి ధరియించెఁ జిత్తభవుఁడు.

కం. మందారేందీవరమా,కందలసత్కుందబృందకమలరుహావిని
ష్యందమకరందతుందిల,హిందోళచయంబు మార్వ నేర్పఱిచె వెసన్. ౧౩౫

ఉ. చందనశైలసానుతటచందనగంధకమంథరోష్ణరు
ఙ్నందనసాధుస్థలలనాస్తనిస్తులసౌరభాంచితా
నందననందనోపవననర్తనతత్పరబాలికాముఖ
స్యందితఘర్మశీకరభరాలసవాతశతాంగయుక్తుఁడై. ౧౩౬

తే. వరలతాంతమధూళిని గరము లస్త,కమున నిల్వక జాఱెడిసమయమునను
గొప్పదట్టంపుఁబుప్పొడి నప్పళింపఁ, దగు నటంచును జతకూర్చె మొగలిపూలు.

తే. కేతనముఁ జూచినంతనె భీతిఁ గలఁగి, మకరు నాయంగ వలె నని మకరవైజ
యంతిఁ దాల్చెను వేగలతాంతశరుఁడు, హరుని నెదిరింప లచ్చికొమరుఁడుమరుఁడు.

తే. సారకదళీఫలంబుల నారగించి, మెక్కి చిగుళులఁ జక్కెర బొక్కి బొక్కి
యుక్కునం గ్రాలిపచ్చడాల్ ఱెక్కలుగల,పక్కులను బూన్చెఁ దేరికినక్కజముగ.

ఉ. మీటకమున్నె మ్రోయు ధ్వనిమీఱ గుణంబు శరంబు లన్న బో
హాటముగాఁగ వెల్వడుఁ దమంతటఁ దామె శతాంగ మన్ననో
సూటిగ నేగుఁ దాన రథచోదకహీనత వాజు లన్న మే
ల్ధాటిఁ గశాధృతిశ్రమముఁ దాల్పఁగ నీకయ పాఱు సాదికిన్. ౧౨౦

చం. తమవిభుఁ డైనమన్మథుఁడు దాడిచన న్నమకట్టఁగాఁ గ్రమం
బమర నియుక్తకార్యములకై గమకించెనొ నాఁగఁ గోకిలో
కము గళకాహళారవము, కాంతమధువ్రతనారము ల్లతాం
తములను దూర్యఘోషము, ఘనంబుగ గానము నించెఁ బికముల్. ౧౨౧

తే. మహితమకరధ్వజోదయమహిమఁ జేసి, వేసటలఁ గుందకే యోలమానసగొనక
దంపతులు మీఱి యతనుయుద్ధములఁ దేలి, సొమ్మసిల్లిరి పాన్పుల నిమ్మళముగ.

వ. ఇట్లు కలశవారాశి నిర్గమించి రమాకుమారుండు శారమయూరకీరవారపరివారుండై పరిష్కారాలంకృతశరీరుం డై తూణియు బాణియుఁ గృపాణియు ఖడ్గపాణియునై రథంబు నెక్కి యుక్కుమిగిలి యక్కజంబగు తేజంబున దిక్కులు పిక్కటిల్లఁ జనుచుండ సుమనఃకోదండకాండ ప్రకాండాసినాండజకరండంబు నిండఁ బాండరడిండీరఖండ హారిపిచండతరండకుండలి ప్రచండపుండరీకరుచిపిచండిల ఖండపరశుశిఖండమండన మండలకరమండలంబు దండి మీఱఁ బిండార బోసిన గతి నంపాచారంబుగఁ బచారంబు సల్పఁ బుండరీకకాండంబు పుండరీకకాండంబులఁ గన్నకురంగంబులయంగున గండం బని గుండెలు గండ్రికలుగఁ దల్లడిల్ల, మిండగాండ్రకై కడగండ్లు గుడుచు మిండగుబ్బెతలు వెతలఁ గుందఁ, జక్కఁగఁ జిక్కనమక్కువగల చక్కనియుక్కులుఁడు పక్కకుఁ దక్కక తెక్కలిత్రిక్కనఁ డక్కు నిక్క నేచక్కినొ రక్కసిసవతిపక్కికిఁ జిక్కి పక్కయుక్కఱఁ దీర్చ లక్కనంబుగఁ దక్కి చొక్కి నిక్కి కక్కుఱితికి లొగ్గ నని యక్కసంబున వెక్కసంబులు వక్కాణించి క్రక్కసంబుగ వెక్కి వెక్కి గుక్కాడక యుక్కు దక్కి మిక్కుటంబుగఁ జక్కవపెంటి పక్కులొంటి నేడువఁ, గలువచెలిచలువల విరివి జగతుల నొప్పయి యుప్పరం బంటుగొప్పయుప్పరిగల వెన్నెలకుప్పలాడఁ బచ్చకప్పురపుఁగుప్పల నిడి తప్పఁ గొట్టి తప్పఁ దప్పించుకొనఁ దెప్పనఁ దప్పక వెలిపుప్పంబుల నిడి యప్పప్ప చిక్కె నని చేతు లప్పళించి తప్పట్లు గొట్టి చిక్కని తక్కినయొప్పులాఁడుల దెప్పినల నొప్పులకుప్పలు కనులఁ గప్పి త్రిప్పి త్రిప్పి రొప్ప, నింపు తొలఁకాడ వగకాఁడు నిసితేఁడు తమజాడఁ దముఁ జూడఁ జెలికాఁడ మొనగాఁడ యుపుడేడ తమిఁ గూడఁ గడుప్రోడ తమిఁ గూడ విటకాఁడ మాజాడ నీకేడ వాదాడఁగాఁ బ్రోడలము గా మంచుఁ గలువకులుకులాఁడులు

పలుకు లాఁడు వడువున నడలాడ, గుబ్బలిపై నబ్బురపుటుబ్బున నెలవెలియుబ్బలిఁ
జిక్కితబ్బిబ్బు లాఁడు లేడిపయి దెబ్బతీయఁద మని గొబ్బున సింగిణిదబ్బల
ముల్కుల నిబ్బరంబుగ ద్రొబ్బిన మబ్బుల నబ్బినముత్తియంబులు రాల గుబ్బ
సరంబులఁ గూర్చుచెంచుగబ్బిగుబ్బెతలగుబ్బలఁ బ్రబ్బినచెమటలఁ ద్రావి మరు
ద్రొబ్బులాటలదెబ్బల నలయికఁ బబ్బుచు సిబ్బితి దలఁగిన గుబ్బలాఁడులసిబ్బెం
పుగుబ్బగుబ్బల దబ్బుదబ్బున నుబ్బుచెమటల యుబ్బడంచుగబ్బి తిన్నగ నడ
యాఁడఁ, గాంతారాంతరంబుల శేఫాలికాలతాంతంబుల సీధుధారగాఱఁ, బద్మాసన
నాగపాదలతావేష్టార్ధసంపుటకులిశసుందర కేసరహిల్లోల నారసింహవిపరీతత్యు
ద్గారధేనుకోత్కంఠసింహాసననాగవిద్యాధరబంధంబులఁ జొక్కి మక్కువ లెక్క
నర్ధచంద్ర కర్తరీముఖ కపిత్థ కటకాముఖ శుకతుండ లాంగూల పద్మకోశపతా
కాదిహస్తవిన్యాసంబుల నిజభావంబులఁ బ్రకటించుచు లలితకుంచితవికాసముకుళ
కేకరా చంచలాసూయకతీక్ష్ణంబు లగువీక్షణంబులఁ జూచుచు నికుంచితాకుం
చితకంపి తాకంపితపరివాహితసమాధోముఖాలోలితధుతోత్క్షిప్తాదిశిరోభావంబుల
నింపినేత్రకంఠకపోల హృదయపార్శ్వనాభి ముఖజంఘనితంబ జఘనస్తనయుగళం
బులఁ జుంబించుచుఁ గళలయుంకువ లెఱింగి కరంగ నంటి ఫలమూలంబుల రతి
భోగంబులఁ బ్రేమదానంబుల బాలాతరుణీప్రౌఢల వశపఱుచుకొని కుందరదన
లగునిందువదనల నదనున మదనకదనంబుల వలసి కలసి మొలసి యలసి సొలసి
తెలిసినయలసు లగుభోగులవలనను, నురువు లేనియొఱపరి తఱుసలి యొఱటు
కఱకుటెఱుకు కొఱకొఱబిఱబిఱఁ జిఱచిఱ నఱిముఱి యఱుత నఱిమి యుఱిమి
దఱిమి బిఱుసున విసరిన యరవిరియంపఱ చుఱుక్కున గుఱుక్కున గీఱిన నుఱిది
దఱిఁగి కొఱవోయి వఱువాతదాఁక వఱువట్లుగొని కదరినకన్నుఱఁ గన్నరమోడ్చి
తెఱవలకై కం దెఱచి చూచువియోగులవలనను, దైనందిననవనవబాలారత
లోలుండ వగునీ కేల యీలీల నీలీలఁ దొఱఁగి నెమ్మోము తెల్లవాఱె నను
మదనశరవేదనాదూయమానమానస పాండరాంగక నిద్రావిహీనారుణనయన
పాంథయోషాజన దూషణభాషణలవలనను, రతికేలిఁ దేలి తూలి వ్రాలిసోలి
గాటం బగుకౌఁగిళులమగలకుఁ జిక్కిదక్కినస్వాధీనభర్తృకలవలనను, వెలిరంగు
ముసుంగు లంగంబులఁ బొసంగ ననంగునిసంగరంబున నెసంగ సంకేతరంగం
బున కేగి యనుంగుసంగాతిఁ గనం గానక చెంగటల నెమకంగ నదియెఱింగి
తమి చెంగలింప మఱియొకభుజంగపుంగవుండు క్రీనీడలమాటున నించుకించుక
యెచ్చరించి యిరులఁ దొలంగిన వెంగలి యై వెంట నంటిపల్కక యుంట
నెఱుంగక నిక్కంపుటంటుకాఁడ యని మరునిదురమునఁ బెనంగి నలంగి చనంగఁ

గొంతద వ్వరుగంగ వేఱుజాడ నవ్విటకాఁ డెదురవచ్చి పచ్చవిలుతుకచ్చెకు ముచ్చటించిన నిచ్చఁ బెచ్చుగుకోపంబున మచ్చరించి బొమలుముడించిన నవ్వి యెక్కసక్కెంబులఁ డక్కునెఱింగించిన నెఱింగిపొచ్చెంబు లేనినచ్చిక మచ్చిక లెచ్చ నచ్చికబుచ్చిక నిచ్చకంబుల వెలిపుచ్చకుండ నెచ్చరించు ముచ్చటింకు మచ్చికంటులవలనను, నభంబు భగం బయ్యె వేగిన ట్లున్న దీకీలు గంటివే వాలుఁగంటి యనఁ గీలుగంటు గేలి గొం టికేలఁగొంటివే గంటివే వేగంటి వాలుఁగంటికీలుగంటుకొన గంటుకొనుఁగుక్కలలో తేఁచుకుక్కవోలె రేచుక్క లలో నీతం డుత్తముం డఁట యీ యుత్తముం డనయ ముండుటకన్న నాయత్త ముండ నయ ముండుట మే లితండు రేలఁగాయ నక్క కాయంబు గాయంబు సేయు నీచకోరజీవంబు తల్లిమిండండు నాక తనకొంప కూలఁ బిన్ననాఁటన కొమ్ములు మొలపించిన యాబమ్మ నన పలయు నోచకోరముద్దా కమలాక్షు లన ముద్దా యీయన్యాయంబు పద్దా కరవేత్రంబులఁ బైలాగున నుద్దవిడిఁ బడ మొత్త మెత్తపడక నుండువారము మెత్తపడకయుండువారమే యను మదిరాపాన విహ్వలమానసమానవతీతిలకంబులపలుకులవలనను, వేగిరంబోగిరంబంటక కంటుగొన్న చిన్నచిన్ని పాపలపోరు మానుప రావె రావె యని తన్నుఁజూపి నోరఁ గూరుసౌజన్యవతీమతల్లు లగుతల్లులకై కరంగి బంగారుపొంగారుసింగా రంపుభృంగారంబుల బుడుతలకై సుధాంశుండు నింపక నింపినయమృతంబు సొంపున నింపు పెంపు జనింప మరులంపటలఁ బొంపిరివోవ దంపతులు బయల వైచినమంచంబులనొఱపుగల పఱుపులపైఁ బఱువక బఱచినపఱుపుగల చలువ దుప్పటంబుపైఁ జల్లక చల్లిన యామల్లకకరం బగుమొల్ల లై యుల్లంబు రంజిల్ల వన్నియ మీఱు పన్నీటఁ బన్నీటిచెక్కం గొన్నచెన్నుగలగంధంబును జున్ను గలపాలను నించి యుంచవిన్నను వునఁ జిన్నెల వన్నెలఁ జెన్నుఁ జూపుచుఁ గన్ను లలరఁ గ్రొన్ననబోటులు వెలిదిన్నెల మన్నీలతో నున్నతఱి మున్నుమున్నగ గందం బని వెన్నెల భిన్నంబుగఁ గన నేరక చంచలను బాలనుగొని మైఁ బూయుసతీపతులహీహీలవలనను, నానిశాసమయంబు జగన్మోహనం బై యుండె నయ్యవసరంబున. ౨౮౩

సీ. నీలనీరదవర్ణు నిత్యయౌవనపూర్ణు మకరకుండలరాజమానకర్ణుఁ
గంజాతదళనేత్రుఁ గమనీయశుభగాత్రు నారదస్తుతిపాత్రు నయచరిత్రుఁ
బ్రాలంబికాహారు భాస్వరకేయూరుఁ బల్లవకరవీరు భయవిదూరు
మధుమధురాలాపు మంజుతరకలాపు మల్లికారోపు సుమహితరూపు
భృంగగుణసంగు సనిషంగు వంగకీర,వారపరివారు రతివరు సారవీరుఁ
జూచి నైలింపసతు లెల్లఁ జోద్య మంది, మనసిజానలదందహ్యమాన లైరి. ౨౮౪

ఉ. కన్నులవింటివాఁడు హరికన్నను జక్కఁదనంబువాఁడు మే
ల్వన్నెలచిన్నవాఁడు విరివాలుల లీలను గొన్నవాఁడు ప
ల్చిన్నెలవన్నెకాఁడు కడుఁ జె న్నమర న్జను చున్నవాఁ డటం
చన్నులమిన్న లెల్లఁ గను లారఁగఁ గాంచిరి మాకుమారునిన్. ౨౮౫

ఉ. నల్లనిమేనివాఁడు చిఱునవ్వుల రాజిలుమోమువాఁడు బ
ల్చల్లనిచూపువాఁడు వెదచల్లెడి వాసనవాఁడు మేల్ హొయ
ల్పెల్లగువాఁడు మమ్ము దురపిల్లఁగఁ జేసె నటంచుఁ జేడె లా
యల్లకభగ్నచిత్త లయి యాతనిఁ గాంచి కరంగి రెంతయున్. ౨౮౬

కం. కన్నుఁగవ యయ్యె నార్ద్రం, బన్నులమిన్నలకు హృదయ మార్ద్రం బయ్యె
న్భిన్నపట మార్ద్ర మయ్యెను, గన్నులవెడవింటివానిఁ గన్నం గన్నెల్. ౨౮౭

ఉ. అంబురుహాక్షి యోర్తు కనదంబురుహాంబకుఁ జూడఁ గోరి రా
గంబున వచ్చుచో విటుఁడు గ్రక్కున వెన్కనె వచ్చి కన్ను ల
డ్డంబుగ మూయఁ జేతులు విడంగను గట్టిగ గిచ్చి పోయె వాఁ
ఃం బడి నేగె నప్పుడు గడుం బరితాపముతోడ నార్తుఁడై. ౨౮౮

మ. కలకంఠీరవ యోర్తు మారుఁ గన రాగం బొప్పఁగా ఱైక తు
న్కలుగా విచ్చఁ గడెంబు లూర్మికలును న్జాఱె న్వసం గ్రమ్మఱ
న్జెలు వారంగ ధరింపఁ గంకణము మించె న్మేఖలాత్వంబున
న్వలయస్థానమునం దదూర్మికలు రేవ ల్మీఱెఁ జిత్రంబుగన్. ౨౮౯

కం. మూఁడుతలంబులు తడిసెను, మూఁడుముడు ల్వీడె నారుమూఁ డయ్యెను సి
గ్గాడువెలందులకును బూ,వాఁడిములుకు లొప్పు చుండువానిం జూడన్. ౨౯౦

ఉ. పంకరుహాక్షి యోర్తు తమిఁ బంచశరుం గన బాహుమూలకూ
లంకషయౌవనాంక యుగళస్ఫు రమౌక్తికరత్నహారము
ల్పంకజగంధు లంచఱును బక్కన నవ్వఁ బసిండికమ్ముల
న్బొంకము లైనవేసు లయి పొ ల్పెసలారె నయారె చిత్రముల్. ౨౯౧

చం. మదవతి యోర్తు మాధవకుమారునొయార మయారె యంచు స
మ్మదమతిఁ జూచి యూఁచి తల మాటికి మాటికిఁ బాటిగా రహి
న్గదలక నష్టచేష్ట యయి కామిని కాముని గోమునం గనెం
బదిలముగాఁగ బమ్మెరను బంగరుబొంగరమో యనం దగన్. ౨౯౨

కం. హేలావతి యోర్తుక రతి,బాలాపతిఁ గాంచి మోహభరమున వ్రాలె
న్హేలాపరలోలామర,సాలాతతిమీఁద గాలి సోఁకినభంగిన్. ౨౯3

చం. అనిమిషమానినీతిలక మాదట నాయనిమేష కేతుఁ దా
ననిమిషవృత్తిఁ దోడ్పడఁ బ్రియంబునఁ జూచెను యత్నహీనతం
గనుఁగవ నశ్రుపూరములు గ్రాల నిదే మని చేడె లెచ్చరిం
చిన ననిమేషతం గనినఁ జిత్రమె బాష్పము లంచుఁ దెల్పుచున్. ౨౫౪

వ. మఱియుఁ గొందఱు దేవతలు తమలోన. ౨౫౫

కం. విషజాతంబులు శరములు, విషనిధితనయాసుతుండు విషముఁడు మఱియు
న్విషమాంబకుఁడై యుండియు, విషమాంబకు గెలుచు టొక్క విషమా తలఁపన్.

సీ. సారంగగుణసంగసారంగసువిహంగసారంగతులితదోస్సారఘనుఁడు
సారంగశుకహయసారంగహయరథసారంగసారమసారతనుఁడు
సారంగపరబలసారంగసారంగసారంగనయనాసుశర్మదుండు
సారంగసంభవసారంగలక్షణసారంగసహజవిస్తారయశుఁడు
భూరిసారంగముదిత త్రిభువనసార, శౌరసారంగలోచనాపూరుషుండు
రంగు మీఱంగ వేగ సారంగధరుని, వ్రతముఁ జెఱుపఁగఁ జాలు సారంగశరుఁడు.

సీ. విషమాంబకుఁ డితండు విషమాంబకుఁ డతండు రహి మీఱ నేకతరంబువారు
రామాశ్రితుఁ డితండు రామాశ్రితుఁ డతండు రహి మీఱ నేకతరంబువారు
రాగధర్ముఁ డితండు రాగధర్ముఁ డతండు రహి మీఱ నేకతరంబువారు
యోగీద్యుఁ డీతండు యోగీద్యుఁ డాతండు రహి మీఱ నేకతరంబువారు
మారుఁ డీతండు చూడంగ మారుఁ డతఁడు సకలధరుఁ డీతఁ డాతఁడు సకలధరుఁడు
ఇద్దఱును జూడ నొక్కట నుద్దియగుట,హరునిఁ జెంగించునీసుమశరుఁడుమరుఁడు.

వ. ఈవిధంబునఁ దన్ను సురలు బారు దీరి చూచు చుండ శుకవల్లభుండు ప్రియవల్ల
భతో ని ట్లనియె. ౨౫౯

తే. చామ యల్లదె నీతండ్రి చందమామ,సమ్ముఖమ్మున నున్నాఁడు సమ్మదమునఁ
గూఁతు నల్లునిఁ బొడగనుకుతుకమునను, వచ్చుచున్నాఁడు చూడుమా మచ్చెకంటి.

తే. రాజముఖి నిన్నుఁ గన ననురాగ మనెడి, జలధి పొంగెను నీతండ్రి స్వాంతమునను
గాక యుండిన నీహారకాండవృష్టి, యబ్జనిష్యంద మా లెట్టు లబ్బురముగ. ౨౬౦

తే. రాకతోఁగూడి యీరాజురాజవదన, సుఖసరణిఁ బోవఁ జక్రముల్ స్రుక్కఁగంటె
రాకతోఁ గూడి రాజులు రాజవదన, సుఖసరణిఁబోవఁజక్రముల్ స్రుక్కవోటు.

తే. పక్షయుగయుక్తి సితపదప్రాప్తికతన, ఖగము కావున నీతండు కంబుకంఠి
చదల మెదలంగఁ గలిగె నిచ్చలును మగువ, కాక జడపాదుఁడీతండుకదలఁగలఁడె.

తే. కలితఖగనాముఁ డౌటను జలజగంధి,నీనికరములు చల్లన వేఁడి యగు వి
యోగు లెల్లను వేఁడిమి నోర్వలేరు, బాగటందురు సౌఖ్యసంయోగిజనులు.

తే. ఈతఁ డీతనిరాశియు నేకరాశి, కాలు సేతులు కలిగియుఁ గాలు చేయి
లేనివారలచేఁ గస్తియౌను గొనఁగ, వింటె పాపబలంబున విద్రుమోష్ఠి. ౧౬౫

కం. సుతురాకఁ దగఁ గనుంగొని, యతులితముగఁ బొంగు నుదధి యనుకంపనొ తి
గ్మతరం బగుకరములసం,గతినొ వియోగివచనములు కావన కుండన్. ౧౬౬

కం. జీవములకు జీవం బగు, భావింపఁగఁ గోకములకుఁ బటుకోకం బౌ
నీవిధుఁడు పుండరీకం, బోవెలఁదీ పుండరీకయూథంబునకున్. ౧౬౭

కం. సిరి సవతి విధునియురమున, నిరతముఁ గులుకంగఁ దాను నేరనె యనియో
పరఁగం జాయనెపంబున, ధర విధునురమునను నిలిచెఁ దరుణీకంటే. ౧౬౮

సీ. నెలరాల నేభంగి జలజల రాలునో జాలువాఱఁగ శీతజలకణములు
జీవాళికనుల నేచెలువున నుబ్బునో క్రందుగ నానందబిందుతతులు
విరహిణియొడల నేకరణిని గ్రాలునో డిండీరకాంతిని బొంపరతయు
శతపత్త్రతతుల నేచందానఁ బొందునో డెందములను గుంది డిందుపడక
యుపగమహిమంబు లీతని నొంచ కున్న, నెప్పటివిధాన మెలఁగుఁ గా కేడుదధులు
కారణం బేమి యుప్పొంగఁ గారికీర్ద్ధ, పూర్ణిమాచంద్రముఖి వీనిపుట్టువునను.

తే. హాలహలము మొసంగి మం పంద హరుఁడు, సరసశీతలకృత్యము ల్జరపి సురలు
ప్రాంచితంబుగఁ దలనిడ్డమంచుగడ్డ, నామెలఁగుచంద్రుఁజూపుమా యోమృగాక్షి.

కం. పంచాస్యవృత్తి నొందియుఁ, బెంచెడి నఁట హరిణ మొండు భీముం డనియో
పంచాస్యమధ్య చంద్రుఁడు, పంచితహర్యక్షు మయ్యు హరిణముఁ బెంచున్. ౧౭౦

కం. ధైర్యంబున నడయాడుట, హర్యక్షస్థితిని గన్న యబ్జుని ప్రోల
స్వర్యక్షమధ్య హరిణము, స్థైర్యంబున సౌమ్యగురుఁడు శశి యగుటనొకో. ౧౭౧

కం. నాకు సయిదోడు పుట్టుక, నాకును సయిదోడు జగతి నారుల నేచ
న్నాకు సయిదోడు సొంపున, నాకును సయిదోడు నేఁడు నాళికాక్షీ. ౧౭౩

చం. కరివరయాన చందురునికప్పువిధం బది యే మటన్నన
వ్వరుస వచింతు నే వినుమ వారితశీతవిభీతరోహిణీ
తరళవిలోచనామృగమదప్రవిలిప్తపయోధరాచలా
ధరవరసంప్రహారకిణసంతురనీలిమ యంచు నెంచెదన్. ౧౭౪

కం. జైవాతృకుండు కావున, జైవాతృకవక్త్ర యాకసం బనుచేల
న్వావిరి చల్లిన జొన్నలు, నా వెలసెం గంటె యబ్జనయనా తారల్. ౧౭౫

తే. దేవి జైవాతృకత్వంబు దేవుఁ డెఱుఁగు, నితఁడు వట్టినశిశువులు బ్రతుకు టరిది
తారసస్యంబు లభ్ర కేదారమునను, రీతి లేకయె చల్లెను బృథుకవైద్య
మతివ ద్విజరాజు సేద్య మిాగతియ కాదె. ౧౭౬

తే. నీరుమేఁతల కైనను నిల్వ నీని, పవనుఁ గై సొట్టగాఁ గ్రింపఁ బడఁగ వైచి
త్రావుచున్నది హరిణ మీ తావునందు, నమృతమదె పాఱఁజూడుమీ హరిణనేత్ర
కం. నెల కిద్ద ఱాండ్రు తెలుపున, నలుపున నొప్పెదురు జ్యోత్స్నాఁ జీఁకటినాఁ
దిలకింప నుభయపక్షము, లలంకరింపుదురు సూవె యలికులవేణీ. ౨౭౮
కం. కుముదారవిందచయముల, కుముదావహుఁ డరయ నిటుల కుమతులు వెలికిన్
సుమతుల మనుచును మిషచేఁ, దమి ధర నేలుదురు దారధర్మప్రభులై. ౨౭౯
వ. అని శశాంకు నవలోకించి వర్ణించుపతితో రతి యిట్లనియె. ౨౮౦
ఉ. అక్కట నాథ నీ విటుల యాడెదు కాని మనంబులోపలం
జిక్కనివంత చేతఁ బలుచిక్కులు నొందుచు నున్ననాకు నే
దిక్కును దోఁప దిం కిట మదిం గరుణించి వినంగదే పతీ
పెక్కులు దుర్నిమిత్తములు పెల్లుగఁ దోఁచుచు నున్న వియ్యెడన్. ౨౮౧
కం. కమలాక్షతనూజ సుధీ, రమతివి సద్ధీరమతివి రమతివి మతివి
క్రమముల జనకనిభుండవు, శమమున నాకోర్కి సలుపంగదవే. ౨౮౨
కం. నేఁటికిఁ బయనము మానుము, చే టొదవెడి నంచు దిసులు చెందినమతితో
మాటికి మనవి యొనర్తు ని, శాటారికుమార కుసుమహారిశరీరా. ౨౮౩
కం. వలపటినేత్రం బదరెడి, వలపటిభుజ మదరె గౌళి స్వర్భానునిపైఁ
బలికెడి జయంబు నీకును, గలుగుట సందియము మార కరుణోదారా. ౨౮౪
కం. నాలుగుపదములజీవము, వాలాయముగాఁగఁ దుమ్మెఁ బయనింపంగం
గాలంబు కాదు మన కిపు, డాలం బొనరించు టొప్పు నాలింపఁగదే. ౨౮౫
ఉ. ఎమ్మెలు గావు నాపలుకు లేర్పడ విన్ము పురారిఁ జెన్కఁగా
నెమ్మది రేపు పోవ నగు నేఁడు చన న్మది గొల్పదయ్యె మో
సమ్ములు లేవు నాకడ నిజంబుగ దుశ్శకునంబు లయ్యెడి
న్దుమ్మెద లెల్ల జు మ్మనుచుఁ దుమ్మఁగ వింటివిగా మనోహరా. ౨౮౬
కం. కనలుచు లేచి శపించునొ, కనుఁగొనునో క్రూరదృష్టిఁ గాటియ నిడునో
మనమున దిగు లొదవెడి నా, మనవిని విను నాథ నన్ను మనుపు మనోజా.
సీ. శస్త్రాస్త్రసమితికి సంచలింపని ప్రోడ సూనశరంబుల స్రుక్కునొక్కొ
ఘనసింహరవములఁ గదలఁ జాలనివాఁడు పక్షికూఁతలచేత భంగపడునొ
నిత్యంబు శిరమున నెలను దాల్చెడివాఁడు వెన్నెలకాఁకకు వెఱచునొక్కొ
ప్రళయఝంఝానిలపటిమఁ గుందనివాఁడు మందానిలంబునఁ గందునొక్కొ
మారకుఁ డతండు నీవు కుమారకుండు, నీకు మా యుండు వలవదు నిష్ఠురత్వ;
మరసి మన్నింపు నాపల్కు లాలకింపు, మానఁగదె యింకఁ బయనంబు మాకుమార.

వ. అని పల్కిన వల్లభం జూచి వల్లభుం డిట్లనియె. ౨౦౯

కం. లోలాక్షీతిలకమ నా, కాలివయి భయమ్ము వొందు నర్హమె యేలా
లోలత్వంబునఁ దూలెదు, బాలా యీలీల జాలిపాల్గా మేలా. ౨౧౦

సీ. మఱచితే కమలాక్షి మహిమంబు చెడ బలారాతికి దుర్బలు గ్రాలు చుంట
తోఁపదే మానినీ తోయజగర్భుఁ డార్తుం డయి దాఁ గూఁతుతోఁ గవియుట
తెలియవే మదిరాక్షి దీనత్వమునను భర్గుండు మానులయాండ్రఁ గూడి యుంట
యెఱుఁగవే మొలఁతుక కఱవునఁ బడియె సోముం డెన్న గురుపత్నిఁదండగొనుట
తోఁపనట్టుల పల్కెదు తోయజాక్షి, ధర్మ పరధర్మ పరవరధర్మ చర్మ
ధర్మ పరధర్మ యమధర్మ కర్మలైన, మానధర్మునిబారికి మ్రొక్కఁగోటు. ౨౧౧

ఉ. తెక్కలిఱంకుఁబోతు సుదతి భయ మందఁగ నేల శూలి చేఁ
జిక్కుట దెంతపాటిపని చీఁకటితప్పున మానిపత్నికై
మ్రొక్కిననాఁడు మోహమున సొక్కుచు మోహినిఁ గోరి బిత్తల
న్దిక్కులఁ బాఱునాఁడు సతితీవ్రత లెక్కడ వోయె భామినీ. ౨౧౨

ఉ. దూరపదార్థదావహ మతిదూరము నహ్నికి వస్త్ర మాత్రసం
వారితసత్ప్రతాపుఁడు ప్రభాకరుఁ డోకమలాక్షి దూరతా
దూరత లన్విచారణకు దూర మవార్య మదృష్ట మెన్నఁ జే
తోరమణీయ మై కలుగుఁ దోరముగా మది నాశిఖావళుల్. ౨౧౩

సీ. భీముఁ డాతం డని బెదరించెదే చెలీ యర్ధనారీశ్వరుం డతఁడు కాఁడె
యుగ్రుఁ డటం చెద నూహించెద మంటివా గంగాశిరోధారి కాఁడె యతఁడు
యోగీశ్వరుఁ డటంచు నుల్కెద మంటివా ద్వైమాతురునికిని దండ్రి యతఁడు
తామసుం డనుచును దలఁకుద మంటివా రామైకభక్తివిరాజితుండు.
కాన నీయాన గజయాన యేను మాన, మాన నీయానమును నేజగానఁ గానఁ
గానివానిని గద యే వితాన నైన, మానుతు మహేశుతపము బిఱీనఁ జాన.

తే. తల్లిదండ్రులతోఁడుత నెల్లరు వినఁ, దపముఁ జేఱిచెద నంచును దవిలి పల్కి
దిగులుఁ జెందుచుఁ దెకతేర మగిడి చనిన, నవ్వదే జగ మొల్లను బువ్వఁబోణి.

తే. అగ్నినిగమంబు లతనికి నమరెఁ గాని, శుచిత సత్యంబు కరుణయు శూన్యమతిని
కర్పరముఁ దాల్చు సత్యవీక్షణము లేదు, లోకముల హింసఁ జేయు నాళీకవదన.

సీ. వృషభధ్వజుం డని వెఱపింప నేటికే మకరధ్వజుఁడ నౌట మఱచితొక్క
వాఁడు మూఁడంచులవాలువాఁ డన నాదువాలు వేయంచుల వాలు గాదె
సర్పభూషణుఁ డని జడిపింప నేటికే సర్పభుక్తతి మనసైన్యముగద
ముక్కంటి యని నీవు మోహించెదే జలకరకంబు చూడ ముక్కంటి కాదె

కఱకుఁగఱటికఱవ కఱచిననెఱవాది, బిఱుసు దఱిగి పిఱుద విఱుగ నుఱుఁడు
తఱిని జరపి యరుగ నెఱుఁగనిపీఱిఁడి, వెఱవ నేల తెఱవ యొఱల నేల. ౨౯౭
తే. పంచశస్త్రంబులకుఁ దాను సంచలింప, కున్న నుండనీ దీనిపో టన్న శివుఁడు
సంచలింపఁడె గడగడ సత్తెముగను, బువ్వుఁబోఁడిరొ గేదంగిపువ్వకును. ౨౯౮
వ. అని యిటు లాశ్వాసించుచుఁ జని చని యుండట. ౨౯౯
ఉ. భాసుర తేజుఁ డంతఁ జెలువంబునఁ గాంచెను గిన్నరీసము
ల్లాసము మంజులాంచితవిలాసము సంతతభక్తమానసా
శ్వాసము నీలలోహితనివాసము వ్యాసవిభాసమానకై
లాసముఁ బాండురద్యుతికలాపతిరస్కృతగోవిలాసమున్. 300
సీ. కలకంఠకలకంఠకంఠనాదంబులఁ గలకంఠకులరమ్యకమలలతలఁ
బ్రభుసమీరణసమీరణచారణంబుల మాధవీమాధవీమహితతతులఁ
బుంగవపుంగవరంగత్తటంబుల రాజీవరాజీవరాజిగతులఁ
గాంతారకాంతారకాంతదేశంబుల గహ్వరగహ్వరగ్రావములను
గలితవీకాశవీకాశకందరముల, మంజువిద్రుమవిద్రుమమానితముల
భూరిభేరుండ భేరుండభూతములను, బరఁగుకృతహాలహాలగిరిగిరిని గాంచె. ౩౦౧
వ. మఱియు ననతిచిరోత్ఫుల్లనవమల్లికావల్లికావేల్లిత మంజుకుంజగుంజత్పుంజరంజి
తంబును, సారతరరసాల నవనవకిసలయాస్వాదన కషాయకంఠకలకంఠకలకంఠీ
పంచమనాదమిళితచంచూపుటవిదారితపక్వబింబకీరవార కలకంఠకలకంఠకలకంఠ
నీలకంఠకంఠాకుంఠరవకుంఠితాంతరాళంబును, నిర్ఝరనిర్ఝరవర్ధితానల్పకల్పాగ
కల్పాగప్రసూనముఖనిష్యందమకరందబిందుసందోహలహరీపరాగదరీగత భ్రమ
రీపుష్పంధయస్తనంధయసంకులంబును, మంజులవంజులాంబుజాంబుజ వకులము
కుళనవమల్లికానవమాలికా కుందబృందబంధూకలోకసార మందారవారసుగంధ
బంధురగంధవాహ పాటచ్చరమూషితమనోర్ధసాలభంజికాప్రాయవాటచారిసవ
నాయసంయుతంబును, ధారాంగసంగత రంగనారంగనాగరంగకాసారాభంగ
రతరంగయుతానంగశరరంగనటనపటుపుష్పలిట్క్షోభితంబును, నంకురిత పత్రి
పల్లవిత జాలకిత కోరకిత ముకుళిత వికసిత శలాటుయుతఫలితగళితఫలశిఖరివిర
జితంబును, నాళీకనాళీకసుమాళీధూళీధవళీకృతమధూళీ మదాళివాహ్యాళిలో
మరాళీపాళీముఖరావళీద్ధావ్యళీకకేళిం గ్రాలుకేళాకూళులచే భాసితంబును నై
శారదాభిరామం బై సత్యంబును, దేవవల్లభయుక్తం బై నస్వోకసారను, జ
పటలయుతం బై నైమిశంబును, హలిప్రియశోభితం బై ద్వారకను, నర్జునయ
తం బై పాండుసంతానంబును, విష్వక్సేనాన్వితం బై దేవసేనను, గుందసుం

రం బై వస్వ్యోకసారను, గరవీరమంజులం బై మహావీరుని, జక్రధరమండితం బై వైకుంఠంబును, మస్కరధరం బై మస్కరిని, గర్భురరమణీయం బై నైరృత్యాశను, గబరీమానితం బై లీలావతిం బోలి, యశ్వత్థకపిత్థచయస్థా మందార శాబర శారద మాలూరవానీర కేసరకోవిదారనక్తమాలశమీర నారంగనాగరంగతూదబంధూకకరకకురవక కురంటక కుందసింధుకకురువిందకందవంజుళవంజుళ చంపకనింబజంబూజంబీరకరంబనికుంజ శంబరీఖరమంజరీ కటురంజనీమిసి రేచనీవృషపాలినీకుణి కేశి నీఫలజీవనీప్లవరోచనీ గండీరకర్కారపటోల సారతరరసాలసాలసాలమాలాభిశోభితంబును, శైలాటవనాటధారాట వ్యాఘ్రాటఖంజరీటచిత్రకాయలులాయమృగాదనభాలూకగండక వేదండభేరుండ భూరిమాయుకోకఘూకకాకదత్యౌయ్యర్ఝిల్లికా కేకిలోక నిబరీసదుస్సహాని నాదసంకులంబును, నంబరచుంబనాడంబర మహత్తరవారిధారాసంయుతానంత వాహినీవిభ్రాజితంబును, గందరాంతరస్ఫుటస్ఫటిక శిలావిశాలశాలానితాంత కాంతరత్నకాంత విటంకరాకాప్రాలేయకర ప్రవవిస్తారితతుషారవారివార ప్రతిబింబాపదేశతత్స్థలగానలోలామరబాలాముఖశోభాపహారార్థసమాగత లేఖ్యావలోకనకారణ కంపితాంగవిహికామయూఖ పరాస్కందిరంజితంబుమ, శంబరపరశబరశరవిసరదర పరస్పరనిరంతరనిరంతరాయపరీరంభసంరంభ సుభగంభావుక వికుర్వాణ గీర్వాణవిటవిటీవికటంబును, గాంగసికతాతలజాతలవలీనికుంజపుంజమంజుగుంజద్దోలాందోళిత శుకరంజితంబును, నగువనంబును దరియం జొచ్చి, మన్మథుండు రతీదేవితో ని ట్లనియె, నల్లదె హరిపరుషనఖరముఖ విదారితకరికుంభగళన్మౌక్తికంబు లమాసనిసి విహాయసంబందు నందంబు మీఱుతారలుంబలె నాగహ్వారంబున రాజిల్లు చున్నవి, నిశ్శంకసంకునిర్ముక్తసాంకవామోదాతిమాత్రతనో యిచ్చోఁ జిలుకలు మొదలకున్నవి, నిర్ఝరక్రీడాసమభిహారలుఠదభంగభంగ మృదంగరవోల్లాసనటత్కలాపికలాపానులాప బధిరీకృత సందావితసంకుచిత స్ఫటపృదాకు లాకులపాటుననాకులఁ దూఱెడి, మఱియుబహుశాఖాభిశోభితం బై నిగమంబును, ధ్రువమూలం బై జ్యోతిశ్చక్రంబును, జటోపేతం బై మహానటుని, సారవంతం బై జలముక్కును, ద్వగ్వేష్టితం బై వనవాసిని, బత్త్రయుతం బై పతత్త్రిని, వనమాలావిరాజితం బై హరియురంబును, నవనవపల్లవసంగతం బై బంధకిని, హృద్యవంతం బై వక్షోజములను, క్షుద్రసంగతి క్షుద్రక్షుద్రంబును, గలికాభిరామం బై యుదాహరణంబును, సుమనస్సంయుతం బై త్రివిష్టపంబును, ఫలవంతం బై నిశ్చలవ్రతుమనోరథంబును, నాశ్రితానంతసత్త్వం బై నారాయణుని, సద్విజవేష్టితం బై హోమానలంబును, బురిడించుచు, దిగంబరత్వంబునఁ బల్లవసంఘాతముం గూడి యసి

యాడుచుఁ బరమలిమ్లుచస్పర్శనంబున నంబరములకుం బ్రాఁకుకొమ్మలనుల్లసిల్లు బహువిధపాన్థహీరుహంబుఁ గను మని యుచటివిశేషంబులం జూపుచుఁ జని చని, రతికేళీశ్రమాపనోదనోదక ఖేలాలోలసురబాలానికరయౌవనలక్షణయౌవన లక్షణ సంభ్రష్టఘనసారఘనసార కస్తూరీకుంకుమ పంకసంగత పింగలద్యుతి కలితఘుమఘుమాయిత వారిపూరచిత్తానంద సంధానమందాలకనందాభిధాన తరంగిణుల దాఁటి తత్పురోభాగంబున నతతపరిణతతతసరసతరతరుకిసలయ ఫలనిచయగిళనకుతుకపికశుకవిషధరపరముఖ సకలవికిరనికరమధురమధుపానమద కలితమధుకరకులకోలాహల మనోనందక సుందరభాతిందిలాభిరామం బగుసౌ గంధి కారామంబుఁ జేరంజని తన్నికటతటంబున. 3౦౨

తే. వెలయు ఛాయాసముచ్ఛ్రాయవిశ్రుతంబు, శుద్ధమాణిక్యరుచిఫలశోభితంబు
సారయోగమయంబు సంసారహరము, పటిమముక్తాళిశస్తరేవటము వటము. 3౦3

కం ఆవటమూలంబునఁ దగ, ధావనభావనసమాధితత్పరుఁ డగుచుం
జేవ నిమీలితలోచనుఁ, డైవఱలెడిహరునిఁ ద్రిపురహరునిం గనియెన్. 3౦౪

సీ. మణికుండలోల్లసన్మణికుండలాంచితు మణికుండలాదివైమానికవృతు
సర్వతోముఖవంద్యు సర్వతోముఖకేశు సర్వతోముఖునిఁ బ్రశస్తగుణుని
ఘను విరోచనవిరోచనవిరోచననేత్రు వరవిరోచనపితృప్రణుతమహిము
జిను సనాతను సనాతను సనాతనపౌత్రు హరు సనాతనశిరోహరుని శివునిఁ
దారక శతార హరి తార సారహీర, హార ఘనసార మందార శారద ధీర
సారస పటీర ఖర్జూర శారదా వ,దాతరుచి రుద్రుఁ గాంచె నభీతమతిని. 3౦౫

తే. దక్షిణోరుస్థవామపాదంబుతోడ, సవ్యజానువుపయిఁ జేయి సాఁచి యక్ష
సరము వలకేల ధరియించి సరసయోగ, ముద్రఁ గైకొని శాంతుఁ డౌరుద్రుఁ గాంచి.

తే. బాల యీతనితప మూర్విపాలు సేసి, నిముసమున వత్తు బెదరక నిలువు మిచట
ననుచు రతిడించి తమిఁ బెంచి యనువుతోడ, నూఱడించుచుఁ జనియెఁ దా నుగ్రుఁ జేర.

కం. చెలు వగుఋణముం బాసిన, జెలువను వెస పీడి చనియెఁ జెచ్చెర మరుఁడుం
దలపడెడిచోటికిని బద,ములు బిఱబిఱఁ జనెడిఁ గాదె మునుకొని ధరణిన్. 3౦౮

సీ. కలకంఠవితతులకలరావ మొసఁగించి చిలుకలు కూయఁగా సెల వొసంగి
విస్మృతి బర్హంబుల విచ్చి యాడుచు శిఖావలములు కేకలఁ జెలఁగఁ జెప్పి
మధుపానవివశత మధుపాళి చెలరేఁగి చెవులు చిల్లులుపోవఁ జేయఁ బనిచి
సరస మాకొలఁకుల సారవంతము లైనసారసచయములఁ జక్కఁ గూర్చి
కోమ్మఁ దేనియ సంపర్తి కావితతులఁ, జిలికి ములుకులఁ బస మీఱఁ జికిలి సేసి
చారుచామరపుష్పకీసాలఖడ్గ, పాణి చామరపుష్పకృపాణి యగుచు. 3౦౯

తే. పంచదారను దియ్యపక్కి పంచధార, లంచితంబుగఁ ద్రొక్కంగఁ బంచశరుఁడు
పంచసుస్థానముల నిల్చి యించువిల్లు, వంచి సారించి గుణము బిగించి మించి.

ఉ. హత్తినవెండికొండ తెలుపం జొరఁగఁ బున్నమచందువెన్నెల
ల్మొత్తము లాడఁగా హరునినిర్మలపాండరదేహకాంతితో
నెత్తిని దల్లితల్లి విధునిం గని కాదని కప్పు నొప్పునా
కుత్తుక సూటి చూచి వెసఁ గో యని యార్చె మరుం డహంకృతిన్. ౩౧౧

కం. కంఠేకాలునిపైఁ బగఁ, గుంఠితమతి గాక వీఁక క్రూరశరము లు
త్కంఠతఁ గురిసెను మార్వ్యయు, తంతస్మిన సూనశరుఁడు తవశిల్లంగన్. ౩౧౨

పంచచామరము. ధణంధణాధణా యటంచు దండిడిండిమంబులు
ఝణీల్ ఖణీల్ ఖణీ లటంచుఁ గాంతవాద్యఘోషము
ల్ఝణంఝుణాఝుణా యటంచుఁ జారుకంకణంబులు
న్గణమ్ము మ్రోయ సంపగముల గ్రుచ్చె వ్రచ్చెఁ బెచ్చుగన్. ౩౧౩

పంచచామరము. హుటాహుటిం బటాలటం జహో మహోద్ధతం గడం
దటాలునం గటారి దూసి దాఁటుకొంచు నించువి
ల్దిటంబుగాఁగఁ బట్టి దిట్ట తేఁటిదాఁటు దూఁటఁగాఁ
జటాలునన్ ఝటించెఁ బోరు జాటజూటుతోడుతన్. ౩౧౪

వ. ఇట్లుతిముఱి విరియంపఱ పరంపరలుగఁ బైపైఁ జుఱుకుక్కన గుఱుకుక్కనఁ గుఱుకుక్కనఁ దొఱంగించిన మన్మథానలదందహ్యమానమానుండై చిత్తంబు త్తలపాటు సెందఁ జిక్కఁ బట్ట నేరక యోగంబు త్యాగంబు సేసి యించుకించుకకన్ను లల్లనల్లన విచ్చి చూచి తదయెదుర నవష్టంభసంరంభవిజృంభితుండయి మించు నించు విలు గానఁ గని రోషంబు వేషంబుదాల్చినగతి మండిపడి నీవిసవిసలు నాయొదురనా యని హుంకరించి ఫాలనయనంబు దెఱచినఁ బ్రళయవేళాప్రభూత ప్రభూతసర్వభూతచేతోభీకరజాతజాజ్వల్యమానకీలికీలాకలాపంబు దుర్నిరీక్షంబై పయిం బడ మన్మథుండు భస్మీభూతుం డయ్యె నంత. ౩౧౫

చం. తిరిగె వసుంధరాతలము దిర్దిరఁ గుమ్మరసారె పోలికం
బరఁగ విధాత యూఁత గొనెఁ బల్మఱు వాణికరప్రవాలము
ల్సరగను జుక్కలెల్లను రసాస్థలి రాలె మహోగ్రరోషశం
కరనయనోత్కటప్రకటకాండసుతజ్వాలనార్చులం గడున్. ౩౧౬

కం. ఆకులమతులై లోకులు, చీకాకుపడిరి లయమ్ము సేకుఱె నని వే
నాకులఁ దూఱెను బాములు, నాకులు గ్రక్కదలె బెదరె నాకవిభుండున్. ౩౧౭

కం. కేకులు కకవికలయ్యెను, గోకిలలు కకావికలుగఁ గూకలు మానెం
దేఁకువ చెడి చిల్కలు వెఱ, తాఁకున శివశక్తు లన యథాయథ లయ్యెన్. ౩౧౯

కం. నిరతముఁ గూరిమి నేలిన, దొర మరణము నొంద నకట దొసఁగులు వొసఁగం
గర మఱిముఱి మసుశరములు, పరినాగము వనట చెలఁగ వనములఁ బడియెన్.

ఉ. ఆరభసంబుఁ గన్గొని మహారభటి న్భటవర్గ మెల్లెడ
న్వారక పాఱఁ గాంచి వెఱ వాటిల పాటలగంధి యారతీ
సారసనేత్ర సూనశరుజాడను గానక కానలోపలం
బోరున నేడ్వ సాగెఁ గరముం జెలరేఁగుమనోగవేదనన్. ౩౨౦

ఉ. ఇందుల కీరు వచ్చుట మదీశ్వరుఁ గానలపాలు సేఁతకా
యిందఱుఁ గూడి వచ్చి యిట స్వేచ్ఛను బోయెద రక్కటాకటా
పొందుగ నాథుఁ జూపుఁ డని పొక్కుచుఁ బక్కులఁ బిల్చురీతి నా
క్రందన మారఁ జేసెఁ గలకంఠి వనప్రియపంచమధ్వనిన్. ౩౨౧

సీ. హరులార భీకరహరులార హరులార హరులార కానరే హరికుమారు
హరులార కుముదాప్తహరులార హరులార హరులార కానరే సరసిజశరు
శిఖులార మండితశిఖులార శిఖులార శిఖులార కానరే సుఖనిదాను
నవులార మంజుమాధవులార యవులార యవులార కానరే యవిపథైర్యుఁ
బికములార మనోజ్ఞాళిపికములార, ధ్రువములార మహోన్నతధ్రువములార
శుకములార సమిద్ధకింశుకములార, కానరే నాదునాథు నీకానలోన. ౩౨౨

సీ. అళులార సారకదళులార కానరే మాధవుఁ బోలెడిమాధవునిని
కరులార ఘనదయాకరులార కానరే మాధవుఁ బోలెడిమాధవునిని
ఝరులార పాంథనిర్ఝరులార కానరే మాధవుఁ బోలెడిమాధవునిని
గవులార రుచిరశుకవులార కానరే మాధవుఁ బోలెడిమాధవునిని
ధరములార మహాపయోధరములార, దరములార సితద్యుతిదరములార
మీర లైనను గానరే మేఘవర్ణు, ఝషములార మనోహరఝషములార. ౩౨౩

సుగంధి. అంగజాతుఁ గానవా విహంగమా కురంగమా
వంగమా ప్లవంగమా లవంగమా కళింగమా
సింగమా భుజంగమా ద్రుశృంగమా తురంగమా
భృంగమా రథాంగమా విభీతమా కపోతమా. ౩౨౪

ఉ. హా యను వీర మార తగవా నగవా పగవాఁడవా యను
న్హోయను రాఁగదే యను నయో యను నో యని హాయిఁ బల్కరా

దా యను దాయనా యను సదా దగునాదగునాదు విరిచు ర
మ్యా యను తాయియా మనము మాయను రాయిడి పెట్ట నీ కనున్. ౩౨౫

ఉ. ఏగతిఁ బోవుదానఁ దెరు వెయ్యది యెవ్వరు దిక్కు నాకు నీ
వే గతి గాక యెచ్చటికి నేగితొ యచ్చటి కేను వచ్చెద
న్జా గిఁక నేల గోర్కి కొనసాగఁగఁ దోడ్కొని వేగఁ బోఁగదే
రాగముతోడ నాథ గనరా యనుఁ బెల్లుగ నేడ్చు దీనతన్. ౩౨౬

కం. మారా యను నేరా యను, మేరా యను నన్నుఁ బాయ మేలా యనుఁ జే
కోరా యను మనవిని గై, కోరా యను నీకు మేలుకో రాదె యనున్. ౩౨౭

కం. సతులకు భృత్యుల ధనముల, హితులను బంధువుల గురుల నిచ్చెడిపురము
ల్క్షితిఁ గలవు కాని యతులిత, పతులం గలిగించునట్టిపట్టన మున్నే. ౩౨౮

కం. పతి నెడఁ బాసినసతులను, బతితలచందమున హేయభావంబున నీ
క్షితిఁ గనుఁగొందురు జనములు, పతితం బైనట్టిశునకపలలముఁ బోలెన్. ౩౨౯

కం. పతి యుండిన సుతు లుందురు, పతియుండిన ధనము లుండు బంధువు లుందుర్
పతిఁ బాసినఁ గని పెంచిన, సుతులును నిర్లక్ష్యమతిని జూతురు సతులన్. ౩౩౦

కం. హారము ఘోరం బగు వెలి, చీరలు చీఁదఱలు నగ్నిశిఖ యగ్నిశిఖ
ల్గారము ఘనసారము సం, సారము నిస్సార మయ్యె సతుల కిలైనన్. ౩౩౧

కం. ముండ లని మబ్బు విడిచిన, యెండ లనుచుఁ బట్టి విడువ నెగసెడిబిఱుసా
మండ లని యెత్తి విడిచిన, బండ లనుచుఁ బలుకు చుంద్రు పరిహాసోక్తుల్. ౩౩౨

కం. కుయ్యో యనుచు నిలింపులు, కు య్యిడ రక్షింప నయ్యె కోరిన దయచే
నయ్యో పాపం బనినను, నయ్యో పాపంబుచేత హాతుఁ డైతె పతీ. ౩౩౩

సీ. ఈరేడుజగముల నీమహేశ్వరునకు మా తేరు లేరు చూ మహిమ నంటి
శుష్కవాదములకుఁ జొరఁగఁ బూనెద వంటి నీకుమారుఁడు కదే పోకు మంటి
బలవద్విరోధంబు పాడి గా దని యంటిఁ దపము కూల్చినఁ గీడు తగులు నంటి
రోసంబు లే కున్న మోసంబు లే దంటి నావంకఁ జూడవే నాథ యంటిఁ
దుంటవిల్లు దాల్చి కొంటెగా యనిపించు, కొంట మేలె యూర కుంట కీడె
యెంత చెప్ప మరల వే నేమి సేయుదుఁ, బ్రాణనాథ యంటి వలవ దంటి. ౩౩౪

సీ. ఏవాడ నినుఁ జూడ నేజాడఁ బలుకాడ మక్కువఁ జెప్పవే మాకుమార
యే పొందునీపొందు నేచందమునఁ గందు మక్కువఁ జెప్పవే మాకుమార
పెనుమంట లదరంట నిను నంట నే మంటి మక్కువఁ జెప్పవే మాకుమార
ధృతిఁ జాలి దయ మాలితివె యాలిగతి జాలి మక్కువఁ జెప్పవే మాకుమార

కొన రాని పెద్దకానలోఁ గోనలో, నాలు తూలఁ గదలి జోలి వదలి
డెందమందుఁ గుందు పొందక కుందక, యెందుఁ బోయినాఁడ వండగాఁడ. ౩౩౫
వ. అని ప్రలాపించుచుఁ గలతెఱం గెఱింగినది యై. ౩౩౬
మ. చ్యుతవేణీఘనబంధ యై బహుతరాశ్రుచ్ఛన్ననేత్రాబ్జ యై
గతహారావళి యై ముహుర్ముహురుద్వేధుతదీర్ఘశ్వాస యై గాసియైఁ
బతిభిక్షాం లఘు దేహి మే కరుణయా వందారుమందార యం
చతిదీనోక్తులఁ జేర వచ్చె రతి లోకాశ్రీహరు న్శ్రీహరున్. ౩౩౭
వ. ఇట్లు డాయ వచ్చి భయభక్తిసంభ్రమంబులు ముప్పిరిగొన హస్తజలజంబులు ముకుళించి యి ట్లని వినుతించె. ౩౩౮
కం. భవనాశన పావనాశన, పవనాశనహారవారపరమశరీరా
యవినాశన భవ నాశన, భువనాశన శివనిదాన పుణ్యనిధానా. ౩౩౯
కం. మదవారణమదవారణ, మృదుకారుణికాగ్రగణ్య హితభక్తాళీ
మదకారణ వృషవారణ, సదీపజార్కానలాక్ష నతరక్ష శివా. ౩౪౦
కం. హాలాహలజాలాఖిల,కోలాహలశమన దర్పకుంఠితశమనా
హేలామునిబాలారత,లీలాప్రవణారితరంగ లింగశరీరా. ౩౪౧
కం. గోవల్లభ గోవల్లభ, గోవల్లభవినుతవిమలగోయూపహారా
గోవల్లభ గోరుహాగో, గోవిశదశరీరకలిత గోవిందశరా. ౩౪౨
వ. అని మఱియు ని ట్లనియె. ౩౪౩
తే. పూలచే నిన్ను వ్రేయుట పూజ కాదె, బాధకం బైన భక్తులు బ్రతుకఁ గలరె
యాలి నొల్లనివానికి నీలకూర,లోన లవణంబు తక్కున లోకమునను. ౩౪౪
కం. అరపురుషుబలము గలిగియు, నరగడియును లోక మెల్ల హరియించె దహో
పరుసపుఁగోపము నిండిన,పురుషత నీ కున్న నెట్టు పోసఁగునో యెఱుఁగన్.
తే. తండ్రితలఁ గొట్టి పే రొందుదర్పఖరుఁడు, పిన్నతండ్రిని జంపుట పెద్ద యగునె
తల్లిఁ బట్టెడివానికిఁ దలఁచి చూడ, మహిని బినతల్లి శమ్పసమంబు గాదె ౩౪౬
తే. కూర్మిసతి కెంతయు ననుకూలుఁ డగుటఁ, గొలుచు మానులభార్యలఁ గూడి లీలఁ
బెద్దగంగమ్మ నెత్తిని బెట్టుకొంట, నర్ధచంద్రప్రయోగ మర్హంబ నీకు. ౩౪౭
కం. పెట్టఁగఁ బోయఁగఁ దొందర,పెట్టము ని న్నెన్నఁడేనిఁ బ్రియము దొలంగం
గట్టలుకఁ జంప నేటికిఁ, గట్టా నీ కేమి యెగ్గు గావించె నయా. ౩౪౮
చం. మగనిని జంపి తేల యని మాటికి మాటికి నెంత వేఁడినం
బొగలుచు నున్న నీకు దయ పుట్ట ద దెట్టిమనంబొ దైవమా

మగనికి జీవ మిచ్చి నను మన్నన సేయు మటంచు వేఁడినం
బిగువునఁ బల్కనొల్ల వయొ బెల్లను కొట్టినరాతిరీతిగన్. ౩౪౯

కం. హాలహాలము నీకుఁ గబళము, పలలప్రియ శక్తి తేజి పలలాశని నీ
తల కీలాలస్తిమితము, పలలాశప్రియుఁ డయో కృపాపరుఁ డగునే. ౩౫౦

శా. చె న్నౌభూషలు వస్త్రము ల్ధనములుం జెల్లెండ్రకై యిచ్చుచుం
గన్నం బ్రీతిఁ జరించు చుందు రవనిం గాకున్న సంప్రీతిచే
మన్నింప న్మృదుభాష లాడఁ దగదా మానంబు మేలే కదా
యన్నా నీవలెఁ జెల్లెలి న్విధవఁ జేయం జూచిరే యెవ్వరేన్. ౩౫౧

కం ఒక్కటమ మ్మిడుఆ నీ, చిక్కనికోపాగ్ని పాలు సేయక నన్నుం
దక్కించి తేల యెంతటి, కక్కుఱితకిఁ బాలువడితి కటకటఁ బడఁగన్. ౩౫౨

కం మంగళము సేయు మాకును, మంగళదేవతకుమారు మనుఘము నాకీ
మంగళసూత్రంబును ద్రుం, పంగను గనఁ బోకు సర్వమంగళకారీ. ౩౫౩

ఆ. అతనుభూతికొఱకొ యాతనిభూతికో, యతను భూతి సేయ నానపడితి
వయినవారు కాక యాలి నమ్మఁ బెట్టఁ, గలరె యనెడిపల్కు గలదుకాదె.

ఆ. నీవు నిగ్రహింప భావించితేని నా, సుతుల నేమి కలుగు నతుల పరుష
నీ వనుగ్రహింప భావించితేని నా, సుతుల నేమి కలుగు నతులపురుష. ౩౫౬

వ. అని నిజజనకుం డగుచంద్రు నుద్దేశించి యతనిం గట్టుకొని యిట్లని పలవించె.

శా. ఖండాబ్జాభరణోగ్రనేత్రభయదాఖండానలజ్వాలిక
ల్నిండారం బయిఁ గ్రమ్మి కూలఁ గనఁగా నీచిత్త మెట్లోర్చెనో
వాంద్రు న్నీంద్రునుఁ బోలె, నల్లుఁడు కదా వారింప రాదా యెసా
తండ్రీ చూడఁగఁ గోరితో తనయ వైధవ్యంబుఁ జేపట్టఁగన్. ౩౫౭

కం. తమ్ములఁ బుట్టించెడిమా, బమ్మకుఁ దమ్ముండ వగుచు బాధించెడిచోఁ
దమ్ములఁ బినతమ్మునిమృతి, నెమ్మదిఁ జూడంగ నేల నేరవు చంద్రా. ౩౫౮

కం. రీతి యిది కా దనక సం, ప్రీతిని గనుఁగొంటె యనుజుమృతి ధరలోన
న్భ్రాతలు పుట్టఁగఁ బెరుఁగఁగ, జ్ఞాతు లనెడుపలుకు చూడ సరిదాఁకెఁ గదా. ౩౫౯

వ. అని గంగాదేవి నుద్దేశించి యిట్లనియె. ౩౬౦

ఆ. పిండిబొమ్మఁ జేసి పీటపై నిడనాఁడు, బిడ్డతనము మీఱ వేగ నదరు
నాఁడుబిడ్డ వౌట వేడుక చూచితే, మగఁడు చంప ననుజుఁ డెగువ మగున. ౩౬౧

కం. విషధరభూషున కంబుధి, విషమునఁ దబ్బిబ్బులైన విషమున కెపుడు
న్విష మౌషధ మనుచును నీ, విషముం దల కెక్కఁ జేయు వేగమె తెలిసెన్. ౩౬౨

కం.మగనాలికస్తి జఱభికి, వగలాఁడికి నేమి తెలియు వదినియ వగవ
న్జగఱాఁగ వై మనోహర,యుగళంబునఁ గుబుకునీకు నూహాయుఁ గలదే. ౩౬౩

సీ. అంచున నుండియు నాఁపఁగా రాదొక్కో యాపగా రాదొక్కో యంతదయయు
మామ వై మన్నించుమాట మాబరువుగా మాపర్వు గా దంచు మానితొక్కొ
తండ్రి యంచును నైనఁ దలఁపఁగాఁ బాడిగా కాపాడఁగా నీకుఁ గరుణ రాద
కడుఁగొని యిఁక నైనఁ గానఁగా రాదుగా గారాదుగా యిట్టికఱకుఁదనము
తండ్రి వై యేమి తురకలవైన మీవు, భ్రాత వై యేమి తలఁప శబరుఁడ వీవు
తురకలకు బోయలకు నైనఁ దోఁపదొక్కొ, వీఁడు నావార లనెడివివేకయుక్తి. ౩౬౪

వ. అని హరు నుద్దేశించి యి ట్లనియె. ౩౬౫

కం.మానినిని నిన్ను మానను, మానను మానమున ననుమానము మను నే
నీనామము నోమున నని, మాననినేమమున మేను మాన స్నానన్. ౩౬౬

ఉత్సాహ. అనుచుఁ బెక్కుగతుల నుతుల హరుని వేఁడ దీనత
న్మనములోన జాలిఁదూలి వాని రోస మింతితో
ననియె నీమనోహరుం డనంగుఁ డై చెలంగి యో
వనిత నీకుఁ దోఁచు చుండు వనట మానుమీ వెసన్. ౩౬౭

కం.జన్మాంతరమున నీతో, సన్మానముతోడఁ గూడు సశరీరుండై
మన్మథుఁ డిది సత్యంబు జ,గన్మాన్యచరిత్ర చింతఁ గలఁగకు మబలా. ౩౬౮

కం.తపసులకు సాధుజనులకు, నపకారముఁ జేసె నేని యవినీతుం డై
కృపణుం డై ధరఁ గూలుట, విపరీతము కాదు చూవె విహితవిచారా. ౩౬౯

వ. అని యాదేశించినఁ దదనుజ్ఞఁ గొని యెందేనిఁ జని తత్కాలం ౧ నిరీక్షింప
ను ద్దేశించి యున్నసమయంబున. ౩౭౦

కం.శారదనారదదారద, హీరగరుడగళసుతారహీరపదరడిం
డీరద్యుతి హరిభక్తివి,శారదనారదుఁడు వచ్చె సకిఁ జేరంగన్. ౩౭౧

కం.వచ్చినమునిఁ గని మనమున, నచ్చిక భయభక్తియుక్తి సాష్టాంగముగం
బెచ్చుగ నతు లొనరిచి తెఱఁ, గచ్చుపడం జెప్ప మౌని యనియెం బ్రీతిన్.

కం.వనితా ద్వాపరయుగమున, వనజాక్షుఁడు సంభవించు వనజాలయ రు
క్మిణి నాఁ బుట్టెడి వారికి, జననం బగు నీధవుండు జలజాతాక్షీ. ౩౭౩

కం.పసిపాపం డై యుండఁగ, మసలక గొని పోయి వాని మడియింపంగా
వెస శంబరుఁ డనియెడిర, క్కసుఁ డొక్కఁడు వార్ధి వైచుఁ గడగను మనుచున్.

ఆ. వాని మీను మ్రింగ వలలచే నామీను, పట్టి బెస్తవాడు పసదనముగ
శంబరునకు నియ్యఁ జంపంగఁ జూచెసీ, మాయచేత ధవుని మనుప వమ్మ. ౩౭౫

వ. నీవు తత్పురంబునకుం జని శంబరు నాశ్రయించి దాస్యంబు గానిచరిత్రంబున
నుండి నీమగని బ్రతికించుకొమ్మని దీవించి పునర్దర్శనం బయ్యెడు మని చెప్పి

యథేచ్ఛం బరిగె రతియుఁ దత్కాలంబు నిరీక్షించుచుఁ దపంబు సేయుచుండె నంత నారదుండు మురహరుకడకుం జని పురహరుండు స్మరహరుండగుట నెఱింగించినఁ జలిమలయల్లునిచేఁ దనయల్లారుముద్దులగారాముపిల్లవాఁడు చెల్లుట విని పల్ల టిల్లి యుల్లంబు మల్లడిగొనఁ బెల్లుగఁ దల్లడిల్లి యొల్లఁబోయి తెలిసి చల్లవెలుఁగు చెల్లెలు విలపింపఁ దొడంగె. ౩౭౬

సీ. నీముద్దునెమ్మోము నేఁ జూడఁ గల్గునా మానుకుమార కుమార మార
నీమృదుభాషలు నే వినఁ గలుగునా మానుకుమార కుమార మార
నిద్దంపుఁ జెక్కిలి ముద్దిడఁ గలుగునా మానుకుమార కుమార మార
నీసాటివానిని నే నెందుఁ గందురా మానుకుమార కుమార మార
కానివానిభంగిఁ గనియుఁ గానక మున్న, యిట్లు వాయఁ గలిగె నేమి యందుఁ
గడకు నీదురూపుఁ గనులారఁ గాంచెడి, నోము నోఁచ నైతి నేమిఫలము. ౩౭౭

సీ. కన్నులమండవిల్కాఁడ ని న్గాంచినఁ గన్నులు మండెనా గంగపతికిఁ
జింతకై కాంచినశిశువు నీ వౌటనో చింతకై కాంచినశిశువె యైతి
గాలికై కనినట్టిచూలు నీ వగుటనో గాలికై కనినట్టిచూలె యైతి
భువి శివార్థంబుగాఁ బుట్టినాఁడవు కాన భువి శివార్థంబుగాఁ బుట్టు టయ్యె
నీకుమారుఁ డనుచుఁ బోకడ కొప్పితి, నీకు మారుఁ డగుట నే నెఱుంగ
మదన నాదుహృదయమథనంబు సేయుదే, వనటపాలు చేసి వనజబాణ. ౩౭౮

ఆ. మూఁగినోము నోఁత ముదమున మంగళ,వారనియతిఫలము వచ్చెనయ్య
కొదవనోము నోఁచి కోరినఁ గలుగునే, నిందునోముఫలము నిక్క మరయ. ౩౭౯

కం. తనయా యను విగతనయా, యనుకంపను మాని చనితె యనుఁ గంపముచే
తను వ్రాలుచు లేచుచు న, న్గనరా యను వెతలు వాపఁ గన రార యనున్.

కం. వ్యసనం బేరూపంబునఁ, బొసఁగునొ నే నెఱుఁగఁ బుట్టి బుద్ధి తెలిసి హా
వ్యసనంబులలోన మహా,వ్యసనం బగుపుత్రశోక మలవడియెఁ గదే. ౩౮౧

కం. గరళగళనయనకీలో,త్కరములు బైఁ గవియ నేమి తలఁచితొ మదిలో
దురపిల్లితొ నను దూఱితొ, సరసిజముఖపంచరోప సదమలరూపా. ౩౮౨

కం. జనకుఁడు జగదవనుఁడు హరి, యనుజుఁడు జీవనవిధాత యగుధాతయు నై
జననం బైతివొ లేదో, హననం బైతివె యనాథునట్టులు తనయా. ౩౮౩

కం. అంటినఁ గందెడిమే నల, మంటలపా లయ్యె నిమిషమాత్రములో నీ
వంటికుమారుని నెక్కడ, గంటికిఁ బండువుగ నేను గనుఁగొందు నయా. ౩౮౪

వ. అని రమాకాంత నిజకాంతునితో ని ట్లనియె. ౩౮౫

ఆ. పుట్టినట్టిపట్టి పుట్టి పుట్టక మున్నె, గట్టుమెట్టుదిట్ట మట్టుపెట్ట
గిట్టినట్టు వినియు గట్టిఱాయియుఁబోలె, దిట్ట వైతి వింక నెట్టు లకట. ౩౮౬

ఉ. ఏ మనుదాన నీసుతుఁడె యిట్టులు పంచతఁ బొంద దీనుఁ డై
యే మనువారు లేక నిను నే మనువారు జగంబులోపల
న్నా మనువార లేరు నకటా యగువారలె చంపఁ జూడ న
య్యో మనువారు లేరు మది నూహ యొనర్పుము కంజలోచనా. ౩౮౭

ఉ. వెచ్చనియూర్పుకాఁకలకు బీటలువాఱఁగ మోవి పైపయిం
బెచ్చుగ రాలుబొప్పములవేఁడిమి వాడఁగఁ జెక్కుటద్దము
ల్విచ్చఁగ హారవల్లరులు పెట్ల నురోజవిలేపనంబు మై
పెచ్చుగఁ దూల నేడ్చె సుతుఁ బేర్కొని కోకిలకాకలీధ్వనిన్. ౩౮౮

చం. ఇటు విలపించుకాంతఁ గని యిట్లనె శౌరి దయార్ద్రచిత్తుఁ డై
కటకట యింతవంతఁ గలఁగం దగునా జగమందు మృత్యుసం
ఘటనము దేహధారులకుఁ గాలము తీఱిన సిద్ధ మాట సం
కటపడ నేల బాల మది కాఱియఁ దూలఁగ నేల బేల వై. ౩౮౯

తే. జగతి కేలికసాని వై వగల నొగిలి, కుందితేనియుఁ బాసురు ల్గుందు టరుదె
తాను జచ్చియు సాధించెఁ దగవు మెఱసి, చిన్నిపుత్త్రున కేల యీచింత నొంద.

కం. అపరభవంబునయం దో,చపలాయతనేత్ర నీకు స్మరుఁ డుదయించు
న్వపువును గని వగవకు మని, కృపతో నూఱార్చె శౌరి శ్రీభృగుజాతన్. ౩౯౦

వ. అంత. ౩౯౧

ఉ. దాంతియు శాంతి నిష్ఠ గలతాపసవర్యుని పేర మీఱునా
కెంతయుఁ జన్నె యభ్యుదితహీనసమాహ్వయ మంచు లేచి వి
శ్రాంతిని సుప్రభాతముల బ్రాహ్మమునం బఠియించె నాఁగ నే
ట్రింతలగాన మొప్పెను హరిన్ముఖదేశముల న్మనోజ్ఞమై. ౩౯౨

ఉ. కూరిమి మీఱ రశ్మిలను గూర్చినమిత్త్రుఁ డటంచు నెంచ క
య్యారె పతంగ తావకపరోక్షమున న్భవదీయజాయ బ
ల్గారిక వెట్టెఁ జంద్రుఁ డని గ్రక్కునఁ జెప్పెడి నా నుషస్సునం
బే రెలుఁ గొప్పఁగా విటపివీథులఁ గూసె శకుంతసంతతుల్. ౩౯౪

కం. అల్లునిమృతిఁ గని శోకము,పెల్లున విలపించుకూఁతువెతలం గని ని
ల్వెల్లను నీఱుగఁ జంద్రుఁడు, వెల్లన యై బల్లిహారలవిధమున నుండెన్. ౩౯౫

కం. ప్రత్యక్షం బై చూచెను, మృత్యువుఁ గన సుతుఁడు దా నమృతకరుఁ డై యా
చిత్యం బెఱుఁగక యనిహరి, మృత్యువు నొందించు నంచు నిందుఁడు గ్రుంకెన్.

కం. సతు లగుటఁ దార లాశశి, గతియ తను కుచిత మని సహగమనముఁ జేసె
న్నిత్తె మెంచక సరసులసం,గతి పీడవు కువలయములు గణికలజాడన్. ౩౯౭

చం. వలపులు గ్రమ్మ నెమ్మదిని వారక బాహులతానిబద్ధు లై
తలఁపులు నొక్క పై నిదుర దద్దయుఁ జెందినకాముకాళికిం

గలువలపాళికిం దివసకాల మహాశ్రమ ముక్తపాళికిం
గలుఘలు దీయువారి కెదగాలము వేకువకాల మైనచోన్. ౩౯౮

ఉ. ఓలి వియత్తలం బనెడునుప్పరిగం దమిఁ జేరి యామినీ
బాలికతో నిశాధవుఁడు పంచశరాహవగాఢకేళిమైఁ
దేలఁగ ఋక్షమాల లటు ద్రెస్సినఁ జిందరవందఱై ధర
న్రాలినముత్తియంబు లన రాజిలెఁ బచ్చిక మంచుబిందువుల్. ౩౯౯

కం. హరిహయపురిజను లొగి దుర్భర మగుచలి వాపికొనఁగ బలుమంటలు వై
చిరొకో యనఁగను వేగను, హరిహయుదిశ నరుణకాంతి యగ్గల మయ్యెన్. ౪౦౦

మ. ఒనర న్రశ్మలఁ గూర్చుమిత్త్రుఁ డని తా నూహింపకే పీఁడు నై
జనిశాటోద్ధతధూర్తవృత్తిమెయి నాజాయం గడు న్హింస చే
సెను సైరింపఁగఁ గాదు చాలు గతరశ్మిం జేయుటే యేల యీ
తనిఁ జంపంగఁ గళంకి నంచు హరి యంతం దోఁచె రక్తాస్యుఁ డై. ౪౦౧

తే. యామినీభామినీరతి సోముఁ డుండి, కేళిఁ గైకొన్ననక్షత్రమాలఁ గంక
ణములఁ బ్రాచిని విడిచె నా నమరె నమృత,కరవిసర్జితనీహారకంకణములు. ౪౦౨

తే. సహజపాండిమ శిల్పకుశలత మెఱయ, సాలెపురుగిల్లు కట్టినలీలఁ జూచి
సంతసం బొప్ప విధుఁడు వజ్రాలు చెక్కె,ననఁగ హిమబిందుతతులు బయల్లనమరె.

వ. అని సూతుండు వినిపించిన. ౪౦౪

పంచాశదంధ్రపద్యగర్భితప్రహరణకలితావృత్తము.

ఖరనుతఖరహు న్ఖరమదకరణు, న్ఖరదరకరణు న్ఖరకరకరణు
న్గరుహానుఖరవి న్గరుహాపకరకు, న్ఖరదభగరతు న్గరిణుకరహున్. ౪౦౫

వ. తలంచి ముని లందఱు నమస్కరించి రంత. ౪౦౬

కం. కమలాంచిత కమలాంచిత, కమలాంచితవక్త్రనేత్రకరశుభచయనా
విమలాయతశమలాహిత, కమలాహితకమలహితవికస్వరనయనా. ౪౦౭

కం. ధీర వి రామా కుజపర, ధీరవరా మాకనయన ధీపర వరధీ
ధీరవరప ధీనయన క,మారా వరధీరప జ కుమారా విరథీ. ౪౦౮

కం. ఖగరాజవాహ నిర్గల, ఖగరాజవిరాజవదన ఖగరాజనుతా
ఖగరాజపుత్త్రమదహర, ఖగరాజసుధామ పంక్తికంఠవిరామా. ౪౦౯

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాయమానమానసత్వమహావైభవ
వావిలికొలను రామచంద్రరాయతనూభవ సుజనవిధేయ సుబ్బ
రాయనామధేయ ప్రణీతంబైన శ్రీకుమారాభ్యుదయం
బనుప్రబంధంబునం బ్రథమాశ్వాసము.

శ్రీరామచంద్రాయ నమః.

శ్రీశారదాయై నమః.

శ్రీహయగ్రీవాయ నమః.

# శ్రీ కుమారాభ్యుదయము.

## ద్వితీయాశ్వాసము.



రామారమణీయహృ
ద్దారామవసంత రత్నహారామలవ
క్షోరామణీయకశుభ
శ్రీరామా వినుతసోమ సీతారామా. ౧

వ. అవధరింపుము సూతుండు శౌనకాదిమహామునీశ్వరులకు నావలికథ వినుతు వినుం
డని యిట్లనియె. ౨

మ. ఖలు లాద్దైత్యులు మీఱి సాధుజనులం గారింపఁగా లోక మా
కులతం బొందెఁ దపంబు డిందె మునులుం గోడొంది యజ్ఞాదుల
స్సలుపం గానక కుంది రంతఁ దతబాష్పక్లిన్ననేత్రాబ్జ యై
జలజాతాసనుఁ జేర వచ్చె వసుధాచంద్రాస్య దీనాస్య యై. ౩

ఉ. చేరఁగ వచ్చి యి ట్లనియెఁ జిత్తమున న్వెత దోఁప భారతి
వారిజలోచనాహృదయవల్లభ యే మని విన్నవించెద
న్భారము ఘోర మయ్యెఁ గడుఁ బాపము స్థాపిత మయ్యె దీనికి
న్వారక మాఱు గాంచి మనుస న్నను నెంచెదొ యార్తి ముంచెదో. ౪

కం. పుట్టించుటె పని యంచుం, బుట్టించెదుగాని వెన్క మును చూడవు మే
ల్పుట్టఁగ సుమతులఁ జేయవు, కట్టా చతురాస్యుఁ డంద్రు గా యిటు లైనన్. ౫

కం. నిక్కపుజగ మేలెద వను, టొక్కటె సాధువులు ఖలుల కోర్వఁగ లేమిం
జిక్కినవ్రేఁగున వేఁగుదు, నిక్కపుజగ మేలువాఁడవే నీ వకటా. ౬

కం. గుణవంతుల కల్పాయువు, లణకులు గుణహీనధూర్తు లాయుష్మంతు
ల్గుణహీనులు బలవంతులు, గుణు లబలులు గాఁగ నిట్లు గూర్తువు గాదే. ౭

కం. కులహీను లన్యమతజులు, పలువలు దొర లగుచు జగతిఁ బరఁగెడిచోటం
గులములుపాడై పోవఁగఁ, గులవిద్యకుఁ గూడు లేదు కువలయమందున్. ౮

కం.కష్టము సుఖము నెఱుంగ ర,నిష్టముఁ జేయంగఁ జూతు రెపుడుఁ బరులకు
నృష్టుల దుష్టులఁ గష్టా,శిష్టుల నుత్కృష్టపతులఁ జేసితె ధాతా. ౯
కం.దీనికిఁ బ్రతికృతిఁ దలఁపక, మానిన నే నోపఁగలనె మఱి యీభరము
న్నానుపఁ గదవే యనుచును, దీనాలాపంబు లాడె ధృతి దఱిఁగి వెసన్. ౧౦
కం.అని వేఁడినఁ గమలాసనుఁ, డనియె వసుంధరను గాంచి యలమటఁ బొందం
బని యేమి భరముఁ బాపెద, పసివిను మని పంచి లచ్చిపతికడ కరిగెన్. ౧౧
కం.చని ధరణీగురుఖేదము, వినయంబున విన్నవింప విష్ణువు వినుతుం
డనియెను ధర వసుదేవుని,తనయుఁడ నై యపనయింతు ధరణీభరమున్. ౧౨
కం.ఖేదము నొందక చను మన, మోదంబునఁ జనె విధాత మ్రొక్కుచు నంత
న్శ్రీదయితుఁ డుదయ మయ్యెను, శ్రీదేవకిగర్భమునను శ్రీకృష్ణుఁ డనన్. ౧౩
కం.రోహిణిగర్భంబున శే,షాహియు జననంబు నొందె నట మున్న ధర
న్శ్రీహాలి బలభద్రుం డన, నాహరి కగ్రభవుఁ డగుచు నరు లదరంగన్. ౧౪
కం.కంసుఁడు లో నగునట్టిన్రృ, శంసులఁ బీఁచం బడంచి సదయుత భూపో
త్తంసుఁ డగునుగ్రసేనుదృ, ఘాంసముల ధరాభరంబు హరి నిలిపె వెసన్. ౧౫
కం.మథురను జనకామితకా,మథురను నవనవవిలాసమధురను సుశ్రీ
మధురాజితమధురాజిత,మధురోష్ఠవతీసుమధుర మధుహరి యుండెన్. ౧౬
కం.అల్లునిఁ జంపినపగఁ దన,యుల్లంబున సందడింప నుగ్రుం డగుచుం
జెల్లగుసేనానికరము, వెల్లివిరియ మాగధుండు విడిసెం బురిపై. ౧౭
కం.అరులు భయంకరు లై తన,పురిపై నొక్కటను గలిసి పురజనములఁ నొం
దరపెట్ట విశ్వకర్మను, బురనిర్మాణంబుకొఱకుఁ బుచ్చె జలధికిన్. ౧౮
కం.నిరతము వనవాసంబునఁ, బరఁగెడినా కేల యిపుడు పట్టన మనియో
హరి మథుర వీడి జలనిధి,పరివృత యగుద్వారవతికిఁ బయనించె వెసన్. ౧౯
కం.ద్వారక హాటకభాస్వ,ద్ద్వారక సద్వారకప్రవరరత్నలస
ద్ద్వారకవాటక చంచ, ద్వారకళావతి జగజిగి వారక చెలఁగెన్. ౨౦
కం.నిరుపమతరవారిలస,త్పరిఘాప్తి నసాధ్యఁ డైనభటుపోలికఁ దా
నిరుపమతరవారిలస,త్పరిఘాప్తి నసాధ్య మగుచు ద్వారక యొప్పెన్. ౨౧
కం.మునిఁగి యుదయమున జలములఁ, బెనుమడుఁగుల మీఱి తరణి వెలయఁగ నడుమ
న్ఘనపదవిని బ్రాకారము, ఘనవిప్రాకారమునను గనుఁగొనఁ జెలఁగెన్. ౨౨
ఉ. నీతిఁ దొలంగ రెన్నఁడును నిశ్చలతం జనలోకపూజ్యు లై
ఖ్యాతిఁ దలంచి సత్యము నొకానొకపట్టున నేని వీడరు౯

మాతల నెక్కువాఁ డనుచు మాటికజుం బగఁ జూచి నిత్యస
త్యాతతసత్త్వపూజ్యు లయి యాపురి విప్రులు వొల్తు రెంతయున్. ౨౩

చం. కనియు మహాపదావళులఁ గాఱియుఁ బొందనిరాజహంస లా
య్యన రిపు లున్న మున్ను వెనుకంజను బెట్టనిసద్ధనంజయు
ల్మను ప్రతిపంథికేతుఁ గని మోమునఁ గాంతులు వోని రాజులుం
బొనరక తోడు భూభరముఁ బూనినవారలు సార్వభౌములున్. ౨౪

కం. అమితధనంబుల గృహముల, నిమిడింపఁగఁ దలము గామి నిల మణులను ము
త్యము లబ్ధి దాఁప వైశ్యులు, క్రమమున నేఁటికిని జనులు గైకొం డ్రుకదా. ౨౫

ఉ. పంటవలంతి తల్లి తన భ్రాతవు నీవును బంటకాపు నేఁ
బంటవలంతి నయ్యు నను బాధల నేఁచుచు మాపు రేపు దాఁ
బంటలకాపుగాక యిదె పంటల మేపెడిదంచుఁ బంపి బ
ల్కంటునఁ దుంటవిల్తుఁ డనుఁ గాఁపు నెలంతుక మంచెఁ జంద్రుతోన్. ౨౬

కం. చెలు వగునాపురమందుం, గలభంబులు పూర్ణచంద్రుఁ గనుఁగొని మదిలో
వెలగఫలం బనుచుం గొని, చలితాఁకున విడుచుఁ జూవె జాలిం గొనుచున్. ౨౭

ఉ. గాలికిఁ బోపు తేరు చనఁగా మఱి మోసెడివారు కొందఱు
న్జాలిపడంగ నీ కొకఁడుసామును మానిసి దాన దూరమో
బాలకపీంద్రునంజ తలఁప న్రవి పూన్చిన యేడుగుఱ్ఱము
ల్నాలుగుజాము లీడ్చు నని నవ్వ గుఱా లలపట్టనంబునన్. ౨౮

చం. చటులభయాట్టహాసముఖసాహసికోద్భటసద్భటావళు
ల్పటుతర మాకటారులను బట్టినయంతఁ బటీల్ పటీల్ పటీల్
పటిలను వైరిపున్కలు దినంబున స్త్రీలు విటుల్ విటుల్ విటుల్
విటు లని పాఱి లేమి యొదవింతురు కల్పలతాంత పాళికిన్. ౨౯

కం. నిగమబలభద్రబలములు, నగు నగగాణ్ణిలయవాహనంబును భద్రం
బుగనుండియుఁ బతిఁ బశుపతి, వగచెడి బిచ్చంబు లెత్తఁ బంచె నటంచున్. ౩౦

కం. కాలజ్ఞాని యయి యుషగి, కాలజ్ఞానంబు లేక కాలమునందుం
జాలఁగఁ గూసె నిసీ యని, కాలజ్ఞానులు సురేంద్రుఁ గైకొన వెపుడున్. ౩౧

కం. వెలయుం ద్వారవతీపూ, ర్లలనా గోపురకుచాగ్రరాజితశోభా
విలసత్సార్థకనామక, కలన న్నక్షత్రమాల కనుపండువుగన్. ౩౨

ఉ. ఆపురిసౌధసీమల విహారము సల్పునొయారియింతులం
దాపున దాపునం దిరిగి తత్పరులై కనుఁగొంచు నుండ్రుగా

రేపును మాపు నెంత గనఁ దృప్తి వహింపని చూపులం బతే
యేపును రూపు చూపు లవి యెంతయు వింతలుగొల్పు వేల్పులన్. ౩౩

శా. రంభాద్యంగన లండ నుండఁగను స్వైరస్ఫారు లై దేవతా
జంభారంభులు కుంభు లప్పురి లసత్సౌధాగ్రభాగంబుల
న్రంభోరుస్థలులం గనంగఁ బోడము న్రాగంబు యోషాళికి
న్స్తంభాంగోద్ఘకపోలకంపమును బూజ్యక్రోధము న్మానమున్. ౩౪

చం. మనవిని జిత్తగింపు నతిమాత్పురగోపురసౌధవీథులం
దినదిన మొక్కయేఁడుగను ద్రిస్సురు టయ్యె సతీకృతవ్యథం
దినమణి నోంప రాసతులు తీక్ష్ణకరుం డని చెప్పఁ బెక్కుయో
జనములమీఁద నిల్పె విధి సత్వగుఁ డై హరికన్నఁ జందురున్. ౩౫

సీ. మంజీరవిధమున రంజిల్లు నొకవేళ నొకవేళఁ గర్ణికయొఅపుఁ జూపుఁ
గర్ణవేష్టన మనఁ గన్పట్టు నొకతఱి నొకతఱిఁ బారితథ్యాసమఁ గనుఁ
బత్రపాశ్యముగతిఁ జిత్రి మా నొకపరి స్తనకుంభచంద్రలేపనముగాఁగ
రాణించు నొకమాటు రమణఁ బతకముగా లంబనహారకదంబమునను
బాటి మీఱినగోపురకూటవాటి, సాటి దాఁటినయావిటిసౌధవీథి
హాళిని విరాళి విహరించు బాలికలకు, సరసపూర్ణకళాసీమ చందమామ. ౩౬

మ. వనజాతాయతనేత్రలు స్మగలు భాస్వత్పుష్పబాణాహవో
న్మను లై క్రీడల నుండ నాపలుకు లానవ్వు ల్విలాసంబు లా
చనవు ల్లీలలు దారు గాంచుచు బళీ సంసారమే మే లటం
చును మింటం జరియించు చుందురు మునీశు ల్హీనవేగంబునన్. ౩౭

మ. నవు రొప్పంగఁ బురీలసత్స్థనమణీసౌధాగ్రవీథీ స్మరా
హవకేళీరతలోలలోలనయనాహారావళీభ్రష్టర
త్నపితానంబులు శంభళీజనము పెంటల్ ద్రోయఁ గుహ్యంబుల
న్భవి రత్నాకరనామ మొప్పెను జగత్పూజ్యంబుగా నబ్ధికిన్. ౩౮

చం. దినఘనమానహీనకృతితీవ్రకరస్థయవారణంబుల
న్దనరఁగ జవ్వనుల్ హిమదినంబుల నైణమదాదిలిప్తను
స్తనపరిరంభలాలసనిజప్రియవల్లభసవ్రణోష్ఠము
ల్గని తమచేష్టలో హిమవికారములో యనుకొందు రాత్మలన్. ౩౯

కం. నాళీకకృతాంతం బై, పోలినయాశిశిరకాలమున నాపురిలో
మే లగునెంచల జనములు, కాలము గడపుదురు భోగకాముకు లగుచున్. ౪౦

ఉ. అంతట విలాసిపాంథజనతాంతకకాంతవకాంతకుంతశు
ద్ధాంతలతాళికాంతుల నితాంతము లైనవనాంతరంబులన్
గాంతులు నిద్రపొత్తులను గాంతలఁ గూడుచు వింతవింతగా
సంతతము న్వసింతురు వసంతములం గడుసంతసంబునన్. ౪౧

చం. దివసవయోవిశేష కరదీధితు లొప్ప నిదాఘభానురు
జ్జ్వవహాసుతప్తవేదన జనింపఁ బ్రణాళుల నొప్పు సల్లతా
భవనముల న్సుభవ్యజనవాయువుల న్సుఖవృత్తి నుండు రా
భువనవిహారలీలలను బూరుషులు న్నవబాలికారతిన్. ౪౨

చం. ఘనపథ మంటుపుత్తడినిగారపుమేడల మిన్నువాఁకనీ
టను గడుఁ బ్రోదిఁ జెంది జగడంబున నిం పగుపుష్పవృక్షము
ల్మొనసెడిమూలరాజగతి ముత్తెపుఁగోళ్లను చందువా తెర
ల్గొన బగుమంచమందు రతిఁ గూడుదు రాపురి వానరేలలోన్. ౪౩

చం. అరయఁగ లోకనాయకముదావహభావ మెలర్పఁ బాండరాం
బరపరిశోభితాంగియును వత్సపరిస్ఫురితర్క్షమాలయుం
బరిధుతపంకసంకలిత భావితచంద్రకలాప యై ధర
స్సరసత మీఱె మోహనవిశారద శారద శారదాకృతిన్. ౪౪

కం. శరధిని గోలకుఁ దెచ్చిన, ధరణీవరు నతకరించుతలఁపు జనింప
స్సరసఘనీభవు వైశ్వా,నరుఁ గోలకుఁ దెచ్చినారు నరు లాపురిలోన్. ౪౫

శా. అన్యోన్యాతిశయాశయోద్భవదసూయావారణార్థంబు దా
రన్యోన్యంబును బందెము ల్సలిపి రంభాదు ల్పురిం జేరి సా
మాన్య ల్మాన్య లటంచు వచ్చి యచట న్స్నానోత్సుకమై నుండు రా
కన్య ల్గన్యల నాట నేర్పెడిహాయ ల్గాంక్షించి వీక్షించుచున్. ౪౬

ఉ. అందముపొందు మే లభినయంబున డంబున నాటపాటలం
గందువ లావధూటులు నిగన్నిగలున్ ధళధాళధళ్యము
ల్పొందఁగ సంజ మేడలను జేర జనావళి చూచు మబ్బుల
న్జెందక మించె మించులవె సిల్కడ నంచు మదిం దలంచుచున్. ౪౭

సీ. తరుణి దో చెప్పు మీ దండ కే మడిగెదు వృత్తగుచ్ఛము గొన్నఁ బేరు గలుగు
వలపులు వెలి గ్రమ్మ వలువమాటున నున్నఁ గొనఁగ నెట్లగు వస్త్రమును దొలంచు
వలువఁ దొలంగింప వల తేనిఁ జేకొన నీవి కే మిచ్చెదో కీవితోడ
నే మియ్య వలయునో యెఱిఁగింపుమా యన నీవికిఁ బరిమితి నే నెఱుంగ

భావభవభవనం బేదో పల్కు మన్న, భావ మెఱుఁగనివాఁ డిదే పశుఁతులార
కనుఁ డనుచు నర్మపరిహాసకలితలలిత,లపితముల విల్తు రటఁ బుష్పలావిక లోగి.

సీ. ఎవ్వరికోఱకుఁగా నే తెంచి యున్నాఁడ వేమి కావలె నన్న నిత్తు నడుగు
పిల్లల కాయెనా ప్రియ మివి మంచివి మచ్చిక మరపును మంకు మాన్పి
కోమలంబులు వీనిఁ గోరంట నంటిన నలఁగినఁ బరుల కింపులుగ నున్నె
యీవికై ప్రాల్మాలి యివి కార మనియెదు నీవికారమె నీకు నేస్తకాఁడ
యనుచు నచ్చికమచ్చిక లలర నిచ్చ, నిచ్చ లచ్చికబుచ్చిక నేర్పు లెచ్చ
నమ్ము చుందురు సుమధురాహారములను, బణ్యవీథులయందు లావణ్యవతులు. ౪౯

కం. ఆవనములు సుమనస్సం,భావనములు శీతవాతపావనములు స్వాం
తావనములు దేవనపర,సేవనములు శుకపికాళిచిరజీవనముల్. ౫౦

వ. ఇట్టి ద్వారకాపురంబున శ్రీకృష్ణుండు ధరణీభరంబు భరింపకయు భరించుచుండె
నంత. ౫౧

కం. కుండినపురపతి సుశ్లో,కుం డినతేజుండు భీష్మకుం డినవరశ
త్రుం డనవరతోత్సర్జన,కుం డనఁ బ్రత్యర్థిభీష్మ కుం డన నొప్పెన్. ౫౨

వ. అతనికి రుక్మిరుక్మరథరుక్మబాహురుక్మకేశరుక్మనేత్రు లనుసుతపంచకంబు జన్మించె
నావల. ౫౩

కం. ఆఱవచూలున నెలపది,యాఱవకళ యనఁగఁ గంతునాఱవశర మై
మీఱె నన లక్ష్మి నిగ్గు, ల్దేఱఁ బోడమె రుక్మిణి యన లీలార్థం బై. ౫౪

కం. కనుటను దమయుదరంబును, గనుటను లోచనయుగంబుఁ గడుఁ జల్లనగా
జననీజనకుల కందఱ,కును రుక్మిణి యొప్పె సొగసుకు పైపై మెప్పై. ౫౫

కం. సితసితకర లేఖాభా,సితపశ్చిమదిశ యనంగఁ జెలఁగె న్గృహమా
సితకరసహజాతన్వ,ద్భుతప్రాదుర్భావశోభ తోరం బగుడున్. ౫౬

కం. అన్నలు ముగురిపువురుఁ ద, న్నన్నలను ముద్దు లాడ మహితనిరతి మై
నన్నులమిన్న యనంగను, గన్నియ రుక్మిణి చెలంగెఁ గనుపండువుగన్. ౫౭

వ. ఇట్లు ప్రతిపచ్చంద్రలేఖయుంబోలె దినదిన ప్రవర్ధమాన యై శిశుపౌగండక
న్యారోహిణీగౌరీవయోవిశేషంబులఁ గడచి చెలంగు చుండె నంత. ౫౮

సీ. తరళ మౌతళతళల్ దలచూపెఁ గన్నుల మోవిఁ గావిబెడంగు మొలక లెత్తె
దోబూచులాడెను దొలిమోసచన్నులు లావణ్యసౌందర్యలాభ మెసఁగె
వికసనంబు వహించె వెలయు ముఖాబ్జంబు మందత నడకల నందగించె
స్మితసముల్లాసంబు చెలఁగెఁ గేకరముల భావసౌరభ మింత బయలువడియె.

వలపు లొప్పినజాళువాప్రతిమ యనఁగ, రత్నసంగతి గలయపరంజి యనఁగ
లలితసుకుమారరూపసంకలిత యగుచు, రుక్మిణీదేవి యౌవనారూఢ యయ్యె. ౫౯
తే. యౌవనారంభసంరంభ యయినకోలె, రాచకొమరులపై వలరాజు దాడి
వెడల ధర్మగుణంబు వీడ్వడక మొఱసె, రేపుమాపును గడుఁ జెలరేఁగి జగతి. ౬౦
కం. దర్పకదర్పాహతనిజ,దర్పక నిఖిలమనుజేంద్రతనయులయిండ్లం
దర్పణఫలకాంశరసము,దర్పితవైదర్భిప్రతిను లలరె నృతమున్. ౬౧
సీ. నిజచిత్రములపజ్జ నిగతంబు నుంతు రేకాంతాన రుక్మిణీకాంతపటము
నుంచి హస్తములఁ గీలించి వీక్షింతు రానందానఁ బులకలు గ్రందుకొనఁగఁ
బరికించుచు ముఖవివర్ణత్వ మొప్పంగఁ గృశు లయి తల వంత్రు క్లేశ మంది
యొప్పుతోఁ జూడ నిట్టూర్పులగాలిచేఁ జేచిత్రపట మార్ద్రితముగను
గాంతకాంతవబాణదుర్దాంతఘాత, వేదనాదూయమానహృద్వీథు లగుచుఁ
గుందు చుందురు రాట్సుతులెందు భువన, మోహనుం డగుశ్రీకృష్ణమూర్తిదక్క.
చం. జనకసభాంతరంబునను జారువిలోచన గొల్చి యున్న నా
యనను ధరాతలాధిపచయంబు నయంబునఁ బారకావళు
ల్వినుతి యొనర్చు వేళల నవీనసుధారసధార లొల్కఁగా
ననజదళాక్షుఁ బాడఁగ నవారణమై చెమరించు బాలకున్. ౬౩
వ. ఇట్లు వినుకలికలిమిఁ గలిమిచెలి హరిపై హరి పైదలిపై మనంబు నిలిపి రంత.
తే. నవవయస్స్ఫురణమున వనరమ దగ వ, సంతుఁ బెండ్లాడుచోఁ దాను సంతసంబు
దనరఁ బ్రాఁజీరఁ బాపినూతనవసనముఁ,దాల్చె నొక్కొ యనం గ్రొత్తపళములమరె
కం. కాంతవసంతునకు వనీ,కాంతకు నుద్వాహవేళఁ గలయ వసంతం
బెంతయు నాడం జల్లువ,సంతముక్రియఁ గింశుకములు చాలఁగ ననిచెన్. ౬౬
సీ. మరునిమావులు బల్మి మదుఁగ కుండఁగ నిడుసమయాశ్వకధృతౌషధమొ యనఁగ
విటపి పలాశి నా వెలయుట గృహసీమ నమరినపలలఖండము లనంగ
దండిగాఁ బండుగుల్ దండలుగాఁ గొమ్మ లొడలఁ దాల్చినగెంపులో యనంగఁ
పైకముల్ మితి మీఱఁ బస ద్విజావళి కిడునసుమోపుజప్రవాళము లనంగ
నవనవోల్లాసకలితపల్లవవిలాస,వతులు తముఁ గోరి శుకపిప్రతతులు రాఁగ
హాళి మీఱెను గొమ్మలు బాళి మీఱ, భాసురము లైనమధుమాసవాసరములు.
కం. ఖరకరఖరతరకరభీ,కరకరపాలములనిహతి గాసిని దిమిరం
బురవడిఁ జని మనియె మహా,త్తరులను దా మాశ్రయించి తచ్ఛాయలనన్. ౬౮
సీ. కలహంసయానసంగతి మీఱె సరసులఁ గలహంసయానసంగతులు మీఱెఁ
గమలాకరము లయ్యెఁ గమలాకరంబులు కమలాకరము లయ్యెఁ గమలతతులు

విస్తరిల్లెం జాల విటపవికాసము ల్విటపవికాసము ల్వి స్తరిల్లె
మంజులతాగ్రాప్తి మహిళాతతు ల్మీఱె మహిళాతతు ల్మీఱె మంజులతల
హంసతాపపరీతు లై రఖిలజనులు, హంసతాపపరీతు లై రఖిలజనులు
మాధవీమల్లికాలతామహితకుసుమ,వాసితము లైనవాసంతవాసరముల. ౬౯

సీ. పుష్కరజాతప్రభూత్యనవద్య మై తతభూతహృద్యతఁ దనరె జగము
పుష్కరజాతప్రభూత్యనవద్య మై తతభూతహృద్యతఁ దనరె జగము
పుష్కరజాతప్రభూత్యనవద్య మై తతభూతహృద్యతఁ దనరె జగము
పుష్కరజాతప్రభూత్యనవద్య మై తతభూతహృద్యతఁ దనరె జగము
సారసోదారసురభివిస్తార మలరె, సారసోదారసురభివిస్తార మలరె
భూతజాతమనోజాతయాతనాసు,మాసరము లైనమధుమాసవాసరముల. ౭౦

వ. ఇట్లు నితాంతకాంతం బైనవసంతంబున నొక్కనాఁడు భీష్మకుం డిష్టజనపరివృ
తుం డై సకలబంధువర్గంబులం గూడి రుక్మిణీదేవి పార్శ్వంబు నలంకరింపఁ గొలు
వుండి తనయాపరిణయసముచితసల్లాపంబుల వర్తించు చున్నసమయంబున. ౭౧

కం. ఆయెకిమీఁడు సభాస్థలి, నాయతమతి నున్నయట్టియవసరమునఁ దా
నాయెడ కరుదెంచెను విధి,దాయాదుఁడు నారదుండు తద్దయుఁ బ్రేమన్. ౭౨

కం. వచ్చినవిధిసుతుఁ గని కర, మచ్చపుమతిఁ బూజ లిచ్చి యనఘాత్మక నీ
విచ్చేయుటకతనను మా,కచ్చులు ఫలియించె బాము కడు శుచి యయ్యెన్. ౭౩

వ. అని యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యర్హాసనాసీనుం గావించి. ౭౪

కం. ఈలోకములోపల నీ,కోలిం దెలియంగ రాని దొకటియుఁ గలదా
మే లొదవఁగఁ దెల్పవె మా,బాలామణి కేడఁ దగినవల్లభుఁ డబ్బున్. ౭౫

వ. అని ప్రశ్నంబు గావించిన నారదుం డి ట్లనియె. ౭౬

సీ. అంచబాబాలపై మించుచౌవావేల్పు ప్రోచు చుండెడిభూమి చూచినాఁడఁ
గవ్వంపుమలమొలకడిఁది త్రా డేలెడుపుట్టపట్టులభూమి మెట్టినాఁడ
నెక్కుడుమబ్బులయెకిమీఁడ రవణించుతోలుగట్టుదెసలందు మెలఁగినాఁడ
జంటారుమేనులదంట దాఁ గడసంజఁ ద్రొక్కుగ్రుంకుడుమెట్టు నెక్కినాఁడఁ
జుట్టుగట్టుదాఁకఁ జూచితి మామకు, మామ యైనసామిమాద్రివాని
గానఁగాన శౌరియాన నీచానను, జక్రధరున కిమ్ము సమ్మదమున. ౭౭

సీ. మండలిమండలమండలిమండను మండలిమండలిమహితతల్పు
మండలిలోచను మండలిమండలికుండలనుతు హతకుండలీంద్రుఁ
గర్బురాంచితవాసుఁ గర్బురోత్కరనాశుఁ గర్బురగృహు హతకర్బురేశు
వరమహావీరారిధరమహావీరు మహావీరగిలను మహాప్రభావు

మాధవీమానసారామమాధవునిని, బురుషరూపునిఁ గారణపురుషరూపు
నాకుమారునిఁ బోలంగ రాకుమారు, లేరు లేరయ్య యీధర ధారిణీశ. ౭౮

సీ. కలరవంబులవాఁడు కపిరాజకపిరాజరక్షణేక్షణుఁ డహిశిక్షకుండు
ఎలజవ్వనమువాఁడు వృత్రారివృత్రారినంశజావరజుఁడు నంశధరుఁడు
పరమరూపమువాఁడు భార్గవీభార్గవీవల్లభసహజవినల్లభుండు
సొబగుఁజూపులవాఁడు సుకలాపసుకలాపసకలకలాఢ్యుండు సుకలవరుఁడు
పచ్చడాలు డీలుపడఁ జాలుమెయిడాలు, పచ్చడాలు కాల నెచ్చువాఁడు
పచ్చడంబు మీఱుపచ్చడంబు గలాఁడు, లేఁడు ధారణీశ యేఁడు నీడు. ౭౯

కం. ధారాధరవర్ణుం డఘ,ధారాధరకల్పమారుతప్రతిముఁడు స
ద్ధారాధరధారాసం,దారితశాత్రవశిరోవితానుండు నృపా. ౮౦

సీ. శరజాతజితమహాశరజాతశరజాతశరజాతవిక్రమపరుఁడు పరుఁడు
శరజాతయుతకరశరజాతశరజాతశరజాతతాసైన్యకసత్ప్రభుండు
శరజాతనాథుండు శరజాతకంతుండు శరజాతనిలయుండు శర్మదుండు
శరజాతపాదుండు శరజాతనయనుండు శరజాతధారుండు ధరధరుండు
త్మాపమాత్రుండె వనవనజాతశాత,శిఖిశిఖాజాతగిలనారి జేత వరుఁడు
ద్వారకాపురవాసుండు తావకీన,సుతకు ననుగుణుఁ డైనట్టిపతి నృపాల. ౮౧

ఉ. కావున నీకుమారితను గా దన కాయన కిచ్చి నీవు సం
భావనఁ జేయు మన్యగతి భావనసేయకు భావమందు స
ద్భావనతేజ శౌరికిని దద్దయు నీసుతఁ గూర్చితేని యా
హా వశమా నుతింప వసుధాధిప నీఘనపూర్వపుణ్యముల్. ౮౨

కం. అన విని ముద మెదఁ బొదలఁగ, ననఘాత్మక యట్లొనర్తు ననియెం బిదపం
జనియెను సుర వాచంయమి, ఘనవీథిని గృష్ణగీతికాగాయకుఁడై. ౮౩

వ. అంత నిజజనకునభిప్రాయం బెఱింగి. ౮౪

చం. మనమున రోస మొప్ప గతమార్దవభాషలఁ బల్కె రుక్మి యా
మనువుఁ గుదుర్పఁ గూఁతునకు మానవనాథున కెంతమిత్రుఁ డై
ఘనుఁ డగుబోడి యబ్బె నగుఁ గా కిఁక బంధులతోడ నేమి యాఁ
జనియెదఁ గాక నావలచుచాయకు నాహితభృత్యకోటితోన్. ౮౫

ఆ. అనుఁగుఁగూతుఁ బ్రీతి నాగొల్లవానికి, మనసు దీఱ నిచ్చి మనెడిఁ గాక
శూరవరులు సుమతిసూరులు నారులు, పక్కు మనుచు నవ్వ బంధుజనులు. ౮౬

వ. అని తండ్రిచాయఁ జూచి యిట్లనియె. ౮౭

మ. పసిఁడిం జేసితనూప్రభ ల్గలుగునీబాలామణి న్రుక్మిణిం
బొసఁగ న్బెండిలిసేయ విష్టపమున న్భూపాత్మజు ల్లేరొకో
యసమానప్రథ మాననీయచరితు ల్హా చిత్ర మూహింపఁగాఁ
బసులం గాచెడివెఱ్ఱిగొల్లనిపయి న్భావంబు నీనిల్పుటల్. ౮౮

ఉ. వావి యెఱుంగఁ డన్యగృహవర్తనలం గడుమేటి నూన వ
న్భావము లేదు నిల్వఁగ నభావము లెంకి సమానసద్గసం
భావన సున్న జాతి నహీ భవ్యమె యాకటిమేని వానికిం
దావకకన్య గూర్చిన విధాత్రుని వెంగలి యంచుఁ బల్కరే. ౮౯

ఉ. మామ యటంచు నిన్నతఁడు మానుగఁ బల్కఁగఁ గల్గనే నినీ
నా మన మాజ్యధార దహనంబునఁ బోసినరీతి మండదే
యే మన నన్ను బావ యని యేర్పడఁ బల్కిన నెట్టు లుండునో
యేమిటి కంత పొ మ్మనిన నేగెద నే నిపుడే ధరాధిపా ౯౦

తే. పసిఁడిబొమ్మ కరోయనుయ ప్రతిమసరియె, పొసఁగునేమణిబొగ్గులఁబొదిఁగియుంచఁ
గృష్ణుఁ జేయూరు కోమలోత్కృష్టహావ, భూరివైభవ భైష్మి యేయూరు చెపుమ.

తే. అరయ విధవాధిహాధ లోకాధికారి, పుణ్యజనదారి రాజన్యపుణ్యహారి
ద్వారకాపురసంచారి తావకీన, సుతకు ననుగుణుఁ డైనట్టిపతియె తండ్రి.

కం. చెల్లదు రుక్మిణిఁ గృష్ణుని, వల్లభ నొనరింపఁగ శిశుపాలున కీ నై
యుల్లమునఁ దలఁచినాఁడను, జెల్లెలిఁ బ్రతిభాష లేను జెవినిడ నోపన్. ౯౨

కం. అనువుగ శుభస్యశీఘ్రం, మనువాక్యముకతన వేగ నగుఁ బెండిలి సే
య నటంచును దైవజ్ఞుల, కనియె న్సుముహూర్తనిశ్చయం బొనరింపన్. ౯౩

కం. అంతట రుక్మిణి చింతా,క్రాంత యగుచు మనములోనఁ గలగుందువడం
జెంతల సకియలు గొల్వఁగ, నంతఃపురసీమ కేగె నలసగమన యై. ౯౪

వ. ఇట్లంతఃపురంబునకుం జని యేకాంతంబున నంతరంగంబున దురంత చింతా
క్రాంత యై యిట్లని వితర్కించె.

ఉ. చిక్కని వైరభారమున శ్రీహరి కిచ్చిన నోర్వ నంచుఁ గెం
పెక్కఁగఁ గంట పల్కెనను నిచ్చెద నాశిశుపాలదండి కం
చెక్కడితోడఁబుట్టు నితఁ డేటికిఁ జేసెడి నిట్టు లక్కటా
మక్కువఁ బాసి యీసునను మామకపూర్వకృతంబొ దైవమా. ౯౬

తే. వసుధపైఁ గృష్ణసంగతి పొసఁగ దేని, వసుధపైఁ గృష్ణసంగతి పొసఁగు టరుదె
యావివాహుండురమణుఁడై యమరెనేని, యావివాహంబురమణతయమరనుతము. ౯౭

తే. కపిలగోసుత మాపాలు గాదటంచుఁ, గోరి ఖరశిశుపాలుఁ గైకొంటి నేని
కపిలగోసుత మాపాలు గావటంచుఁ, గోరి ఖరశిశుపాలు గైకొంట గాదె. ౯౯
వ. అని తనకు నత్యంతాప్తుం డగుపురోహితుం బిలిపించి వినయవినమితగాత్రయై
యుదంతంబు సాంతంబుగ వినిపించి యి ట్లనియె. ౧౦౦
ఉ. భాసుర తేజ నీ విపుడ ద్వారక కేగి తదీయవాసు శ్రీ
వాసుని శంఖచక్రధరు వాసవవందితు భక్తనందితు
న్వాసిగఁ గాంచి నాపలుకు వాక్యముల న్వినిపించి వేగమే
భూసురవర్య తెచ్చి ఘనపుణ్యమునం జననయ్య మ్రొక్కెదన్. ౧౦౧
సీ. ధరణీసురేశ్వర ద్వారకాపురి కేగి కమలాక్షు శ్రీకృష్ణుఁ గరుణఁ గాంచి
నేను బంపిన యట్టిమానిసిఁగాఁ బల్కి మ్రొక్కితి నని పూని ముట్టఁ దెల్పి
నాపరితాపంబు నయముతో వినిపించి రుక్మిదుశ్చింతను రూఢిఁ జెప్పి
యేజాడ నైనఁ దా నియ్యెడ కేతెంచి పరసమూహము నెల్లఁ బాఱఁ దోలి
మన్ననతోడఁ జేకొని నన్నుఁ బ్రోవు, లీల బోధింపు శంక చాలింప వయ్య
వేగఁ జననయ్య నాపల్కు వినఁగదయ్య, పుణ్యమునఁ బోవఁగదవయ్య భూసురేంద్ర.
వ. అని శ్రీహరితోడ నాపల్కినపల్కులుగా వచింపు మని మఱియు ని ట్లనియె. ౧౦౩
కం. అనుమానము మానుమయను, నను మానఁగ వలవ దనుము ననుఁ గొనుమనుమా
తన కే దక్కితి ననుమా, నను మానినిఁ బ్రోవు మనుము నమ్మితి ననుమా. ౧౦౪
కం. నిను భక్తినమ్మి యుండియు, ననఘా దుఃఖములఁ బొంది యాలమట వడఁగాఁ
జనునే తూష్ణీంభావము, ఘనకరుణాలోకనములఁ గనుఁగొను కృష్ణా. ౧౦౫
ఉ. బాళిని దావకీనపదపావన సేవనభావనావనా
లోలతఁ గ్రాలునాహృదయలుబ్ధతఁ గాంచి కరాబ్జయుగ్మమే
వేళ భవత్పదాశ్రయము వీడ్వడ కుండఁగఁ గోరుచుండు గో
పాల దయావిశాల ననుఁ బాలన సేయు రమామనోహరా. ౧౦౬
కం. సింగముపాలు సృగాల మ, భంగతఁ గైకొనఁగఁ గోరుభంగిని భవదా
లింగనముఁ గోరు నన్నుం, బొంగునఁ జైద్యుండు వొంద బుద్ధి యిడెహరీ. ౧౦౭
తే. కాకసంరక్షణా యతిలోకశీల, శ్రీకరాకార నరకాలభీకరాజి
లయకటూరుచతుర్భుజలవనకక్ష, సరవి నీకాలు పాలుగాఁ దరము తెలియు. ౧౦౮
కం. ఆయధమాధమునకు నే, జాయను గా నొల్ల నీకు సరసత దాస్యం
బాయతమతిఁ జేసెద నో, శ్రీయుతకరుణా కటాక్ష చిత్తజజనకా. ౧౦౯
చం. కరమువినీతి రుక్మి పరుఁగాఁ బరుగాఁ బరుఁగా దలంచె లో
కరమణు నిన్ను ధర్మపరుఁగాఁ బరుఁగాఁ బరుఁగాఁ దలంతు శ్రీ

కర పరమేశ నాకు వరుఁగా వరుఁగా వరుఁగా మదంబకు
న్నరగఁ దలంపుమా యదితినందననందననందనందనా. ౧౧౦

కం. ఆయోధనరంగమునం, దాయోధుల నెల్ల గెల్చి యతులబలుమునై
నోయదుకులరత్నమ కొం,పోయిన నే వత్తుఁ గరుణఁ బొడగను దేవా. ౧౧౧

కం. ద్వారికులను బంధులఁ, జావఁగఁ గనవలెనొ యనెడిసందియ మేలా
సేవించి గౌరి ముందఱ,నే వచ్చెడివేళ యదియ నీ కదను హరీ. ౧౧౨

వ. అని నా పల్కులుగా నచించి పోయి ర మ్మని శిరంబునఁ గరంబులుచేర్చి నమస్క
రించుటయు నతండు వల్లే యని కతిపయదివసప్రయాణంబుల ద్వారకాపురిఁ జేరి
హరికిఁ దనరాక నెఱింగించి యతనిసాన్నిధ్యంబు వడసి స్వాగతంబును సందే
శంబును దెలియఁ జెప్పి రుక్మిణీదేవియాడిన పల్కుల నెఱింగించి వెండియు ని
ట్లనియె. ౧౧౩

కం. చిన్నప్పటినుండియు మా,చిన్నది నీరూపమహిమఁ జెవిపండువుగా
విన్నది మొదలుగ మది ని,న్నెన్నఁడు నెడఁబాసి యుంట నెఱుఁగదు కృష్ణా.

ఉ. భావనభావనంబుల నతంబు నురంబున వ్రేలి మేలునం
భావనఁ గాంచి యుందు ననపాయత ముద్దులు గుల్కు చుందు బ
ల్త్రావుల నొల్కు చుందుఁ బ్రమదంబున నాట్యము సల్పు చుందు హా
యావనమాల నైన సుఖ మందుదుఁగా యనుఁ గృష్ణ చింతచేన్. ౧౧౫

కం. హరిణీపట నీవినుతిని, హరిణీదృశ హరిణికరణి నతినిశ్చలతం
బరఁగ నచేతనశంకా,హరమై నునుఁబులకమొలక లలరు న్మేనన్. ౧౧౬

కం. శీతలభానుని సుమనో, జాతములఁ గుమారు మఱియు శ్వసనంబును సు
ఖ్యాతంబుల నొనరింపఁగఁ, జేతోగతిఁ దలఁపు మనుచుఁ జేసియ వేఁడెన్. ౧౧౭

ఆ. కాంతముఖము శిశిరకరమండలం బయ్యె, ఖరతరామృతభవకరము లగుచు
నేత్రపాళి యలరు నిచ్చలు నేలొకో, చిత్తగింపు కృష్ణ శీఘ్రముగను. ౧౧౮

చం. మనసిజుఁ బూజ సేయఁగను మానిను లందఱుఁ బుష్పబాణుసిం
బనువడి కంజపత్త్రమున వ్రాయుచుఁ జాప లతాంగి కంపము
న్గనియెఁ బ్రభంజనాహతి వణంకు విరాశ్రయమాలతీవిధం
బున సహకారవృత్తిఁ గను భూమివశంబుగఁ గాక ముందరన్. ౧౧౯

ఉ. శ్రీ తగుచిత్రమందలివిచిత్రమనోహరమూర్తి యూశచీ
సూతియొ కాఁడు పొల్తి సిరిసూనుఁడొ కాఁడు మ ఱెవ్వరే నకీ
ప్రీతి వచింపుమా ధవుని పే రన వీఁ డలమాధవుండు గా
యోతనుమధ్య య ట్లయిన నొప్పఁగ మాధవుఁడే గదా యనున్. ౧౨౦

మ. చెలియా మిత్త్రుఁడె యేఁడి యాతఁ డదె వచ్చెం దెచ్చె నే మేమొ శీ
తలవాతాళికి ఁగొమ్మకుంపటిని మాద్యద్గ్రాముఖశ్రీకి బూ
ది లతాంతాయుధుతుంటవింటికిని నెంతేఁ జక్కన ల్పొంథకాం
తలయత్రు ల్గడుగంగ హేమజలపాత్రం దెచ్చె నా మెచ్చెడిన్. ౧౨౧

వ. మఱియు నవ్విలాసవతీవిలాసవిశేషంబు వినుతు విను మని వివరింపఁ దొడంగె.

ఉ. క్రమ్మఁగఁ జిమ్మచీఁకటులు గ్రాలునమాసనిసి న్దగంగ న
భ్రమ్మునఁ బొల్చుతారకలభాతిని గొ ప్పగుకొప్పునందు సూ
నమ్ము లెసంగఁ దేనియఁ గొనంగఁ గుతూహలవృత్తి మత్తభృం
గమ్ములు వచ్చి యచ్చటను గ్రమ్ముచు జీరుకుబండ లాడెడిన్. ౧౨౩

సీ. శశిహాటకాహాటకికోడి శరణంచుఁ జీఁకట్లు విమలేందుముఖివెన్క వెలసె నేమొ
కర్కశత్వము మానఁ గడుఁ దపంబులు సల్పి నీలము ల్మృదువులై నెగడె నేమొ
తమలఘుత్వము రోసి తగ దని డిగి వచ్చి యసితాభ్రచయ మిట్లు లెసఁగె నేమొ
సంపెఁగవిరులతో సావాస మొనరింప నళు లపరభవంబు నందె నేమొ
వేఱువిధమైన నొకపాటివెంద్రుకలకు,నిరులు గురియింప నిగనిగ లెసక మెసఁగ
మెఱుపుటొఱుపుల నెఱపంగ మేలిమిసిమి,గొమరుమిగులంగ నెట్టులుగూడుఁ జెపుమ

చం. కువలయమిత్త్రుఁ డంచు ననుఁ గోటివిధాల జగాల నెంచఁ గం
బొవరున నన్నుఁ గన్నఁ దనమోము ముడుంచును బద్ధ మేలొకో
కవయక యెట్లు లుందు నని కామిని దృగ్జలజాతసంగతి
న్దవులఁగ నిల్చె మోమ మగుచు నా జవరాలికి నాస్య మొ ప్పగున్. ౧౨౫

ఉ. ఆనలినాక్షిరూపమహిమాతిశయంబు నుతింప నౌనె వా
గ్జానికి నైన సారసము సారసవైరి కరంబు రంభయు
న్హీనములు న్నిళిందములు మ్మే లగుశంఖము హృద్యనాదము
న్మానితవృత్తిచేత ననుమానము మాని భజించు నేకమై. ౧౨౬

ఉ. శంబరవైరి బాణము విషంబుల ముంచిన ముంచుఁగాక పై
కంబులఁ జేర్చుఁగాక పలుకచ్చెకు నాపయి నిక్క మెంచెద
న్నంబరజేతృణాశిశిరసద్దరహాసము ముద్దుపల్కు లా
శంబరజాలినాశము వచఃప్రతిబంధము పైకపాలికిన్. ౧౨౭

సీ. జగమెంచువగ మించుజిగిసంచు హసియించు నిలమించుతమి ముంచు నించుమించు
సుమచాపుకడతూపుగమియేపుసని ప్రాపుపసఁ బాపు సకిచూపు పగల మాపు
వల నొప్పుతమిఁ గప్పు బలుకప్పు గలకొప్పు కడుఁదెప్పునను ఁగొప్పుఁ గప్పునొప్పు
ధరఁ గంజరము గుంజసరి యన్జనము పంజ లనుకొంజునపరంజి నడుగుత్రోయుఁ

బడఁతిజిగిడాలు జగడాలు పచ్చడాలు, గేలికొనునాల్గుగు ద్దేటిచాలు నేలు
మేలి మీలీఁ గాంచియు మేలుకోలు, మేలుకో ల్వ్రాంద వత్తులలీలఁ గాంచి.

ఆ. లంబు భంబు జంబు బింబంబు జంభంబు,ఖంబు భంబుఁ గంబు నంబుదంబు
మోముఁ జూపుఁజనులు మోవియురదనము,ల్నడుము గోరుగళము జడయుఁబోలు.

మ. హరిపాదాబ్జముఁ గొల్చి నిల్చి యిటు శూన్యం బైన రా దాయె శ్రీ
హరికారుణ్య మి దేటికో ల్వని యుపేక్షావాప్తి నాకాశ మా
సిరిసేవం దగ మీఱి వెంటనె భళీ చెన్నారెఁ బో నీవిచే
సరసస్ఫూర్తిఁ దదీయమధ్య మయి భాస్వన్మేఖలాయుక్త మై. ౧౩౦

సీ. నవతుగాఁ బిఱుఁదుల నరిపోరఁగ ననంత నగమున కీడుగఁ జలత మానె
తనుమధ్యమధ్యంబు నెనయ ననంతనామ స్మృతి శూన్య మైమానె రూపు
జడతోడఁ దులఁదూఁగఁ గడఁగియనంతుండు వెల్లనై మను మోసెఁబృథివిక్రిందఁ
దవిలి యనంతావతారుఁ డై యచ్యుతుం డమరవతీజయుగ్మముగ నిలిచె
నవతి గావునవరపదస్థంబు కాన,తల్పమైక్రింద నుండుట తగునెసామ్య [మొందె.
మమరఁ జేయంగ ననియనో యతకరించి,హృదయమున నిన్నుఁ బూని యభ్యుదయ

చం. అవుర నుతింపఁగా గొనబుటూరు మిటారికొటారు నామనో
భవునికటారి మేల్వలపుపట్టు కొటారి కటీవినిర్జిత
చ్ఛవివికటారి నిస్తులకుచస్ఫురభాప్రకటారి కుంతలా
లవిరళనీలకాంతి వరటారి సుమీ శకటారి శ్రీహరీ. ౧౩౨

కం. కమలంబునఁ గమలం బొ,కమలంబునఁ గనులమందుఁ గనులం బొప్పం
గమలాక్షి చింతచే హృ,త్కమలంబున నిన్నె తలఁచుఁ గమలాక్షు హరీ. ౧౩౩

ఆ. కావిమోవిఠీవి కమ్మతేనియ క్రోవి,దేవి తావి నీవి తేజదీవి
మరులు దొరలు కురులు మరుఁ డొడ్డినయురులు,కాంతిబంతి కంతునింతిదంతి.

కం. వాలుంగనులయొయారము, మీలం దా మేలఁ గలవు మేలిమితోడం
గాలుం గేలుం జివురును,కాలం గేలం జమరు జగాకెంజిగులన్. ౧౩౫

కం. శ్రోతంబులు భువి శ్రుతివి, ఖ్యాతంబులు మో మటన్నఁ గంజాభిఖ్యా
ఖ్యాతంబులు కురు లళినీ, జాతంబులు కనులు నీరజాతము లవురా. ౧౩౬

కం. మోవి యనం బూఁదేనెల, దీవి సుమీ పొక్కిలి సుమదీప్తాస్త్రునకుం
బావి సుమీ కై తూండ్లకు,వావి సుమీ దానికీవిఁ బలుకం దరమే. ౧౩౭

కం. బంగారముఁ బొంగార్చెడి,రం గగుచనుబంతికాంతి రాణించినచో
బంగారు పూస లగుచుఁ జెలంగెను ముత్యాలసరులు లావణ్యమునన్. ౧౩౮

ఆ. కనకనలినజలజకాళికాకర్ణిక, ల్దలలు క్రిందు సేయఁ దలఁగ ననుచుఁ
గడఁగె దేహనయనకంధరాకాళికా, సక్థిసమము లనుచు జగడమునకు. ౧౩౯

సీ. ఖంజనం బజ్జాక్షికనులతో సరిరాఁగ గమకించి చరమభంగంబు నొందె
నంతటఁబోక యేకాగ్రత శూన్యమై వటియించి మధ్యమావస్థఁ జెందె
మఱియుఁ దా నన యయి మాఱురూపముఁ జెంది గంధవహాతిసంబంధ మందె
మధ్యస్థతను మాని మఱివిసన్నతఁ జెంది కామినీచరణనఖంబు లయ్యెఁ
బక్షిమాత్రంబు తా నెంతకక్షి గట్టఁ, బాటుమాత్రంబె కాక తా మేటి యగునె
యబ్బినం దల కా కున్న నం(ఘ్రు)లనెడి వచనయాథార్థ్యమును జూపె వాసుదేవ.

సీ. పొలఁతి వేనలితోడఁ బురుడింప గమకింపఁ బన్నగం బొప్పెఁ బక్షంగమునను
సార్థమై యూరుగా నని కలాపాంచితమణిలసద్ద్యుతిఁ గాంచి మహిమఁ దొఱఁగి
గురుభావము వహించి కొమ్మచన్గనసాటియై రాఁగ వజ్రప్రహారములకు
బెదరి యేకావ్యాయప్రీతిఁ బొక్కిలి గాఁగ నుడిలోన వివశత సొరిది నిల్వ
వశము గాకున్న నాపాఁపపాపకాన, సాత్త్వికప్రభవనగము సరసపూర్వ
రూపమున నపరార్థమై రూఢి మెఱయఁ, గరుణఁ జేపట్టి నిలిపె నాహరిణనయన.

సీ. పద్మాక్షికనులతోఁ బగ లొందఁ గువలయం బర్థహీనతచే లయంబు నొందె
ఘనజఘనముసాటిఁ గనఁ గువలయ మాట నయమున సేవించె నాతినడుముఁ
తామసంబున రాజతతమైత్రిఁ బ్రాపించి నానయై కుచములవాసిఁ గనఁగ
భిన్నార్థయుక్తిని జిన్నతనం బొంది గతమానమునను విక్రయము నడుట
సహజగతిఁ గుచ్చితము వాయ సరసగతిని, జెలియ చేపట్టె నేమన వలనుమీఱ
వేగఁ జేపట్టఁ గఁగదయ్య భోగితల్ప, శిల్పముగ భీష్మభూవరతనయ సనయ. ౧౪౨

కం. నరమే సరి కంఠము కుం, జరమే సరి నడల నాన సరి సంపెఁగ కం
జరమే సరి యొడిలికి నం, బరమే సరి నడుము సొగసు పలుకం దరమే. ౧౪౩

కం. గొ ప్పగు కొప్పున కైనం, గొ ప్పగు నాపొలఁతి వలుఁద గుబ్బలు మఱియుం
నొ ప్పగు పిఱుఁదులు వినఁగా, నొ ప్పగు గలరవము సొగసు లొప్పగుఁ జూడన్.

కం. నవులా పువు లాచెన్నుఁ పె, దవులా దవులాట కీడ్పఁ దర్దయుఁ గెంపు
న్నవలానవలావణ్యం, బవురా యవిరాలు ముద్దగాలికుచంబుల్. ౧౪౫

సీ. వాలుమీలబెడంగు పూలగుత్తులరంగు కనులు నై చనులు నై క్రాలుజాణ
భ్రమరకమ్ములనీటు రత్నజాలముదీటు కురులు నై నగలు నై కులుకుఁ బ్రోడ
యరఁటికంబముడాలు నరగఁ జీనులచాలు నూరు నై యారునై యొప్పుముగుద
శ్యామూహి పెనుసారు సైకతంబులతీరు వేణియై శ్రోణియై వెలయుచెలియ
శ్రీనివాసమహోజ్జ్వల శ్రీనివాస, శ్రీనివాసజితేక్షణ శ్రీనివాస
గాని మంజులమాధురీశ్రీనివాస, నన్యసతిగను దలఁపకు మాన్యచరిత. ౧౪౬

కం. తేనెల నొలుకుం బలుకులు, కానే కా దతివచనులు ఖంజనయుగళం
 బౌనే యా జడ సర్పము, గానఁగ లే దార నడుము కాంతామణికిన్. ౧౪౭

వ. అని పల్కుటయుఁ గృష్ణుండు మందస్మితసుందరవదనారవిందుం డై యాభూమి
 దేవునితో ని ట్లనియె. ౧౪౮

చం. తెలియనివాఁడఁ గాను జగతీసురసత్తమ బాల్య మాది యా
 చెలియమనంబు నాయెడను జేర్చుట నాకును భీష్మపట్టిపైఁ
 దలఁగనిమోహభారముకతంబున లే నిదు లే నెఱుంగ నా
 పలు వగురుక్మి యడ్డపడి భంగము సేతయు నే నెఱుంగుదున్. ౧౪౯

ఉ. పాణిపుటాంతరస్థ మగుపారదతుల్యము బాలికావళీ
 మానితచిత్త మమ్మగువ మాత కధీనయుఁ దల్లిదండ్రులు
 స్నానమతి స్వజాత్మజునియిచ్చకు వచ్చినయట్టు లుండువా
 రైనను దన్నియుక్తి నను నంగన గోరునె యంచు వేఁగుదున్. ౧౫౦

ఉ. సారెకు భామ లాడెదవు చారువిలోచన ముద్దుగుమ్మ బం
 గారపుబొమ్మ నాకొఱకుఁగాఁ బ్రమదావని స్రుక్కె నంచు నా
 నేరము లున్నె య ట్లయిన నిచ్చలు నానయనాధ్వసీమ సం
 చారము సేయురీతిఁ బటుశాంబరిఁ జూపఁగ నేల బాలకున్. ౧౫౧

తే. వాసరము లెల్ల శ్రీహరివాసరములు, రాత్రు లెయ్యెడ హా శివరాత్రు లయ్యెఁ
 గలిమిచెలిమీఁదిమోహంబు కలిమిబలిమి, భూసురేశ సతీరతభాసురాశ. ౧౫౨

తే. పరఁగఁ బ్రవిదారణంబున సరగ వీర, వైరిప్రవిదారణమున నవారితముగ
 బాలికామణిఁ దెత్తు గోపాలకాత్మ, భూసురేశులు వొగడంగ భూసురేశ. ౧౫౩

వ. అని మఱియు నబ్బాలికకు విస్రంభభాజనంబుగ నావచనంబుల ని ట్లనుము.

సీ. ముదిత నీసొగసు విన్నదిమొదల్ నీరూపు కన్నులఁ గట్టిన ట్లున్న దనుమ
 కూటంబు గానమిఁ గొమ్మరో తలమీఁద మిన్నులు వడ్డట్టు లున్న దనుమ
 విరహాగ్నిశిఖలచేఁ బరితాప మందుట లేలు నాపాలికి గాలు లనుమ
 యొంటిగా నను డించి కంటగించుటఁ జేసి చిత్తంబు పఱియ లై చీలె ననుమ
 తాళఁ జాల మదనతాపంబునను సంతతంబు గ్రాల సతి నిజంబుగాఁగఁ
 గడుపులోనఁ జేతఁ గలియఁ బెట్టినయట్టు, లున్న దనుమ యోర్పు సున్న యనుమ.

ఉ. సారసయుక్తి నేత్రములుఁ జారుమృణాళతతిం గరంబులుం
 దీరినమొగ్గల న్రదము దేనియ లొల్కఁగ ముద్దుఁబల్కు లొ
 య్యారపుఁదీఁగెలం దనువు లబ్జములం బదము ల్ఘటించి తా
 నేరమి ధాత తాత భవదిద్ధమనంబును జేసెఁ గోమలీ. ౧౫౬

కం. వినఁ గానమి నీపలుకులు, కనఁ గానమి హాసచంద్రికాజాలంబు
ల్విని చెవుదును గని గ్రుడ్డియు, వనితా ప్రాప్తించె నేమి నంచనయొ గదా. ౧౫౭

తే. పాపచానవు బల్మావవయసుకలిమిఁ, బాఁపచానవె ప్రాణము ల్మాపుకొఱకు
నీవియోగంబు నే నెట్లు నిలువనేర్తు, నీవియోగంబునన గాక నీలవేణి. ౧౫౮

తే. నీవిలాసాంబునిధి నేత్రనీరజములు, కౌఁగిటను మేను నాలాపకలన శ్రుతులు
సరసచుంబనసుఖములు స్వప్నగతము, లతివ యరుణోదయాంతత్రియామములను.

చం. కుసుమవితానముం గనినఁ గోమలపల్లవలీలతావళీ
కిసములఁ గాంచిన న్మధురకీరకలాపికలాపనాదము
ల్వినమెయి విన్న దాడిమిఫలంబులఁ గన్న మధూళిశర్కరా
విసరముఁ గొన్న నిన్నె తలపెట్టుచు నుండుదుఁ బ్రాణవల్లభా. ౧౬౦

మ. నవలా యగ్గల మైనమోహమున నానారీతులం గుంది నీ
భవనం బేమి యెఱుంగ రామి దినము ల్వ్యర్థంబుగాఁ బోయెఁ గా
యవు నీకు న్నమియింపఁ గా దనిన నవ్యానంగకేళీరతి
న్భవదీయాంచితబాహువల్లరులచే బంధింపు నన్నీసునన్. ౧౬౧

చం. అనుచును నందసూనుఁడు ధరామరసత్తముతోడఁ గూడి స్యం
దనము నుదారవేగమున దారుకుఁ డొప్పఁగఁ దోల భూరికా
ననపుటభేదనాచలగణంబులదాఁటుచు నొక్కనాఁటఁ గుం
డినపురసీమఁ జేరె నవనీధవసూతి గ్రహించువేడుకన్. ౧౬౨

కం. పరిణయ మఁట రుక్మిణి కిపు, డరుదుగఁ జైద్యునకు నిచ్చు నఁట రుక్మియు భూ
వరు లెందఱేనిఁ జనిరఁట, హరికిని సంగరము లభ్య మగు టబ్బురమే. ౧౬౩

కం. తోడుగఁ జన వలయును నా, తోడునకుఁ సిద్ధపడుచుఁ దోఁతెం డిట నా
తో డాలము చేసిన నని, తోడుకొనుచు నరిగె హాలియుఁ దోరపుసేనన్. ౧౬౪

వ. ఇక్కడ రుక్మియు రుక్మిణిదేవిని శిశుపాలునకుం గట్ట సమకట్టి సర్వంబును దిట్టం బుగఁ గట్టాయితంబు సేయించి పురంబు నలంకరింపం బంచి శిశుపాలుఁ బిలిపించి విడిది నియమించి దించి తదీయానుచరు లైన జరాసంధాదిరాజన్యుల వేర్వేఱ నుంచి యెల్లి లగ్నం బని యెల్లరకుం దెలియఁ జాటం బంచె నంత రుక్మిణియు వేదనాదూయమానమానసాంభోజ యై తనయంపినపాఱుఁడు తిరుగ రాఁ డని గాలికిఁగదలు జలజపత్త్రంబునందలి జలబిందువు నా మనంబు తకతకలాడ దీనవదన యై యుండె నాసమయంబున. ౧౬౫

కం. ఖగరాజు కాన భానుఁడు, సొగసున నపరంజిచాయసొంపున తన మై
జిగి మీఱఁ బ్రకాశించెనొ నా, ఖగపతికిరణములు పసిమికాంతులఁ జెలఁగెన్.

తే. వారుణీకాంతఁ బూర్వసత్పథము విడిచి, రశ్మి చెఱఁగ నరుణమునఁ గ్రాలి పిసపఁ,
జాయ విడనాడి యంబరసంగమంబు, జాఱి దిక్కేది జలధికై పాఱె నినుఁడు.

ఉ. ఆయతరశ్మి లెల్లఁ జెద రయ్యెను జెందఁగ వార్ధకంబుఁ దా
జాయయు నేగె దూరమునఁ జాలఁగ మిత్రుఁ డటంచు నాక శే
రాయఁ డెదుర్పఁ జొచ్చెఁ దమి రాకఁ బగ ల్గడ తేఱు నింక నే
నీయెడ నుండఁ గా దనుచు నేగె నభోమణి పశ్చిమాబ్ధికిన్. ౧౬౮

సీ. వేడుకకాంత్రకుఁ దోడైన నెచ్చెలి కన్నలంజల కెల్లఁ గన్నతల్లి
యభిసారికల కెల్ల నను వైనముసుఁగు బల్లుచ్చులు చల్లినచ్చుధూళి
ఘూకంబులకు నెల్లఁ గోమ రైనచుట్టంబు కలభోభికనులకు గాలిపోరు
కోకాలి జత పీడఁ గొట్టెడిమంత్రంబు కూలివాంద్రకు నెల్ల మేలివిడుపు
దంపతు ల్మదిఁ గోరెడి సందివేళ, కనులపస మాపునట్టికన్గట్టువిద్య
స్వైరిణీతతి మెచ్చు నిచ్చలును నిచ్చఁ, జెలఁగెఁ జీఁకటి జగములు జీఁకు పడఁగ.

కం. ఉల్లసితమతి దిగంగన, లెల్లం గ్రీడింపఁ గోర్కు లీరిక లెత్తం
జల్లుడుపిచ్చెలకై యెగఁ, జల్లినముత్తెము లనంగఁ జాలెం దారల్. ౧౭౦

సీ. వెన్నెల యిది కాదు విరహిణీజనతాంగసంభూతపాండరచ్ఛాయగాని
కౌముది యిది కాదు యామినీభామినీమందహాసాంకురమహిమగాని
జ్యోత్స్నయో యిది కాదు సురమణీరమణీయవక్షోజచంద్ర లేపనముగాని
చంద్రిక యిది కాదు సరసచకోరికాగణముపాలిటిజీవగఱ్ఱగాని
యనుచు జనములు వొగడంగ నఖిలదిశల, మెండుకొని నిండఁ గన్నులపండు వగుచు
రంగు మీఱంగ నిజకాంతిఁ బొంగి వెడలె, సరసపూర్ణకళాసీమ చందమామ.

సీ. వెన్నెలపులుఁగులవెలిపరమాన్నంబు వాటచారులు మెచ్చుమేటితోడు
దండిచోరుల కెల్ల నుండునూరితలారి జారిణీవితతికి సవతిపోరు
పాపల కెల్లను బరమసంతోషంబు నెల తేనెతెట్టెలో నొలుకు తేనె
వేసదారులు మేనఁ బూసిన మెఱుఁగులు రాత్రి యన్నతికప్పురంపుఁబూఁత
కలువపొలఁతుకనోములఫల మనంగ, నలరువిల్తునితూపుల నొలుకు చున్న
ధూళి యనఁగను దోడ్తోన దోఁచి యొప్పె, సాంద్రచంద్రిక లానిశాసమయమునను.

కం. తనయూపాణిగ్రహమహ, ఘనవిభవాలోకనేచ్ఛఁ గలశాంబుధి పొం
గెనొ నా జగ మంతయుఁ దగఁ, గన నయ్యె వళక్షచంద్రికాదీధితులన్. ౧౭౩

వ. ట్లు చందురుం డుదయించుటయు రుక్మిణీకాంత కాంతవదురంతచింతాక్రాంతయై
హారాహారవిహారదూరయై యెట్టకేలకుం జిత్తంబుఁ బట్టం జాలక యందఱుఁ
బోవం బనిచి యాప్తురా లగుచెలికత్తియతోని ట్లనియె. ౧౭౪

చం. పరిణయవేళ రేపకడ, పాఱుఁడు రాఁడు, పయోధి దాఁట స
త్వరుఁడును గాఁడొ శ్రీహరియు ద్వారక లేఁడొకొ నాదువిన్నపం
బరయఁడొ నన్ను నమ్మఁడొ ధరామరుఁ డాలము సేసెనో కటా
పరఁగెడిజీవితంబు కడుభారముగాఁ గనిపించెఁ జేడియా. ౧౭౫

కం. పోఁడో భూమిసురుం డిటు, రాఁడో కృష్ణుం డి దేటి రచ్చల టంచుం
గాఁడో శ్రీహరి పెనిమిటి, లేఁడో మఱి పంపఁ బైదలీ యొండొకఁడున్. ౧౭౬

వ. అని. ౧౭౭

సీ. మలయానిలము వీఁకమై కాఁక గన సోఁక హరిహరీ కృష్ణ యనంత యనుచు
విటపాళిఁ దినుబాళిఁ బికపాళి రొద సేయ రామానుజా రామ రామ యనుచు
రేయెండ లలి మండఁ గాయంబు గాయంబులై చన దితినిశాటా యటంచు
మొదలమ్ము లలనెమ్ము లెదఁ గమ్ముకొని గుమ్ము నరిదరకర తమోహర యటంచు
గాలి పికపాళి వెన్నెల కంజ మేఁచ, జడ గళం బాననంబు హాసంబు లీల
విద్రుచుఁ గీలించుఁ జూచు నివ్వెఱను నింపు, కాంత దుర్దాంతకంతువిక్రాంతిచేత.

చ. ఎలమి మనోభవార్తి నిలు వెల్లను దుస్సహతీక్ష్ణతాపసం
జ్వలితము గాఁగఁ గాఁగ నుపశాంతి కురస్థలజాతకుంభసీ
మలఁ గురియించుఁ గాని దని మానక దృగ్గళితాశ్రువాహినీ
జలములఁ గంద ముత్తెములు జాఱఁగఁ బోణిఋఁ బాణి యూర్పులన్. ౧౭౯

వ. ఇట్లు మదనశరవేదనాదూయమానమానస యగుచు. ౧౮౦

సీ. సరసకళోద్దామ చంద్రమా నీవైన నను జాతవేదన హరికిఁ దెల్పు
మోసదాగతి యెంతు నా సదాగతిగాఁగ నాగతిఁ దెల్పు జనార్దనునకుఁ
గీరమా ద్వారక దూరమా నేరమా నీవైనఁ దోడ్తెమ్ము నీరజాక్షు
వెన్నెలా దయ నీకు సున్నలా చిన్నెలా శ్రీకృష్ణుఁ దేఁగదే శీఘ్రముగను
ననుచుఁ బటుధార పెను పారఁ గను నపార,వారి కనుఁగొరగను గాఱ వారిజాక్షి
యల్లఁ గనకుండమిాటుఁ జీరంచుత్తోడఁ, దుఃఖుచు నెదపడుచు వెతసాపడుచుఁ బడుచు.

సీ. వెన్నెలా దయ నీకు మిన్నలా నుతి నీకు సున్నలా నన్నెలా కన్నె నేఁపఁ
గోకిలా నీ కింత కేకలా పక్కికి వీఁకలా కూఁకలడాకఁ జూపఁ
బున్నమా జీవాళి కన్నమా భోగులఁ గన్నమా దయ నీకు సన్న మటవె
గాలిగా యిల నీవు గాలిగాపున బాల నేలఁగా జోలి నీ కేల కలుగు
నంచు వగ మించి తనుముంపనొంపఁ దల్లడించు ధృతి డించుఁ దమిఁ బెంచు నించు నీరు
కన్నులను గంటివిల్కాఁడు కంటగించి, కొంకుతనమున విరు లదరంట నేయ. ౧౮౨

కం. కీరమ శ్రవణానందక, గీరమ చెల్వారుబిఱుసు కేకలు ధర సిం
గారమ మృదుపల్కులు బంగారమ వామాంత మేల్విచారమ చెపుమా. ౧౮౩

కం తొగ రామగరా లాజగ,జిగి రా సెగ రాల నగ్గిసిగవా తగవా
పొగరా యిల జవరాలిని, వగ రాలఁగ రాప వేలుపఁగ రాచిగురా. ౧౮౪

కం.చందనమా యింతటివె,చ్చందనమా నమఁ గనఁ బలుచంద నమా హె
చ్చందనమా యిది కడులొ, చ్చందును మామగువ నేఁప హరిచందనమా ౧౮౫

కం.ఘనమా నత్యార్తి యిల, న్ఘనమా సన్మార్గగునకర్మఫలంబా
ఘనవేణులపై నుతుమట, గనుమా శ్లాఘన మదీయకమనుం గనుమా. ౧౮౬

కం.మదనా జనరంజనన,త్కదనా యనివార్యమైనగతి నేఁచఁగ నీ
కదనా నీ కదనము నేఁ, బద నాయన నవల కింతపదనా యనయా. ౧౮౭

ఉ. హారిపయోధరంబులు విహారవిశాలనుశాల శౌఁగదా
యోరి పయోధరంబుల సముద్భవ మందితి కాదె కాంతిస
ద్భారపయోధరంబులసువర్ణతఁ గాంచితి మోముఁ జూడకే
క్రూరత జన్మదేశముపరోధముఁ జేసెదు మేలె చిత్తజా. ౧౮౮

ఉ. దుష్టనిశాటుఁ డావిధుఁడు త్రుంచును దమ్ముల నష్టశీలముల్
కష్టమధువ్రతంబులును గాలియు సాఁకును బాఁపదాఁటు ను
త్కృష్టపుజాతి హైన్యగతినేడ్తెఱ నాయని గూడుఁగొమ్మలన్
భ్రష్టచతుష్టయాప్తతను బంచముఁడై కనుఁగొంటె పంచతన్. ౧౮౯

కం.లోకము బాధించెడిచో, వైకుంఠుఁడు త్రుంచు మనసు పట్టిన నిన్నున్
న్నాకొడు కంచున్ జూపఁడు, నాకపదునిసుతుఁడు గాఁడె నరకాసురుఁడున్.

కం ముక్కంటికంటిమంటల, నుక్కడఁ గాల నాను మొక్కఁడ నిలిచెం
దక్కక చంద్రాంచలమునఁ, జెక్కనఁ బేరైన లేక చెడియెదు సుమ్మీ. ౧౯౧

కం.ఘోరశరాసారంబున, నారిగణమ్మర్మభేదనము సేయుటయు
న్వారల నాఱడియిడుట, ల్మారుండా కొమరుసేతలా తలపోయన్. ౧౯౨

కం పంచత నొందిన యుష్మ,చ్చంచద్భుజదంశముక్తసాయకచయము
ల్పంచత నొందియుఁ బాంథులఁ, బంచత నొందింపఁ బాలుపడియెనె మారా.

తే. మాను వల దింతపొగరు రమాకుమార,నాల్గుతునుకలు సేసిన నీల్గ నడుచుఁ
దలనుగ్రిందుగఁ జేసినఁ దలఁగ ననుమఁ,దోఁపదో వహ్నిమధ్యంగతుండవగుట.

చం.నను నను వార వారక గొనంబున నంబునఁ గాయ గాయఁ జా
నను నను మోఁద మోదమె ఘనా గను నాఁగను గోయురో చెలు
ల్వినుచు వినుచూలిమాలిసగ పీరము పీరము దూలఁ దూల నే
నన నసఁబోఁటి బోటిఁ గలనా కలనా యిది కామ కామదా. ౧౯౫

ఉ. అత్తను జంపెఁ దండ్రి శిశుహత్యను జేయును మేనమామ మే
నత్తను బొందుఁ దాత సుత నాలిఁగఁ జేకొనె నీదుభ్రాత నీ
వెత్తునఁ బాంధకాంతలనె యేఁచుట చిత్తజ నైజ మయ్యె హా
యెత్తఱిఁ బెద్దవారిగుణ మేకద లభ్యము పిన్నవారికిన్. ౧౯౬

కం. కనినం జెడు నొక్కటి యూ,తనిఁ గని మనుఁగడ మఱొండు తచ్ఛరములనే
మునుకొనఁ గైకొని మామనె, యనుమానము లేక మోఁది తౌరా మదనా. ౧౯౭

సీ. శరనికరంబును శిరసావహింతుము మన్నన సేయరా మాకుమార
పండ్లు చక్కెర వెట్టి పాలింతు నీతేజి మన్నన సేయరా మాకుమార
ప్రాణంబుగా మది భావింతు నీతేరు మన్నన సేయరా మాకుమార
నీకేతనంబును నేత్రాలఁ గప్పుదు మన్నన సేయరా మాకుమార
యతనుమూర్తి వనుచు సుతనుమూర్తి వటంచు, నరవి విందుఁగా నిజముగఁ గందు
మాను మాను మేనుగాను జూడు కుమార, యేఁప నేల యిటుల దాఁప నేల.

కం. రాజితగతి సత్సంతతి, తేజము గను రక్షిచే క్షితిం జక్రంబు
లాజిలు స్రుక్కక నీవలె, రా జుండుటకన్న మే లరాజకత శశీ. ౧౯౯

కం. ఆసల వెలిఁగించుచు మే, ల్దోసముఁ బొసఁగించి జనవిదూరుఁడ వై శ్రీ
వాసత్రాసకుఁ డగుని, ర్దోసం బగుఁ జూడ మాకుఁ దో డనఁ దగునా. ౨౦౦

సీ. తొలుదొల్త బడబాగ్నితో సహవాసంబు వాటించి యుష్ణంబు వలనుగాంచి
తొలితొలి యమృతంబు తోరంపుఁగబళంబు సప్తార్చికి నొసంగి సంతరించి
నెల నెల తప్పక నెలచెలిదూఱుచు వేఁడిమి మఱి మఱి వృద్ధిపఱచి
చూడ విషాగ్నులతోడఁబుట్టువ యయి యుగ్రాంశునకు సరియుద్ది యగుచు
నరయ నుగ్రావతంసంబ వయిననిన్ను, శీతరశ్మినయంట వాచేటు కాదె
చంద్రశైత్యంబు బాహ్యసంసక్త మట్లు, చంద్రశైత్యంబు బాహ్యసంసక్తముకద.

సీ. మనసు గన్నట్టిరమాపుత్రుఁ డని యుంటి మధుపగుణం జోట మఱపు దవిలె
శుకవిప్రవరుఁ డని చొక్కి యుంటినిగాని ముంగోపి వగుట నెఱుంగకుంటిఁ
బ్రాణంబుగా నిన్ను భావించితినిగాని ద్రైతేయుఁడ వగుటఁ దలఁప నైతి
శ్రీవాసము లటంచు శిరసావహించితిఁగాని బాణము లంటఁ గాన నయ్యె
చలువతోఁ డని నమ్మిన జగతి జనులఁ, జంప మూలల మటంచుఁ దలంప లేక
మారకీరసమీరసుమారివైరు లార మది మోస మయ్యె దుశ్చాగులార. ౨౦౨

కం. దూపింప దయ్యె మతనుఁడు, ప్రాపు నిశాటుండు తోడుపడదై తేయుం
డేపున- ~లాశినంగతి, పాపలు బ్రతుకుదురె యిట్టిపాపుల యెదురన్. ౨౦౩

వ. అని విధాత నుద్దేశించి యిట్లనియె. ౨౦౪

మ. కలమే చాలుఁగదయ్య మాతనయుఁడా గారింప గోరంబుగాఁ
దలఁప న్నీకు మఱింతసంతసము గా దా బాధలం బెట్టఁగా
వలెనా వేఁడిగ మందమారుతము వీవం జేసి రేయెండల
న్వెలుచం గాయఁగఁ జేసి తంతయును గానీ లెమ్మిఁ కే మయ్యెడున్. ౨౦౫

వ. అని యుషఃకాలంబు డాయంజూచి పొంపిరివోవుచిత్తంబున. ౨౦౬

తే. కోకిలంబులు నిప్పులు గురియఁ జూచి, కూయుచుండుటఁ గంటివే కొమ్మ యనినఁ
గోకిలంబులు నిప్పులు గురియుచుంట, సహజమే గద చెలియరో జగతియందు. ౨౦౭

కం. మన నేటికి ధర మఱి యే, మన నేటికి నేఁటి కతఁడు మఱచినచో వ
మ్మన నేటికి సర్వము పొ,మ్మను బోటికి నాదుబోఁటికను ఘనచింతన్. ౨౦౮

ఉ. బాఁపలఱేఁడు చంద్రుఁ డగు భావన సేయఁగఁ దన్వి శేషుఁడుం
బాఁపకొలంబు నేలు సహవాసము పేర్మిని బాపపుణ్యము
ల్ప్రాపిత మా నటన్నది యబద్ధము కాద యుమేశమేశులం
దాపునఁ జేరి తాపము నుదారత రక్ష యొనర్తు రుర్వరన్. ౨౦౯

మ. చెలియా యాతనితోడఁ గూడి సుఖ నై చెల్వారఁగాఁ గల్గునే
లలితోత్తాలరసాలసాలక శిఖాలం బామిత్రైలాలతా
కులపత్త్రవ్యజనంబులం బసిఁడి బాగు ల్మీఱునుయ్యాలలం
దిలకింప న్నవసారసారసపరిద్ధీ ప్రాంబుపూరంబులన్. ౨౧౦

వ. అని మఱియు నాలవయామంబు నడవం జొచ్చె విప్రుండు రాఁ డాయె నిఁకేఁ
గర్తవ్యం బెయ్యది యని డోలాందోళితమానస యై విచారించుచున్న సమ
యంబున. ౨౧౧

ఉ. సారెకు నిట్టు లాసతి విచారముఁ బూని పచారు సల్పఁ గా
సారెముపీడి సారసరస ప్రథుపానపరాగలీనఝుం
కారయుతోరుబంభర మొకండు వెసం జనుదెంచి వీఁకమైఁ
జేరువ నున్నక్రొన్ననలఁ జిక్కణ మైనప్రతానవేదికన్. ౨౧౨

ఉ. వ్రాలినఁ జూచి యాసతి విరాళియుఁ బైకొన దాని కి ట్లనుం
జాల సుమాయుధుండు కడుశాతశరంబుల ముంచె నొంచె నేఁ
గేలు మొగుడ్తు నావిభుఁడు కృష్ణునియొద్దకు నేగి హేమస
చ్చేలునితోడ నాగతి వచింపుము నింపుము పెంపుసొంపులన్. ౨౧౩

చం. సుమనసుమైత్రి నూని యతిసుందర కృష్ణతనూవిలాసముం
గొమరుగఁ దాల్చి యాయతనుకోటిని మించుగుణైకమూర్తివై

యమరుచు మంచివారి సొబగారెడిపద్మినిఁ గూడి భవ్య మా
భ్రమరకులాగ్రణీ కటఁ గృపారతి నామనవిం గ్రహింపుమా. ౨౧౪

ఉ. కమ్మనివింటిజోదు వడిగ న్మలుకు లైయి నిండ నేసినం
బమ్మెరపాటుతోడఁ దమపాన్పుల వేఁగెడిపాంథపాళి జుం
జు మ్మని నీవు తోఁచినను స్రుక్కుచు వెల్వలఁ బో దురార్తిచేఁ
జిమ్మినఁ జంప వచ్చెడి నజిహ్మగ మంచును భ్రాంతచిత్తులై. ౨౧౫

ఉ పాంథసతుల్ నిజాత్మలను బల్లఱు రాఁజెడిమన్మథాగ్ని పు
ష్పంధయ నీదుపక్షములఝంకృతికంధరభాంకృతిధ్వను
ల్బంధుర మై రహింపఁగను భగ్గని మండఁగఁదాల్మి దూలి పా
ణింధమ మంచు ధాయ్యి యని నిశ్చయబుద్ధి వహించి వేఁగరే. ౨౧౬

ఉ. పొచ్చెము లేనియూసలను బొట్టల నింపఁగఁ దేనె నానుచుం
గ్రచ్చఱ ముక్కునం దిగువ రాలగఁ బుప్పరసంబు పూవుల
న్జెచ్చెరఁ గ్రక్కుచు న్విషముఁ జిత్తజుఁ జేసినపాఁపతూపు నా
వచ్చెడి మిమ్ము నచ్చరలభంగిని గాంత్రువియోగిను ల్వెఱన్. ౨౧౭

ఉ. ఇందునియందుఁ గందునకు నెందఱో కందువ లెన్నొ పల్కఁగా
వించును గాని నామదికి వేఱుగఁ దోఁచెడి నంధకారికిం
బొందగుపూవు కాన ఘనపుష్ప రసగ్రసనామరాపగేం
దిందిరబృంద మంచును మదిం దలపోయుదుఁ బుష్పలిడ్వరా. ౨౧౮

ఉ. కమ్మనివిల్లుదాలుపు ఖగమ్ము లురమ్మునఁ గ్రమ్మి గ్రుమ్మఁ దా
పమ్మున సొమ్మసిల్ల హరిపాలికి నావలరాయబారము
న్నిమ్ములఁ బంప నెంచినను మేలు దలంప కలంతిరీతి నో
తుమ్మెదలార జుమ్మనుచుఁ దుమ్మెదరా దయ రాదె నాపయిన్. ౨౧౯

కం. బతిమాలెద నిను భ్రమరమ, పతికడకు న్వేగఁ బొమ్మి పరువున రమ్మీ
యతనినిరంతరపరిమళ, యుతవదనాంభోజరక్తి నుండకు మచటన్. ౨౨౦

చం. పొసఁగెడిభక్తి మై నెరఁగి పూన్చి మదీయహృదీశుపాలికి
న్వెసఁ జని నాదువాక్కులను వీనులఁ జొన్పు మటన్న నూరకే
మసలెదు గాని నీదురభిమానము మానవు మానుదే మలీ
మసు లసమానమానమధుమత్తులు స్వాశ్రితసద్గుణజ్ఞులే. ౨౨౧

వ. అని వివిధవిధంబుల వదరుచున్ననమ్మత్తకాశినిఁ గాంచి గారాబుశంభళి యిది
యే మమ్మ యింతికి నింత వేఁదురు చెల్లు నటమ్మా తెల్లవాఱ నీ పంచినపిఫ్రుండు
తడయక వచ్చు నూఱడిల్లు మని యూఱార్చుచున్న సమయంబున. ౨౨౨

ఉ. సంగరరంగమందు నిజశాత్రవుల న్వధియించి మించి సా
రంగవినీలకుంతల పరాక్రమవృత్తిని నిన్నుఁ గైకొను
స్సంగము లే దటంచుఁ దెలుపంగను భార్గవి భైష్మి యాటచే
తం గనిపించెనో యన నుదారత భార్గవుఁ డొప్పెఁ దూర్పునన్. ౨౨౩

కం. తనచెలియలియుద్వాహముఁ, గనుఁగొందు నటంచు నున్నఁ గట విధి యోర్వం
గనుజాలఁడు హా యని శశి, వనరెడినో నాఁగ వేగఁ బలుకంబాఱెన్. ౨౨౪

కం. అంబుధిరాట్కన్యోద్వా,హంబు సుమీ యెల్లి యనుచు నపుడు దెలుపఁగా
నంబుధులకుఁ జనియెడి నా, నంబుధిసంభవుఁడు గ్రుంకె నపరాంబుధిలోన్.

ఉ. రా జని పాలకూరగతి రాజిలు టొక్క టెపేర వీనికి
న్రాజన మింత లేక యిటు గ్రాలి తమి న్నిము నేఁచుఁ జొచ్చె ని
ర్వ్యాజతఁ దమ్ములార తెలుపం జను మిత్రున కంచునో భర
ద్వాజము లోలి శ్రావ్యనినదంబులఁ గూసె మనోహరాకృతిన్. ౨౨౬

కం. రజని చన నలిని తనకు, ద్విజపతి రే పెట్టినట్టి పీడాపటిమ
న్నిజముఖనిర్వ్యథ్యమరీ, వ్రజనాదవ్యాజమునను వరునకుఁ దెలిపెన్. ౨౨౭

చం. వలనుగఁ దెల్లవాఱ నిసిఁ బాసినపెంటిని గాన కెయ్యెడం
గలయఁగ రోసి రోసి కడు గాసిఁ గొలంకుల డాసి వాసి భా
సిలుదళసంస్థబంధువుల శ్రీగృహ దేశనటన్మధువ్రతం
బులఁ గని రిక్క లంచును విమోహముపేర్మిని సంజ యంచు ను
చ్చలనము నొంది గుందు నొకజక్కవపక్కి వియోగవేదనన్. ౨౨౮

కం వెదకుచు నొకచోఁ గనఁబడ, ముదమున నెఱకలు విదుర్చు మూర్కొని మఱియుం
గదియు స్మరియుం బ్రేమా,స్పదదృష్టులఁ జూచుఁ గలయ జక్కవ లంతన్. ౨౨౯

ఉ. ఎప్పుడు తెల్లవాఱు హరి నె ప్డిఁక నేర్పడఁ గందు నన్నుఁ దా
నెప్పుడు తోడుకొం చరుగు నెప్పుడు నావెత లీఁగు నంచుఁ దా
నొప్పుగ శయ్యపై నిదుర నొందక చెప్పెడి దేమి బాధ యం
చొప్పులకుప్ప గొప్పతమి నూర్పులు పుచ్చుచు నుండె రాతిరిన్. ౨౩౦

వ. అంత బల్లునఁ దెల్లవాఱుటయు ద్వారక కేగినభూమిసురుండు ఘంటాపథంబున వచ్చుట దవుదవ్వులం గాంచి యతనిహాసన్ముఖవిలాసం బుపలక్షించి కార్యంబు పం డగుట భావించి యే మేమి యొఱింగించునో యని తొట్రుపాటుపడు సతికి నానిమిషంబు లపూర్వవేదనాకరంబులై యుండె నంత నావిప్రుండు చనుదెంచి ప్రదక్షిణనమస్కారపూర్వంబుగ నిలుచున్నరుక్మిణిం గని యిష్టవల్లభుఁ జేపట్టుమని దీవించి యి ట్లనియె. ౨౩౧

ఉ. వచ్చెను వాసవానుజుఁ డవశ్యము యెల్లి విరోధికాండము
వ్రచ్చి వధించి క్రూరశరవారపరంపర సంగరావనిం
జెచ్చెర నిన్నుఁ దోడ్కొనుచుఁ జేరెడి ద్వారవతీపురంబు పెం
పచ్చుపడంగ నిండుతమి నంబుజలోచన యూఱడిల్లుమా. ౧౩౨

ఉ. నీదుమహత్వ మెట్టిదియొ నీరజనేత్ర భవద్విలాసరే
ఖాన్వితరూపశీలగుణహావచమత్కృతి విన్న దాదిగా
లే దెటు మోదమ్ము కంటికిని లే దెటుఁ గూడ్పు విమోహవేదనా
సాదితదేహతాపజరుజం గజగామిని యేమిచిత్రమో. ౧౩౩

కం. నవనవసుధామధురవర,నవనీతమృదుత్వదుక్తి నారాయణుఁడే
శ్రవణరసాయనముగ విని,వివశుండై యొఱఁగె నెట్టిప్రేమయొ యొఱుఁగన్. ౧౩౪

కం. ప్రేమాకులమతితో నో,భామా రామానుజుండు పవలును రేయు
న్వామానితశయ్యను న్వ,ర్వామాకృతశిశిరవిధులవలన న్మనెడిన్. ౧౩౫

మ. పికము ల్గాయునొ కర్ణశూలములుగాఁ బెం పారఁగాఁ గీరము
ల్వికటాలాపము లొప్పఁ జేయునొకొ హృద్భేదంబుగాఁ గ్రూరతఁ
బ్రకటారావము నించునో మధుపము ల్మత్తిల్లి యంచుం గటా
నికటారామవిహారి గాఁడు చెలియా నీకూర్మి పెం పెట్టిదో. ౧౩౬

కం. వెన్నెలబైటఁ బరుండఁడు, కన్నెలమొగ మైనఁ గనఁడు కమ్మని ద్రవ్యం
బన్న విత్తాకుం గొని గను, వెన్నుఁడు నీమీఁదికూర్మి పెంపున మగువా. ౧౩౭

వ. అని యతని సందేశవాక్యంబులం దెలియఁ బలికిన. ౧౩౮

ఉ. నాదుమనోహరు న్భువననాథునిఁ దోడ్కొని వచ్చి వేళయం
దాదుకొనంగ నైతివి ధరామరవంశవరేణ్య బల్దయం
గా దన కేను వేఁడినప్రకారమునం జని ద్వారకాపురి
న్యాదవవర్యుతోఁ బలికి యస్మదనంతమనోజవేదనన్. ౧౩౯

కం. ఇంతటిఘనోపకారికి, నెంతటిమార్మేలు సేయ నీ డగునో కా
వింతును భక్తి నమస్కృతు, లెంతయు మన్నింప వయ్య హితమతి విప్రా. ౧౪౦

వ. ఇట్టు కరకమలంబులు ముకుళించి మ్రొక్కిన దీవించి యతండు సనియెందద నంతరంబ ప్రద్యోతమాన ప్రద్యోతనమండలం బై వియన్మండలం బొప్పు నంత రుక్మిణీదేవిం గౌరీదర్శనార్థంబు గొనిపోవ సముకట్టి పన్నీట జలకం బార్చి కురులతడి యొత్తి విరులసరులు దుఱిమి కీలుగంటు వైచి చతుర్విధాలంకృతశరీరం గావించి మునుమున్న వీరభటపరివారంబు విగతపరివారంబు లగుతరవారివారంబుల జళి పించుచు నడువ, శంభళీజనంబు పల్యంకికాంతికంబునఁ దో నడవ, నులుపంబు

లఁ గేలఁ గీలుకొలిపి చెలువు గలవిలువచెలువ లేగ, భూసురాంగనలు మంగళారాత్రికలం బాడుచుం దోడ రాఁ, బణవమర్దలఢక్కాకాహళకోలాహలంబు దోహలంబుగా బంధువర్గంబు లనుసరింప, శుద్ధాంతంబు శుద్ధాంతరంగంబున వీడి గోవిందపదారవిందమిళిందాయమానం బైనమానసంబున మదనమథనశశివదనాసదనపదంబుఁ జేరి, సదమలకమలధౌతకరచరణకమలు లై శంభుకుటుంబినీప్రాసాదంబులోనికిఁ దత్ప్రసాదంబుఁ గోరి చనె, నటమున్న యోషిజ్జనంబులు తజ్జననికి మజ్జనం బొనర్చి సమజ్జను లై ధూపదీపనైవేద్యతాంబూల నీరాజనంబులం బూజించి సజ్జనుండి రంత రుక్మిణీకాంతయు నిజమాతృనియోగంబున హాంబట్టుపుట్టంబు మడుంగు గట్టి గౌరిం బూజించి యి ట్లని వినుతించె. ౨౪౦

ఉ. శంకరి విస్ఫురద్వినయసంశ్రితమానవసంకటాళినా
శంకరి కింకరీఘటితసోమనసాంగన శంకరాత్మవా
సంకరి భక్తమానసవశంకరి ఖండితమాహిషాసురా
శంకరి యోజగజ్జనని సాఁగిలి మ్రొక్కెదఁ బ్రోవవే దయన్. ౨౪౧

కం. పంచాననహరినర నర,పంచాననభగిని కుగజపంచాననరా
ట్పంచాననవల్లభ నర,పంచాననుఁ గృష్ణు నాకుఁ బతిఁ జేయఁగదే. ౨౪౩

చం. పలుమఱు లోకమందు భయభక్తులతో లలితామృతోక్తుల
న్వలగొని మ్రొక్కు భక్తులకు వాంఛితము ల్సమకూఱు టబ్రమే
కలయఁగ నర్చ లిచ్చి కలకాలము సాత్త్వికవృత్తి ని న్నెదం
దలఁచెడియట్టివారు భువి ధన్యులు మాన్యులు గారె శంకరీ. ౨౪౪

శా. నామీఁదం దయ చేసి లోకజననీ నానాథుఁగాఁ జేయవే
శ్రీమన్మందకటాక్షవీక్షణసుధాజీవాతుధారావళీ
దామైకస్ఫురితాంబుజాక్షుఁ గమలాధామార్హసద్వక్షు వీ
క్షామాత్రోన్ముదితావిపక్షు పరశిక్షాదక్షు నధ్యక్షునిన్. ౨౪౫

ఉ. కృష్ణునిఁ గృష్ణమిత్త్రు నతకృష్ణవినాశనుఁ గృష్ణవంద్యునిం
గృష్ణరవు న్విపన్ననతకృష్ణశరణ్యు హతార్తికృష్ణదు
ష్కృష్ణమదాపహారు ఘనకృష్ణునిఁ గృష్ణప్రతాపు జిష్ణుని
న్విష్ణు నలంకరిష్ణుఁ బ్రభవిష్ణుని నాపతిఁ జేయు మీశ్వరీ. ౨౪౬

వ. అని వినయవిశేషయుక్తి భక్తిరక్తిసక్తి సూక్తిఁ గరకమలంబులు ముకుళించి వినుతించి ప్రదక్షిణపూర్వకంబుగా సాష్టాంగంబు లాచరించి యాగామిశుభసూచకవామలోచనచలనంబులకు వామలోచన లోలోన హర్షించుచు భూసురవధూవరులకు ఫలాదిదానంబు లిచ్చి మ్రొక్కి వారలాశీర్వచనపూర్వకంబుగ నిడినయక్ష

తలఁ దలఁ దాల్చి హైమవతీసతీపూజ చాలించి మానంబు దొలంచి యంబుధరనికరంబు నిర్గమించి చనుదెంచురాకాసుధాకరబింబంబుడంబు విడంబింపఁ గలశపారావారసంభూతసుధాకలశ బలవదాకర్షణగర్వనిర్వాసితసు పర్వపూర్వగీర్వాణదురభిమాననిర్వాపణసమారంభసంరంభసుభగంభావుక సుందరనయనారవిందనిష్యందమందమందచంచలదృగంచలంబున సొబగందుబృందారకబృందవంద్యమా నేందిరాసుందరీసుందిరశాంబరీవిలాసినీవిలాసభాసమాన యై సురవాహినీధరగేహినీగేహంబు వెలువడి, గంగాతరంగిణీతరంగడోలాందోళితకనకకమలదళవిదళనలోలతుందిలమదమరాళంబుచందంబున మందగమనంబున నాకాశనీకాశవికాశం బైనమధ్యంబు హాటకధరాధరకూట ప్రతీకాశగురుతరపయోధరభారంబున నల్లల్ల నాడఁ, దాటంకరత్నప్రభాజాలనిటంకీకృతగండఫలకముకురపురోభాగకీలితం బైనదీపకళికయుఁబోలె ముక్కున త్తత్తమిల్ల, సరోజాతనర్తనలోల భ్రమరకంబులు వదనంబు నావరింప, మల్లికాముకుళశోభాస్పదంబులగురదంబు లరుణారుణాధరకాంతి దాడిమీపక్వఫలబీజతేజంబున నావటిల్ల, సుందరదరహాసచంద్రికాజాలంబు చూపఱునేత్రోత్పలంబుల కనిమిషత్వంబుఁ గలిగింప, మీనకేతన కేతనసూతనవిభ్రమంబునఁ దొలఁకాడు పయ్యంట దూఁగాడ, నించువిల్కాఁడు యువయువతీజనంబులమనంబు లగలింపఁ దటాలున వాఱ దూసి తళతళలు చెలువార జళిపింప దగద్ధగాయమానంబగు కృపాణమరీచివీచికాపరంపరలు నా నావాలుఁగంటిక్రేఁగంటిచూపు వాలుఁగంటుల రాచమగలమదంబు సదమదంబు కాఁగ, సముజ్జ్వలమేఖలాకీలిత రత్నవితానంబు లకాండకాండధరవాహకోదండజనకంబు లై మెఱయ, మొగులు మొఱఁగి ధర మరగి తిరుగుమెఱుఁగు తెఱఁగున నత్తెఱవ యొఱపుమీఱ, నందనందనాలోకనకౌతుకంబున జగన్మోహిని యై చనుదెంచుచున్నసమయంబున. ౨౮౭

సీ. దశదిశాతతజనతామహానిస్వనశమకరవరవచశ్చారవిద్య
నిరుపమతరకామినీరూపకైతవమూర్తపుష్పాస్త్రునమ్మోహవిద్య
యాలోకనేహానృపాలావళీపంచశరవశ్యవిలసదోషధిమతల్లి
ధారణీధవధైర్యదారణోత్కటమనఃప్రభవసంచితశితాపాంగబాణ
రాజితవతంససుమమకరందలుబ్ధ, రవణరవదంభబాణాసిరసనసమయ
రమతిధుతగుణనిక్వణాక్రాంతసాంత,రాళ పొలు పారె మత్తమరాళిలీల. ౨౮౮

సీ. ఇంచుకించుక నట్టు లెత్తి ముసం బార మోముల వికసనములుగఁ జేసి
యిరువంకలఁ గదల్చి శిరమును స్తంభించి కనుఱెప్ప లెగయించి మనము నిల్పి

సుందరగ్రీవంబు ముందుగా వెలయించి గండభాగం బింత కంపనముగ
సమకృష్టిఁ గీల్కొల్పి సర్వాంగకంబులు పులకింప నాసాగ్రమునను జూపు
వ్రేలు గదియించి నిర్వచోలీలఁ బోఁత,బొమ్మ లన నొప్పి రావేళ భూమిపాలు
రెల్లఁ గుండినపురవరవల్లభాత్మ,జాతసౌందర్యవర్ణనసమయమునను. ౨౪౯

శా. ఆకర్ణాయతనేత్ర దా నడచుచో నాకేశరాగ్రంబులై
వీఁకం జూపుచుఁ జూపులో న్పెసఁగె వేర్వేర న్ధరాపాలకా
స్తోకస్తోమముఁ బాఱఁ జూపు చదిగో దూరంబున జూడుమీ
శ్రీకృష్ణుం డతఁ డంచుఁ జెప్పఁగను జేరె న్నాఁగ శ్రోత్రద్వయిన్. ౨౫౦

ఉ వాసిగఁ గాంచె రుక్మిణియుఁ బాలితదాసు విభాసు ద్వారకా
వాసుఁ గరస్థభాసు నిజవాహనసంఘటితైకభాసు శ్రీ
వాసు మునీంద్ర మానసనివాసు మదోత్కటవైరివీరసం
త్రాసు దృగాశుగద్రుతపరాసుపరాసురసద్విలాసునిన్. ౨౫౧

ఉ. మారశరీరు వీరు సుకుమారు నుదారు మదారిమారు స
త్సారమసారహారు నవశౌరమనోహరు తారహారవి
స్తారవిహారవారవిలసత్సుదరస్థలభారు ధీరు దా
వారక గాంచె భైష్మి బలుబాళిగ నోరవిలోకనంబులన్. ౨౫౨

వ. ఇట్లు కనుంగొని పూర్వశ్రుతతదీయరూపరేఖావిలాసోపమానంబుల హీనోప
మానంబులుగఁ జేయునయ్యనంగజనకుసౌందర్యవయోవిశేషంబుల కానందిం
చుచుఁ దనమనంబున. ౨౫౩

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనివాఁడు జయంతకంతులం
ద్రొక్కెడివాఁడు రూపమున దోర్బలసంపదఁ గాలదండముం
జెక్కెడువాఁడు రక్తి మెయిఁ జిక్కెడు వీఁడు మనోహరుండుగా
నక్కట గుల్కు కున్న నకటా సొగ సేటికి జన్మ మేటికిన్. ౨౫౪

ఉ. ఎప్పుడు చూచుఁ జక్రధరుఁ డేర్పడ నాదెసఁ జూచి రక్తిమై
నెప్పుడు చేర వచ్చు నను నెప్పుడు వైరులఁ ద్రుంచి వైచుఁ దా
నెప్పుడు దోడుకొం చరుగు నెప్పుడు నాపతిఁ గూడి యుందు నే
నెప్పు డ దెప్పు డంచు నళినేక్షణ కాంతుఁ దలిర్పఁ జూడఁగన్. ౨౫౫

మ. సరసీజోదరుఁ డంతఁ గన్గొనియె భాస్వత్స్వర్ణవర్ణ న్మహాం
గరమాయుక్సముదీర్ణపూర్ణరజనీకాంతాననో నాథసో
దరరక్తాంబుజవర్ణకర్ణయుగళీతాటంకరత్న ప్రభా
భరసత్పాటలవర్ణదృగ్యుగ జగద్వర్ణ న్నుతాపర్ణఁ గాన్. ౨౫౬

చం. మదవతితుండశీకతరమంజులమండలవీక్షణాక్రియా
భ్యుదయము నొంది యొంది నయనోదకలక్ష్యము చేత గాఁగ మఱ
ఉదధి స్వవేల దాఁటి వెలి నోఁపఁ దదీయుతరంగకంబుకో
యిది యనఁ బెద్దయుప్పు వెలయించెను మించినప్రేమస్త్రేఁగునన్. ౨౫౭

కం. ఆలోలనయనఁ గని విధు, నాలో సురబాలయో యటంచుఁ బలుమఱుం
దా లోనన మరు లెత్తిన, నాలోనన మురుఁడు చిమ్మె నాలో ననలన్. ౨౫౮

వ. ఇట్లు గనుంగొని హరి తనమానంబున. ౨౫౯

చం. కలయఁగఁ గామి చూపు లనుకాటుకపిట్టలఁ బట్ట జక్రవ
త్తుల వలరాచబోయఁడు వికుంఠితరీతిని బట్టువేఁటకై
వల నిడి యుంచెఁ బోలు నటు వాటిలవే యివి సన్నరేకలో
పల నిటు కస్తిఁ బొందఁ గలవా కుచసంచితపాప మేమియో. ౨౬౦

చం. తరుణిముఖంబుతో నెనయుతత్పరత స్విదశా జజస్రము
స్థిరవ మాశ్రయించి నిటలాక్షుజటాటవి గంగ యొద్దునం
బరమతపంబుఁ దాఁ దగవు మాలి యొనర్పఁగ నేల శంభళీ
స్వరసత వేఁడ రాదె మృగనాభిని దిద్ద మొగాన నింతికిన్. ౨౬౧

చం. వెలినగ వాస్యదేహములు వెన్నెలయో నెలయో లకోరియో
చెలిసొబగారు శ్రోణి సరి చీమలకో మలకో లమో నుదు
రొప్పలఁతుకకొను నూఁకు నరి ఘుష్కరమో కరమో రమో సుపు
ష్కలచికురస్తనాక్షులు లొగిఁ గంధరమో ధరమో రమాకమో. ౨౬౨

సీ. ద్విరదంబు శరదంబు శరసంబుజద్యుతి నడకయు వేసలి నగవుఁ దెగడు
ఘనకంబు కనకంబు కనకంబుసుమములు కంఠంబు మైచాయ గంధవహము
నలినమ్ము నలి నమ్ముఁ బులినమ్ముచెలువమ్ము గరములు కచముల కాంతి శ్రోణి
కరభంబు కరభంబు నరరంభ నిరసించు కాంతియూరుద్వయూకాంతకాంతి
యవుర యిక్కన్య నుతియింప నలవి యాగునె, నలువ కైనను వేనోళ్ల చిలువకైన
లలితదర్పకఖురళీకళావితీర్ణఁ, బూర్ణచంద్రాస్య నే నెట్లు పోవ వినుతు. ౨౬౩

కం. చేరలకొలఁదులు కన్నులు, బారలకొలఁదులు కచాలు పరికించిన వి
త్తీరులు కనుబొమ్మలు హృద్ధారులు కడగంటిచూపు లతివకుఁ జూడన్. ౨౬౪

కం. హారులు లోచనములు హృద్ధారు లపాంగములు పల్లవావళిశోభో
ద్ధారులు పాణులు కరిమద,హారులు గమనములు సతికి నగునే పొగడన్. ౨౬౫

మ. వరలావణ్యజలంబు లుబ్బఁగ శిఖావ్రాతంబు బల్లదప్తి ము
త్కర మై నెమ్మిఁ దలిర్ప జాజి యను వొందఁ న్వేణి సారస్యవి

స్ఫురణ నైనకతపాళి మించుతనురోచు ల్దోఁపఁగా శ్రీపయో
ధరము లసద్రసయుక్తిఁ గాన నయి చిత్రం బయ్యె వీక్షింపఁగన్. ౧౬౬

వ. అని నుతియించు చున్నసమయంబున నాయింతి దాపునకు స్వచ్ఛంబయి నాయు
ధంబుల రథంబున నుంచి మేను వెంచి మదోద్దండశుండాలశుండాదండనిభంబు
లగుదోర్దండంబులు మెఱయ నోరకొమ్ము లిడి ప్రతిపక్షోక్షుంబుపైకిం జనును
ఘోక్షుంబుభాతి నోరశిరం బిడి యూనుగున నడచు చున్నచక్కటికి నుక్కన
నొక్కొండ నని సకలజనంబులు నివ్వెఱ గను చుండ నక్కమలేక్షణం గరంబుల
నెత్తుకొని యవలీల రథంబునకుం జని దారుకు ద్వారకచక్కి శతాంగంబుఁదోల
నియమించి విమతజనంబులమనంబులు వగులఁ బాంచజన్యంబుఁ బూరించి
యథేచ్ఛంబు చనుచుండె నాసమయంబున. ౧౬౭

చం. తనయనుజాతఁ దోడ్కొనుచు దానవమర్దనుఁ డేగు చుండఁ దా
ఘనతరకోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల రుక్మి వే
యనిమెను నూత గొల్లఁ డొకఁ డాతురతం గొని యేగెఁ గంటె నా
యనుజ బళా యిదైన నగరా పురివాడల నాఁడువారలున్. ౧౬౮

వ. అని క్రుద్ధుండై సమరసన్నద్ధుండై కృష్ణనిరోధనంబునకుం దుర్బుద్ధియై సైన్యం
బుఁ బంచి తానును వెనుకొని. ౧౬౯

ఉ. నందతనూజ భీష్మనృపనందన నిక్కపుబంటువోలె నీ
విందఱుఁ జూడ నెత్తుకొని యేగెదవే యిటు విడ్తు మామ కా
మందతరాగ్నిభీకరసమంచితబాణపరంపర ల్వెస
న్వ్రిందుగ నీతనూనూరుధిరబిందువుల న్రుచి చూడ కుండఁగన్. ౧౭౦

కం. అవనీపవనీపుఁడ వై, యవనీపులతోడఁ బోరు టనుచిత మనకే
యవనీతుఁడ వై తోడరితి, నవనీతపుముద్దలొక్కొ నాబాణంబుల్. ౧౭౧

మ. అవనీపాలురసత్ప్రసాదముల నాస్వాదించుటో కానలం
నవు రొప్పంగను బాలు నేయుఁ బెరుఁ గాస్వాదించుటో మించుటో
యవనీపాలకు లెందు గోపజను లెం దాఁగయ్య మేజాడ హా
నవనీతంబులముద్ద లంచుఁ దలఁతే నాబాణముల్ గోపకా. ౧౭౨

చం. అనుచును రుక్మి వేగమ శరాసనముం గొని యేసెఁ దేరిపై
వనజదళాక్షుపై హరులపై రథచోదకుపై ఖగేశుపై
సునిశితతీవ్రబాణములఁ జూపఱు లెల్ల విమోహవిస్మయం
బునఁ గనఁ బ్రావృషేణ్యజలముక్పటలం బవి ముంచుచాడ్పునన్. ౧౭౩

వ. ఇట్లు కఱకుటంపఱ సంపాచారంబుగఁ బైపయిం బఱపునయ్యలుచుం గని
ఘనంబు భీషణంబు నగురోసంబు వేసంబు దాల్చినగతి విలయవేళాప్రభూత
ప్రభూతాంబుసంభూతసకలభూతచేతోభీకరనిర్వక్రవిక్రమంబున నుత్కాండ శుం
డాలశుండాదండసముద్దండనిజభుజాదండమండితాఖండల కాండాసనసమ మం
డలీకృతకోదండయుక్తకాండకాండ ప్రకాండకాండకాండధారాకల్పితానల్పనిశా
శంకావాపకఖండితవిరోధివరూథినీశమండలశిరోధిమండనాఖండశౌండుండై బ్రహ్మాం
డంబు నిండ దండంబులుగ బాణజాలంబు లొండొండఁ బఱపి రెండవదండధరుం
డన శార్ఙ్గకోదండధరుండు దుర్నిరీక్షుం డగుచు విజృంభించిన. ౧౭౪

కం. స్యందనకీలితకేతన, బృందము మింటం జరించె వీరావళికి
స్కందఱ విడుదులు చెప్పఁగ, బృందారకపురికి వేగ నేగె ననంగన్. ౧౭౫

ఆ. ప్రాణదానపరతఁ బరఁగితి మున్నిప్డు, దానవారిచిహ్నదంతు లివియు
ప్రాణదానపరతఁ బరఁగ నౌ నని గజ,దానపరత మీఱెఁ దానవారి. ౧౭౬

కం. మమ్ము శిరసావహించియు, చుమ్మీ గైకొంటి మధునిషూదనసంజ్ఞ
న్నమ్ము దయఁ గావు మనుగతి, ముమ్మరముగఁ గూలె గుఱ్ఱములుకూ యిడుచున్.

వ. ఇట్లు లక్ష్మీదేవిఁ జేపట్టుకొనుటకు మున్న జయలక్ష్మిఁ జేకొనువాఁ డైహాయగజ
దానారంభసంరంభంబున మీఱుతెఱంగు దోఁప హాయగజదానపరుం డై దాన
వారి దానవారియుంబోలె రక్తధార లొలుకఁ దానవారులం బొరిగొనుసమయం
బున. ౧౭౮

ఉ. ఏమిర కృష్ణ సైన్య మిటు లేటికి రా నుఱుమాడ బంటవే
మామకఘోరనారశితమార్గణభూరిపరంపర ల్ద్వదీ
యామితనిష్ఠురస్ఫురదహమ్మతి వమ్ముగఁ జేయుఁ జుమ్ము రా
రా మహి నిన్నుఁ బో విడుచురా మఱి భీష్మకుమారుఁ డెన్నటన్. ౧౭౯

సీ. కయ్యంబునకు మఱి నెయ్యంబునకు ధర వియ్యంబునకుఁ దుల్యవిధము వలయు
నీతోడ నని సేయ నీతోడు సి గ్గయ్యె ధీరులే ధరణి నాభీరజనులు
జాతిహీనుఁడ వౌట సఖ్యంబు గారాదు కారాదు వియ్య మాఁకతనఁ జేసి
పోటుమానిసివోలె పోరాటమునకయి పూనితి వెంతయు బుద్ధి మాలి [ప్రకట
తెలియఁజెప్పెదనింతయుఁ దెలిసికొనుము, బాలుఁడవు వెండియును గోపబాలుఁ
విడువు నాసోదరిని వేగవిడువవేని, గనవు మెసవిన విడువక ననువుఁ గొందు.

సీ. వనములఁ బడరాదు మనునాశ బాడబోపము మాటచే నాదు బాణగణము
వనములఁ బడరాదు ఘనశిలీముఖములు దావపావకశిఖాదారుణములు

కన వనీపకుఁ డయి మన రాదు చన రాదు కనదవనీపకగణముమీఁద
వనములఁ జొర రాదు మునివృత్తిని వసింప ద్వారకాపురమునఁ దరము కాదు
ధరఁ బ్రబుద్ధత కల చేనిఁ దరుణి విడిచి, కలికిశనమున మెఱయును ఘనత కలుగుఁ
గాక నామాట విన కున్నఁ గలవు వినఁగఁ, గోలహారికంఠఘంటికాజాలరవము.

వ. అని. ౧౮౨

కం. ఉరసమున నారసముల్, నారసముద్దండవృత్తి హరిపై వైవ
స్థిరసమధిరతాసమధీరుం డావేళఁ దనవధీరణుఁ డయ్యెన్. ౧౮౩

కం. హరిబింబపిధానోద్ధుర, శరముక్తిని వెలసె రుక్మి శరముక్తిని దల
స్పర్ధి నుకుదాశుగమున వే, విరియించె హరించి రథ్యవితతి న్సూతున్. ౧౮౪

వ. ఇట్లు నిజభూజావష్టంభవిజృంభణంబున గోపడింభకుండు తదారంభారంభసంరం
భణంబున శతాంగంబు హతాంగంబుఁ గావించి విల్లు పొల్లువోవ నఱికి బెదరు
లేక యెత్తినకత్తిని మత్తునిఁ జులుకఁగ ధరపాలుఁ జేసి నిలు నిలు మని యదల్చుచు
మిక్కుటం బగురోషంబునఁ బ్రాణంబుఁ గొనఁ గృపాణంబుఁ గొనునిజవల్ల
భుం జూచి భయకంపితగాత్రయుఁ గించిచ్చ్యుతోత్తరీయయు నార్ద్రీభూతనేత్ర
కంజాతయు ముకుళితకరకమలయు నై తటుకున రుక్మిణి యడ్డంబు వొచ్చి యి
ట్లనియె. ౧౮౫

మత్తకోకిలము. దేవదేవుఁడ వీవటంచు మదిం దలంపక మూఢుఁ డై
దేవుఁ డంచుఁ దలంచి చైద్యునిదేవిఁ జేసెద నంచు ని
గ్గావరంబునఁ దిట్టెఁ గన్నులు గానకే మది నిల్పకే
కావవే సదయామయాత్మక కంబుకంధర శ్రీహరీ. ౧౮౬

మత్తకోకిలము. తొల్లి బాముచ మే మొనర్చినతోర మాఘనపుణ్యము
ల్చెల్లెఁ బో వినుతింప శక్యమె శ్రీరమాధవుఁ డల్లుఁ డై
చెల్లఁ గల్గె నటంచు ముద్యతచిత్తు లై చెలువారునా
తల్లిదండ్రులఁ ద్రోవ న్యాయమె దారుణోదరవేదనన్. ౧౮౭

మ. అని దీనోక్తులు వేఁడఁ గృష్ణుఁ డనుకంపాయత్తచిత్తంబున
న్ఘన మారోసము మాని చిన్నినగవు ల్గాన్పింపఁగా మోవిపైఁ
గని బావా యిఁక నేమి రండిటకు వేగం బంచుఁ దోఁ జేరి క్ర
న్ననఁ జేకత్తిని దీసి మోరఁ గొఱిగె న్నారాయణుం డుద్ధతిన్. ౧౮౮

ఉ. ఆయెడ కేగుదెంచె నిహతారిసమూహచమూసమాజుఁ డై
ధీయుతహారి సీరి వసుదేవకుమారకృపాణముండితా

శ్రీయుతగాత్రు బద్ధకరుఁ జెచ్చెరఁ గాంచి విషణ్ణుఁ డౌచు నా
రాయణుతోడఁ బల్కెఁ దగునయ్య భవాదృశు లిట్లొనర్తురే. ౨౮౯

కం. హితు లని కూర్చిని బెంప న, హితు లని కోపమునఁ జంప నెవ్వారి నైన
న్నతి నీతని యెడఁ గినుకకుఁ, గత మేమి మహాత్మ విగతకారుణ్యమునన్. ౨౯౦

కం. సరియే రాజకుమారుని, శిరమును మూఁతియును గొఱుఁగ సిగ్గట బంధు
న్సిరమును మూఁతియు గొఱుఁగుట, శిరముఁ జ్ఛేదించు కంటెఁ జెడ్డ మహాత్మా.

వ. అని సహోదరమానభంగంబునకు దుఃఖించు రుక్మిణిం గని హలి యిట్లనియె.

మత్తకోకిలము. నీసహోదరుమానభంగము నీదుచిత్తములోపల
రోస మొప్పఁగ నిల్పి యొగ్గుల నాడఁ గృష్ణునిఁ బల్కఁగా
వాసి మీఱఁ దలంప కమ్మ భవత్సహోదరుఁ డోలి మున్
చేసి యుండినకర్మ మిట్టులు చేసె నేటికిఁ జింతలన్. ౨౯౩

వ. అని యూఱార్చె నంతఁ గృష్ణుండు రుక్మిణీసహితుం డై జయజయధ్వానంబు లొప్ప ద్వారకానగరంబుఁ బ్రవేశించె; నంత వసుదేవబలభద్రాదులు శ్రీకృష్ణ వివాహమహోత్సవంబు నెల్లెడం జాటం బంచి పురంబు నలంకరింపం బంచి రంత.

ఉ. చాల మసారవారనవసారసబాంధవభానువిస్తృతో
త్తాలనిరంతరద్యుతికదంబకకల్పితకాయమానకై
లాలతికాయమానధవళప్రతిమానవిహీనహీరశో
భాలహరీపరంపరలు భాసిలె ద్వారక వాడవాడలన్. ౨౯౫

సీ. ఏచాయలను జూడ మృగనాభికాలిప్తచారువేదీకుడ్యచత్వరములె
యేత్రోవలను బోవ దృఙ్ముదావహరత్నవారసంధానితతోరణములె
యేవాడలను జూడ శ్రీవాసఘనసారవర్ణకవ్యకధూపపరిమళములె
యేవంకఁ గన భూషణావళీభూషితకాంతకాంతాక్రాంతఘనపథములె
సకలవీథుల శ్రీహరిజయరవములె, నిఖిలగృహముల మంగళనిస్వనములె
గేహగేహంబునందు నుద్వాహ మనఁగ, నగర మలరారె జనమనోనందనముగ.

కం. తోరణము లెల్లచో సా, ధారణములు హరిహయాశ్మధారణములు భాః
పూరణములు చిల్కలు భ్రమ, తోరణముల నొక్కఁ డొకటితోఁ గని సల్పెన్.

కం. మందారేందీవరమా, కందలసత్కుందబృందగంధవహుం డై,
గంధవహుఁ డలరె హృదయా, నందానందననిదానమందారుం డై. ౨౯౮

వ. అట్లు పురం బలంకరింపఁ జేసి రంతముహూర్తదినంబున. ౨౯౯

కం. సురసంఘంబులు గొల్వఁగ, సురరమణీయుక్తిఁ దగుచుఁ జూపటు లలర
న్హరిహయుఁ డరుదెంచెను హరి, హరియుద్వాహఘనవైభవాలోకమతిన్. ౩౦౦

చం. తక తక ధిమ్మి ధిమ్మి తకతై తకతై తకతై యటంచు మే
ల్చకచక లొప్ప నాకజలజాతవిలోచన పైఁట వీడ మే
లికుచధరంబు లాడఁగ విశేషన మూడఁగ నీవి యూడ నే
ణిక యసియాడ నంటె నవనీతలభర్తకుఁ గన్నుఁదైలమున్. ౩౦౧

ఉ. ఆవిధుమూర్తి కయ్యెడఁ దలంట నిలింపవధూలలాను మో
దావహతత్తధీయతకహారిసుఖస్వన మొప్ప నొప్పఁ బో
వే వడఁకం దదాస్యపదవీనికటస్థము లై కుచాగు లా
హా వని యేమి తారలును హాయి వడంకెఁ దదాశ్రయంబునన్. ౩౦౨

కం. నీరాటము నీకే తగు, నీరాటంబునకు రమ్ము నీ విప్పు డనుచు
న్నీరాగారముఁ జేర్చిరి, నీరాగారైకవాస నిర్జరయువతుల్. ౩౦౩

కం. సింధురవరదుని శిరమున, బంధురఘుంఘుంఘుమాత్తపరిమళయుత మా
గంధామలకం బిడియెను, గంధామలకంబుకంఠి కౌతుక మొప్పన్. ౩౦౪

వ. ఇట్లు మంగళస్నానంబు సేయించి. ౩౦౫

కం. పాటింప సాటిమీఱిన, తే టగుజల్తారుదోవతిం గట్టు కొన
స్నాటకవసనవిదారికి, హాటకవసనంబుఁ గప్పి రమరవధూటుల్. ౩౦౬

కం. కుండలములు దృఢ తేజో,మండలములు ఖచితరత్న మండలములు న
త్కుండలములు కుండలివర,కుండలమిత్రునకుఁ జెవులఁ గూర్చిరి సుదతుల్. ౩౦౭

కం. హారంబులు నవరత్నా,ధారంబులు నిర్మితిసంవిదారంబులు రు
గ్భారంబులు సుతమఃపరి,హారంబులు హరి యురోవిహారము లయ్యెన్. ౩౦౮

వ. ఇట్లు కృష్ణు నలంకరిష్ణుఁ గావించి రంత శచీదేవి లోనుగాఁ గలసురకాంతలు
రుక్మిణీదేవిం దో డ్తెచ్చి రందు. ౩౦౯

ఉ. పెంపును సొంపు నింపు మొలపింపఁగ ముద్దు రహింప శీవి రా
ణింపఁగఁ గంకణావళులు నింప ఝణంఝణతాళరావ మా
లింపఁగఁ బందు వై జడ చలింప గణింప నిలింపకామిను
లుం పెఁగ తైల మంటె నొక చంపకసౌరభ భీష్మపట్టికిన్. ౩౧౦

కం. చల్లారెడి జలములు నేఁ, జెల్లా యాలస్య మేల చేసెద వమ్మా
నీళ్లాడఁగ నలయును వే, చెల్లియ యని రుక్మిణిని శచీసతి పిలిచెన్. ౩౧౧

వ. ఇట్టు లమ్మున్నీటికన్నియఁ బన్నీట జలకం బార్చి తడియొత్తి. ౩౧౨

కం. హంసకముల మంజులరవ, శంసకముల మంగళ ప్రశంసకములఁ గు
ధ్వంసకముల ననుగామిత, హంసకముల నతిప లునిచి రం(ఘు)ల సతికిన్. ౩౧౩

మ. ఉడురాజారుణభానుసంకలము లొక్కో యంచుఁ బట్టంగనొ
క్కొక స్వర్భానుఁడు కేతువు న్గనసి వే యే తెంచి యాచెంతఁ జొ
ప్పడుచక్రప్రభ స్రుక్కి వెంబడి జడత్వం బంది రాభీతి నా
జడబంగారముఁ గీలుకొల్పిరి జడ న్స్వర్భానునీరత్నముల్. ౩౧౪

చం. వలనుగఁ బుండరీకమధుపానవిలోలమధువ్రతంబొ బా
హులసమయూఖలామృతమయూఖలసన్మృగలాంఛనంబొ నా
నలరఁగ దృష్టిదోషపరిహారకరక్షయొ నా బళీ యనం
దిలకము దిద్ది రాతిలకినీతిలకాలిక సుస్థలంబునన్. ౩౧౫

కం. వాలికకన్నులు మొగముం, బోలఁగఁ దామావరింపఁ బూనెనొ యనఁగ
న్వేలాన్నిర్మితగతి నా, వేళం గజ్జలపురేఖ పెట్టిరి కనులన్. ౩౧౬

కం. నిస్తులనితాంతపరిమళ, శస్తము సుమగంధిమొకలు చందన మేలా
ప్రస్తుతవిధికై పూయరె, హస్తిపగామిని కటంచు నలఁదిరి యువతుల్. ౩౧౭

కం. పేరులు పొందినవారలు, లేరే లోకమున నిట్టిలీలారతిఁ జె
ల్వారెడువా రెవ్వారే, పేరుల నే ముందు నుండుఁ బేరురమందున్. ౩౧౮

కం. కమలముఖనటనపరత, న్భ్రమరకములనీటుఁ గంటె పద్మాక్షి యనం
గమలముఖనటనపరత, న్భ్రమరకములు నీటుగుల్కవా యను నగుచున్. ౩౧౯

కం. మేఖల నునిచెద సైకత, మేఖలకుం దె మ్మటన్న మెలఁతే యుదన్వ
న్మేఖలసవతికి మేఖల, నా ఖల మని యుంగరంబు నవ్వుచు నిచ్చెన్. ౩౨౦

కం. వంకీలు నాగవత్తులుఁ బొంకం బౌ బాజుబందు పొగడఁగ నే లా
కంకణములు నిడి రొడలం, బంకజమందిరకు నమరపంకజగంధుల్. ౩౨౧

ఉ. శ్రీవిధుమూర్తి కట్టెదుటఁ జేరఁగఁ బోవుతరుణ్యురోజము
ల్బావన సేయఁ గంజముకుళంబులు స్రుక్కెడి నంచు నొక్కశో
భావహకోకము ల్బెదరి పాఱు నటంచునొ సన్నరైక సొం
పావహిలంగ నొక్కజలజాక్షి ధరింపఁగఁ జేసె రుక్మిణిన్. ౩౨౨

వ. ఇట్లు గైసేసి వధూవరులం బెండ్లిపీఁటలపై నునిచి రంత. ౩౨౩

శా. పైకాలాపతిరస్త్రియామహిమఁ జూప న్వల్లకీనాదరీ
ధాకౌశల్యము దోఁప శ్రావ్యతరకంఠ ప్రోద్భవానూనలీ
లాకౌతూహలసన్నిధానరుచిరాలాపంబు లొప్పంగ ల
క్ష్మీకళ్యాణముఁ బాడి రంత జలజాక్షీరత్నము ల్వేడుకన్. ౩౨౪

కం. భీతహరిణాక్షి నిర్వ్యాఘాతముగా నర్థధర్మకామేషు త్వం
నాతిచరితవ్య యనఁగను, నాతిచరామి యని పలికె నారాయణుఁడున్. ౩౨౫

కం. మంగళరవములు మ్రోయఁగ, మంగళసూత్రంబుఁ గట్టె మంగళకర యా
మంగళదేవతగళమున, మంగళ మని పాడుచుండ మంగళవతులున్. ౩౨౬

వ. ఇట్లు ముహూర్తంబు జరిగిన బ్రాహ్మణులకు ముత్తైదువలకు భూరిదక్షిణాతాంబూలాదు లిప్పించి వారలవలన నాశీర్వచనంబులఁ గాంచి రంత ౩౨౭

సీ. సూపంబులు నపూర్వపూపంబుఁ బాయసం బూరుగాయలు మంచికూరగాయ
వంటకంబులు పిండివంటకంబులు బజ్జు లప్పళాల్ నేతైనయప్పళాలు
చక్కిలా లుక్కెర ల్చక్కెర ల్లడ్డుక ల్లణుఁగుపూ ల్వడియాలు మఱియు నవలు
నవ్యఘృతంబులు శాల్యన్నములు మేలిదధ్యోదనంబులు తెఱఁగ కుంద
ధర శరచ్చంద్రచంద్రికాధవళ మగుచు, మాహిషం బగు దధితోడ మానితముగ
భారపడు చుండ బొజ్జలు నారగించి, రెల్లవారును వీరన కెల్లవారు. ౩౨౮

వ. ఇట్లు భోజనానంతరంబున. ౩౨౯

సీ. ఆకులో యివి కావు పాకారిలో కారిపరముఖీగండదర్పణము లేమొ
పోఁకలో యివి కావు పోలు పొందునప్సరఃకాంతాగుచిరచూచుకంబు లేమొ
సున్నమో యిది కాదు సన్నుతాంచితవారకామినీస్మితచంద్రకాంతు లేమొ
యేలకులో గావు లీలావిలోలాభ్రబాలారదనజాలహేల యేమొ
యనుచు లవళీదళంబు మున్నును గ్రసించి క్రముక చూర్ణవిలిప్త పర్ణముల వేగ
సారఘనసారపత్రకస్తూరిజాతి,వర్గచర్వణపగు లై రవారితముగ. ౩౩౦

వ. ఇట్లు మహోత్సాహంబునఁ బ్రొద్దు పుచ్చుచుండ దినమణి యస్తంగతుండగుటయు, నిస్తులసమస్తగుణప్రశస్తశమోపిధ్వానకవిస్తారప్రభానిరస్తారుణగభస్తికవిప్రస్తరవిన్యస్తకుడ్యశస్తంబును శుకవిగాజవిరాజన్మరకతచిరత్న రత్నకలాపవిభ్రాజితంబును సుతారతారహారవారవిలంబితప్రతీహారంబును దుసారకరవిశాలశిలావిలసితవేదికామానితంబును గిరిభిన్మణిగాణే యుతోరగణవిరాజితంబును మాకందమరందబిందుసందోహసందేహనిదానపుష్యరాగరత్నాంచితవిటంకయుతంబును జిత్రవిచిత్రతరశిల్పకలానైపుణ్యపుంభావితమణిగణవిలసితవాతాయనసోపానాదికంబును నగునొక్కదివ్యభర్మహర్మ్యంబున, భిత్తిఖచితహీరవారప్రభూతప్రభూతధనాళధవళప్రభాధాళధళ్యంబును బద్మరాగశోభాపరంపరాకలితప్రవాళవల్లరీవిలసితంబును బుండరీకశంకాకరతారకాగుళుచ్ఛమధ్యంగతమకరందబిందుబృందసందేహకారణపుష్యరాగోపరిప్రసారితనీలవినీలమధ్యాలబంభరడింభరంజితంబును బవనకంపితనిబద్ధదుకూలకల్పితతరంగసంగతంబును హల్లకకహ్లారేందీవరకైరవసారసదామవిశోభితంబును నై, క్షీరపారావారముం బోలునొక్కయనిర్వచనీయమహనీయకమనీయగణనీయశయనీయమందిరంబున శేషతల్పంబునుంబోలె,

నొప్పారునప్పాన్పు ప్రాగ్విన్యస్తదక్షిణపాదుండై యధిరోహించె; నంతఁ గాంతునియంతికంబున నొఱపు గలయప్పఱుపుపరపువ రుక్మిణి నెక్కంజేసి ఫలదానంబు లిప్పించిరి మఱియు నాశయ్యాగారంబున. ౩౩౧

తే. హాళి రసదాడి లో నగునరఁటిపండ్లు, పనసనురసాలసురసాలఫలనిచయము
పచ్చిద్రాక్ష యనాసయుఁ బలుదెగ లగు, లికుచముల నుంచినారు కేళీగృహమున.

తే. మల్లికాకేతకీజాతిమహితవకుళ, కంజకహ్లారచంపకకల్పసూన
దామములఁగూర్చిమరువంబుదవనములను, మించుతోమాలెలుంచినారంచితముగ

సీ. ఆకులో యివి కావు కాకారికోకారిలపనాకపోలఫలకలుగాని
పోఁకలో యివి కావు శ్రీకుశేశయవేశవీకాశకుచకోశవిధముకాని
చూర్ణమో యిది కాదు సురధునీసంజాతలలితసంస్థితఫేనలవముగాని
యేలాఫలాలుగా విందిరాసుందరీకమనీయరదకోరకములుగాని
నాఁగ వినుతింప నగుపూగనాగవల్లి, జాతిఫలభృంగపృథ్వీక లాతతముగ
జాళువాపళ్లెరంబున సరసనించి, యోలిశయ్యాగృహంబునం దునిచినారు. ౩౩౪

వ. అట్టియెడ నొక్కొక నెపంబునఁ బూవుఁబోఁడులు శయ్యాగారంబు విడిచి చను చుండి రందు గాదిలిశంభళి కృష్ణునితో ని ట్లనియె. ౩౩౫

కం. గొల్లది కా దీకన్నియ, పిల్లది కల్లయును గాదు భీరువు కటుకుల్
చెల్లదు మెల్లన నేలుము, పిల్లతనం బేల యింక పెండ్లికుమారా. ౩౩౬

కం. ఇన్నియును జెప్ప నేటికి, నన్నియు మదిఁ దెలియువాని కనసరపడినం
గన్నియ వెఱ పెట్టెడ వని, మున్నుగఁ జెప్పంగ వలసె మోహాము పేర్మిన్. ౩౩౭

వ. అని పల్కు వాక్యంబులు విని రుక్మిణి సిగ్గు దల కెక్కినట్లు తల వాంచి యూరకుండఁ గొందఱు కురంగాక్షులు. ౩౩౮

సీ. బాఁపనిచే రాయబార మంపఁగఁ జేసె సి గ్గెంత చేసెనే చేడెలార
మన పెద్ద హరికి సమర్పణంబుగఁ జేసె సి గ్గెంత చేసెనే చేడెలార
తనవారి నెల్లను దగఁ బాయఁగాఁ జేసె సి గ్గెంత చేసెనే చేడెలార
యీడుజోడగువానిఁ గూడి యాడఁగఁ జేసె సి గ్గెంత చేసెనే చేడెలార
యనుచు రుక్మిణి వినియును వినకయుండ, గుజగుజలువోయి రావేళఁ గువలయాక్షు
లంద అది విని సిగ్గున హరిణనయన, శిరము వాంచె మహాత్రపాభరముకతన.

వ. అంత నొక్కయనుంగుఁజెలి భీష్మపట్టియొద్దం జేరి యి ట్లనియె. ౩౪౦

చం. సురసలసన్మధూద్ధతవచోవ్యవహారనిరోధకారి తా
మరసవిలాసభాసురసమంచితదృగ్ప్రతిసీర మంజులా



ధర నిజశీర్షసంకలితదంతురదుర్భరభార మెన్నఁగాఁ
దరుణిరో యెగ్గు సి గ్గగుఁగదా నిజనాథునిఁ జేరువేళలన్. ౩౮౧

చం.మగనిమొగంబుఁ జూతు నన మాఱుమొగం బిడఁ జేయు మాటలా
డఁగ గమకింప వాక్కులఁ దడంబడఁ జేయును గంతపాళ మై
నగవు లటన్న నైఁపదు ఘనంబుగ శీర్షము నెక్కి వంచు హా
మగువలపాలిగాలికద మానిని సిగ్గు నవీన మానెడన్. ౩౮౨

కం.తగవే కృష్ణున కిటు రాఁ, దగవే తగ వేల మగలఁ దగులఁగఁ నాపై
నగవులతగవులు బిగువులు, నగవులు మగువలకుఁ దగవు నగరాజకుచా. ౩౮౩

సీ. పాఱుని మరురాయబారిఁ జేసిననాఁ డ దెచ్చటి కేగె నీమ్రుచ్చుసిగ్గు
ఎప్పు డెప్పు డటంచు నెదురు చూచిననాఁ డ దెచ్చటి కేగె నీమ్రుచ్చుసిగ్గు
మారుఘోరశరార్తి మలఁగు చుండిననాఁ డ దెచ్చటి కేగె నీమ్రుచ్చుసిగ్గు
గొబ్బునఁ గొని రాఁగ నుబ్బు చుండిననాఁ డ దెచ్చటి కేగె నీమ్రుచ్చుసిగ్గు
అవుర నానాఁట సిబ్బితి నవలఁ ద్రోచి, సంగసమయంబునం దిట్లు సలుపఁ జనునె
సిగ్గు నావలఁ బోఁ ద్రోచి చేడె నీవు, తలుపు వైవుము హరిమీఁదఁ దలఁపు నిలిపి.

మ. రసికాగ్రేసరచక్రవర్తి విను మారామానుజుం డన్న నీ
రసికత్వంబును జాతురీమహిమల న్రాణింపఁగాఁ జేసి మా
నసకాసారరసంబులం దెటుల యానందింపఁగాఁ జేసెదో
పస నీనేరిమిసొంపుఁ బెంపుఁ జెలి సాఫల్యంబు నేఁ డొందెడిన్. ౩౮౪

కం.మఱి మఱి యిటు లాడినచోఁ, జిఱుచిఱుకోపంబుతోడఁ జేడియ ప్రేసెం
దఱుచుగఁ గెందామరచే, మెఱమెఱ లాడంగ మనము మిష యబ్బినచోన్. ౩౮౬

కం.ప్రేటుపడ నేల నీచే, దాఁటుకొనెదఁ గా కటంచుఁ దటుకునఁ జనియెం
జాటునకుఁ దలుపు వేయుచుఁ, బాటలగంధి యట నొంటిపాటున నిలువన్. ౩౮౭

చం.శిర మర వాంచి యచ్చెలువ చెల్వునిచెయ్యిలు చూచు చున్నచో
నరరసమీపవర్తినిఁ ద్రపావృతఁ గన్గొని వాసుదేవుఁ డో
తరుణి యి దేల బేలవె వృథా స్మరశాతశరావళీవ్యథ
న్వరఁగఁగఁ జేయ నేల మగువా తగవా మగవారు వేఁడుచోన్. ౩౮౮

ఉ. కోమలవిద్రుమంబు లోడఁ గూడినఁ గూరెడితీవ్రవేదన
ల్లేమిడి నాఁగ శాస్త్రములు లేమిని నీమృదులోష్ఠవిద్రుమం
బోమదహంసయాన కడు నొ ప్పెను నాకు మనోజతాపము
ల్బాము యలక్ష్యభూత మగు శాస్త్రము నీమహిమంబు పెంపునన్. ౩౮౯

ఉ. కోమలవిద్రుమంబు లొనగూడినవారలు తీవ్రవేదనా
స్తోమపరీతచిత్తు లనుచు న్విని యుందు ని దేమిచిత్రమో
కోమలవిద్రుమాధరము గూర్చెడి మంజులతాప్రభావము
గ్గోమలి నీకుఁ గన్గొనినఁ గూడెను నా కతనువ్యథావళుల్. ౩౫౦

కం. నీదువియోగమునను సుమ,కోదండధరుం డదేమొ కోదండ మను
న్నీదుకటాక్షము కలిగినఁ, గోదండము వీడి యే మొకో దండ మనెన్. ౩౫౧

చం. తెరు వెది బాల వొటఁ గనుదే నవయౌవనమే విలాసభా
స్వరసురతాతివేలసుఖసంపద లిం పొనరింప నాస్యసుం
దరదరహాసచంద్రికలు నామదిచీఁకటిఁ బాప సత్సుధా
ధరమధురాధరామృతవితానము నానఁగ నిమ్ము కోమలీ. ౩౫౨

మ. అనుచుం జేడియఁ బ్రక్కఁ జేర్చి దరహాసాంకూరము ల్మోల్వఁగా
వనజాతాక్షుఁడు చుంబనాదికముల న్బాహ్యాంతరక్రీడల
న్నన మారం దని వార భీష్మసుత నానందాబ్ధినిర్మగ్నఁ గాఁ
బొనరం జేయ నిమేషమాత్ర మగుచుం బోయె న్నిశాకాలమున్. ౩౫౩

ఉ. తీరనిమోహభారమున దేవకిసూనుఁడు భీష్మపట్టితో
వారక క్రీడ సల్పెఁ జెలువంబుగ వాఁకల మారుడాకల
న్నారసశయ్యలం ద్ఘనమసారసమంచితహర్మ్యవీథుల
న్దోరపునిష్కుటంబులను దోయరుహాకరతీరభూములన్. ౩౫౪

ఉ. కోకనదంబుల న్లసితకోకనదంబుల సద్గదంబుల
న్నీకనదంబుల న్రుచిరశీతమయూఖమయూఖపాళిశో
భాకలితైకవేదికల భాసురరమ్యవనాంతరంబులం
దేకమతిం జరింప సరసైకత సైకతభూమిఁ జేడెకున్. ౩౫౫

కం. నలు పుక్కెను జనుముక్కులు, తెలు పెక్కెఁ గపోలతల ముదీర్ణం బై మూఁ
తలువడెఁ గనుఱెప్పలు మఱి, జల మూటెను నోర నొడలు సన్నం బయ్యెన్.

కం. బలిసెను నడు మంతంతకు, వెలసె నలసతయును నడల వేవి ల్లొప్పెం
దల సూపె నారు వాసో, విలసితభూషలను దాల్ప వేడుక వుట్టెన్. ౩౫౬

చం. ఒనరఁగ నంత నొక్కసుముహూర్తమునం బ్రభవించె పుక్షిశీ
వనజదళాక్షికి న్సుతుఁ డవారణ వారణవైరివిక్రముం
డనఘుఁడు రూపవిభ్రమకళైక జగన్మథనుండు భార్గవీ
తనయుఁడు ఘోరమూర్తి ఘనత న్మధుసూదనుమూలమూర్తి నాన్. ౩౫౭

ధర నిజశీర్షసంకలితదంతురదుర్భరభార మెన్నఁగాఁ
దరుణిరో యెగ్గు సిగ్గుగఁగదా నిజనాథునిఁ జేరువేళలన్. ౩౮౧

చం. మగనిమొగంబుఁ జూతు నన మాఱుమొగం బిడఁ జేయు మాటలా
డఁగ గమకింప వాక్కులఁ దడంబడఁ జేయును గంఠపాశ మై
నగవు లటన్న సైఁపదు ఘనంబుగ శీర్షము నెక్కి వంచు హా
మగువలపాలిగాలికద మానిని సిగ్గు నవీన మానెడన్. ౩౮౨

కం. తగవే కృష్ణున కిటు రాఁ, దగవే తగ వేల మగలఁ దగులఁగఁ నాపై
నగవులతగవులు బిగువులు, నగవులు మగువలకుఁ దగవు నగరాజకుచా. ౩౮౩

సీ. పాఱుని మరురాయబారిఁ జేసిననాఁ డ దెచ్చటి కేగె నీమ్రుచ్చుసిగ్గు
ఎప్పు డెప్పు డటంచు నెదురు చూచిననాఁ డ దెచ్చటి కేగె నీమ్రుచ్చుసిగ్గు
మారుఘోరశరార్తి మలఁగు చుండిననాఁ డ దెచ్చటి కేగె నీమ్రుచ్చుసిగ్గు
గొబ్బునఁ గొని రాఁగ నుబ్బు చుండిననాఁ డ దెచ్చటి కేగె నీమ్రుచ్చుసిగ్గు
అవుర నానాఁట సిబ్బితి నవలఁ ద్రోచి, సంగసమయంబునం దిట్లు సలుపఁ జనునె
సిగ్గు నావలఁ బోఁ ద్రోచి చేడె నీవు, తలుపు వైవుము హరిమీఁదఁ దలఁపు నిలిపి.

మ. రసికాగ్రేసరచక్రవర్తి విను మారామానుజుం డన్న నీ
రసికత్వంబును జూతురీమహిమల ప్రాణింపఁగాఁ జేసి మా
నసకాసారరసంబులం దెటుల యానందింపఁగాఁ జేసెదో
పస నీనేరిమిసొంపుఁ బెంపుఁ జెలి సాఫల్యంబు నేఁ డొందెడిన్. ౩౮౫

కం. మఱి మఱి యిటు లాడినచోఁ, జిఱుచిఱుకోపంబుతోడఁ జేడియ ప్రేసెం
దఱచుగఁ గెందామరచే, మెఱమెఱ లాడంగ మనము మిష యబ్బినచోన్. ౩౮౬

కం. వ్రేటుపడ నేల నీచే, దాఁటుకొనెదఁ గా కటంచుఁ దటుకునఁ జనియెం
జాటునకుఁ దలుపు వేయుచుఁ, బాటలగంధి యట నొంటిపాటున నిలువన్. ౩౮౭

చం. శిర మర వాంచి యచ్చెలువ చెల్వనిచెయ్యలు చూచు చున్నచో
నరరసమీపవర్తినిఁ ద్రపావృతఁ గన్గొని వాసుదేవుఁ డో
తరుణి యి దేల బేలవె వృథా స్మరశాతశరావలీవ్యథ
న్బరఁగఁగఁ జేయ నేల మగువా తగవా మగవారు వేఁడుచోన్. ౩౮౮

ఉ. కోమలవిద్రుమంబు లోడఁ గూడినఁ గూరెడితీవ్రవేదన
ల్మేమిడి నాఁగ శాస్త్రములు లేమిని నీమృదులోష్ఠవిద్రుమం
బోమదహంసయాన కడు నొప్పెను నాకు మనోజతాపము
ల్బాప యలక్ష్యభూత మగు శాస్త్రము నీమహిమంబు పెంపునన్. ౩౮౯

ఉ. కోమలవిద్రుమంబు లొనగూడినవారలు తీవ్రవేదనా
స్తోమపరీతచిత్తు లనుచు న్విని యుందు ని దేమిచిత్రమో
కోమలవిద్రుమాధరము గూర్చెడి మంజులతాప్రభావము
గ్గోమలి నీకుఁ గన్గొనినఁ గూడెను నా కతనువ్యథావళుల్. ౩౫౦

కం. నీదువియోగమునను సుమ,కోదండధరుం డదేమొ కోదండ మను
న్నీదుకటాక్షము కలిగినఁ, గోదండము వీడి యే మొకో దండ మనెన్. ౩౫౧

చం. తెరు వెది బాల వౌటఁ గనుదే నవయౌవనమే విలాసభా
స్వరసురతాతివేలసుఖసంపద లిం పొనరింప నాస్యసుం
దరదరహాసచంద్రికలు నామదిచీఁకటిఁ బాప సత్సుధా
ధరమధురాధరామృతవితానము నానఁగ నిమ్ము కోమలీ. ౩౫౨

మ. అనుచుం జేడియఁ బ్రక్కఁ జేర్చి దరహాసాంకూరము ల్మోల్వఁగా
వనజాతాక్షుఁడు చుంబనాదికముల న్బాహ్యాంతరక్రీడల
న్మన మారం దని వార భీష్మసుత నానందాబ్ధినిర్మగ్నఁ గాఁ
బొనరం జేయ నిమేషమాత్ర మగుచుం బోయె న్నిశాకాలమున్. ౩౫౩

ఉ. తీరనిమోహభారమున దేవకిసూనుఁడు భీష్మపట్టితో
వారక క్రీడ సల్పెఁ జెలువంబుగ పాఁకల మారుడాకల
న్సారసశయ్యలం ఘ్ఘనమసారసమంచితహర్మ్యవీథుల
న్ఘోరపునిష్కుటంబులను దోయరుహాకరతీరభూములన్. ౩౫౪

ఉ. కోకనదంబుల న్లసితకోకనదంబుల సద్ధ్రదంబుల
స్త్రీకనదంబుల న్రుచిరశీతమయూఖమయూఖపాళిశో
భాకలితైకవేదికల భాసురరమ్యవనాంతరంబులం
దేకమతిం జరింప సరసైకత సైకతభూమిఁ జేడెకున్. ౩౫౫

కం. నలు పుక్కెను జనుముక్కలు, తెలు పెక్కెఁ గపోలతల ముదీర్ణం బై మూఁ
తలువడెఁ గనుఱెప్పలు మఱి, జల మూఱెను నోర నొడలు సన్నం బయ్యెన్.

కం. బలిసెను నడు మంతంతకు, వెలసె నలసతయును నడల వేవి ల్లొప్పెం
దల సూపె నారు వాసో, విలసితభూషలను దాల్ప వేడుక పుట్టెన్. ౩౫౬

చం. ఒనరఁగ నంత నొక్కసుముహూర్తమునం బ్రభవించె రుక్మిణీ
వనజదళాక్షికి న్సుతుఁ డవారణ వారణవైరివిక్రముం
డనఘుఁడు రూపవిభ్రమకళైక జగన్మథనుండు భార్గవీ
తనయుఁడు మారమూర్తి ఘనత న్మధుసూదనుమాఱుమూర్తి నాన్. ౩౫౭

వ. అని యిట్లు సూతుండు శౌనకాదులకుఁ బ్రద్యుమ్నసంభవం బెఱింగించుటయు.

కం. కాకర విద్వేషణశం, కాకర మణిగణయుతోర్వి కాకర నాళీ
కాకరమిత్రాన్వయమిహి, కాకర శ్రీమణిమతల్లి కాకరవక్షా. ౩౬౦

ఉ. మంగళదేవతావిమలమానసమానససారసారసా
యంగజరూప శస్తసురసాహిత సాహిత సారసాహితా
గాంగధవోన్నదాపహృతికారణ కారణరూప దీప్త హే
మాంగహయా హయాన్య మధుహా మధుహాజనుతా నతావనా. ౩౬౧

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాయమానమానసత్వమహావైభవ
వావిలికొలను రామచంద్రరాయతనూభవ సుజనవిధేయ సుబ్బ
రాయనామధేయ ప్రణీతంబైన శ్రీకుమారాభ్యుదయం
బనుప్రబంధంబునం ద్వితీయాశ్వాసము.

---

శ్రీరామచంద్రాయ నమః.

శ్రీశారదాయై నమః.

శ్రీహయగ్రీవాయ నమః.

# శ్రీ కుమారాభ్యుదయము.

## తృతీయాశ్వాసము.

---



మహిమహిళాప పయో
ధామ మిహిరసోమనయన నయనుత ధైర్య
శ్రీమహిమవిజితనిర్జర
ధామా స్మరణైకతుష్ట దశరథరామా. ౧

వ. అవధరింపుము తరువాతివృత్తాంతంబు సాంతంబుగ వినిపింపు మని మునులు త
న్నడుగుటయు రోమహర్షణి రోమహర్షణంబుగా ని ట్లనియె. ౨

ఉ. మున్ను వచించితిం గద సమున్నతులార రతీమనోహరుం
డన్నిటలాంబకోగ్రనయనానలదగ్ధశరీరుఁ డౌట నా
పన్నత వేఁడఁగా రతి కృపం గిరిశుండు వరంబు లిచ్చుట
ల్వెన్నని లచ్చి వేఁడుటయు విశ్రుతవాక్ఫణితి న్సమగ్రతన్. ౩

కం. ఆవరమహిమ విదర్భో,ర్వీవరసుతకుం జనించె వీరుఁడు రుచిపుం
భావుఁడు భావజుఁ డురుతర, భావవిభాభావుఁ డిలను బ్రద్యుమ్నుఁ డనన్. ౪

కం. తుష్టమతి భైష్మి రుచిరా,రిష్టంబున సుతుఁడు చన్ను బ్రీతిం గుడువ
న్వేష్టముగ నిదుర వోయె న,నిష్టము ప్రాపించు నంచు నెఱుఁగనికతనన్. ౫

కం. దిష్టవశంబున నిద్రా,వ్యుష్టిని దా నాద మఱచి యుండఁగఁ దనకు
న్రిష్టదుఁ డని శంబరుఁ డ,స్దుష్టనిశాటుండు కలుషదూషితమతి యై. ౬

కం. రిష్టకరుం డై లోకా,రిష్టకరుం డధికశాంబరీవృతుఁ డగుచు
న్రిష్టకరుం డని యనక య,రిష్టములోఁ జొచ్చి దుర్నిరీక్ష్యసుతేజున్. ౭

కం. శిష్టనుతు నిఖిలలోకో,త్కృష్టచరిత్రుని మనుజవరిష్ఠుని బాలుం
దుష్టపుఁదలఁపునఁ గొనుచు య,థేష్టగతిం జనుచుఁ బ్రీతి యొడలినమతితోన్. ౮

కం. సంద్రంబున వైచెను ని,స్తంద్రతమైఁ జావు మనుచు దయ లేక నిశా
టేంద్రుఁ డటు చంపఁ జాలఁడ, సాంద్రం బగునీశుమహిమచందం బెటులో. ౯

కం. బాలునిఁ దానై చంపఁగఁ, జాలక జలనిధిని వైచి చనియెను బురికై
యాలోఁ గావలివారలు, నాలోకింపంగ బాలుఁ డగపడ కున్నన్. ౧౦
కం. ఆపోవక యెవ్వారో కో, పాపాత్ములుక్కరుణ లేక పసిపాపఁడు నా
కే పోయిరి కొని యనుచును, వాపోయిరి యంతిపురమువారలు భీతిన్. ౧౧
ఉ. అంతట మేలుకాంచి తనయంతికసీమను బాలుఁ గాన క
త్యంతవిషణ్ణచిత్తమున నాతురతం బలవించె రుక్మిణీ
కాంత నితాంతవేదనను గంజగళన్మకరందబిందుస
త్కాంతిని లోచనాబ్జములఁ గాఱఁగ ధారగ వారిపూరముల్. ౧౨
చం. తనయులఁ గన్నతల్లులు ముదంబు దొలంకఁగ వారిముద్దుల
న్గనుఁగొనఁ గోరు చుండుదురు గ్రక్కున నక్కునఁ జేర్చి ముద్దుల
న్ఘనముగ నింపఁ జూతురు జగంబునఁ దత్పరిలబ్ధిఁ బొంగునా
వనితలు పూర్వజన్మముల వారక యేమి యొనర్చిరో సుతా. ౧౩
ఉ. చన్నులపాలు ద్రావి సరసంబుగ సెజ్జను నాదుపజ్జ నీ
వున్నవిధంబుఁ గాంచి మది నువ్విళు లూరుచుఁ జూచు చుందు నేఁ
డిన్నగ నీదురూపు భవదీయవిలాసముఁ జిన్నినవ్వులుం
బున్నమచందురుం దెగడుమోమును మోహముప్పేర్మిఁ బుత్రకా. ౧౪
చం. ఫల మది యేమొకో యుదరభారమె గాక సుతుండు కల్గినం
బొలుపుగఁ జంక నెత్తుకొని ముద్దులు వెట్టి శిరంబు దువ్వుచు
న్జెలువుగఁ జన్నొసంగుచును జిన్నికుమారునిచేష్టల న్మనం
బలరఁగఁ జూచుపుణ్య మది యబ్బక యుండిన నోకుమారకా. ౧౫
శా. పుత్రా యెచ్చటి కేగి తయ్య యిచటం బో వీడి నన్నొంటి బ
ల్లాత్రం బొప్పఁగ నెట్టిక్రౌర్యరతులో కష్టాత్ములో దుష్టులో
చిత్రం బయ్యె నిమేషకాలమునఁ గాసిం బెట్టనో కొట్టనో
శత్రుత్వంబునఁ బాయఁ జేసి రయొ యేజాడ న్సహింతు న్సుతా. ౧౬
మత్తకోకిలము. నీవియోగము నెట్లు సైఁతును నీరజాయతనేత్ర వీ
భావియోగము మే లటంచును బల్కరే గ్రహవేదు లా
త్రోవలో నిది గండ మంచును దోఁప దాయెనె యింక సం
భావనీయవిలాసదుఃఖముఁ బట్టు టేగతి పుత్రకా. ౧౭
వ. ఇట్లు రుక్మిణి పలవించు చుండ శుద్ధాంతకాంతాజనంబులు. ౧౮
మ. పురుటింటం బసిబిడ్డ మాయ మగుచుం బోయె న్విచిత్రంబ యే
సరణిం బోయెనొ కాన రెవ్వ రనుచు న్సంతాపముం బొంద శ్రీ

హరి కృష్ణుండు మనంబులో నెఱిఁగి యన్యప్రక్రియ న్మౌని యై
పరితాపంబును బొందె బంధువులతో భావించి భావి న్మదిన్. ౧౯
కం. హరి యైనను హరుఁ డైనను, హరిపుత్త్రుం డైనఁ గాఱియం బడువేళం
బరికింపరు తా మావలఁ, బరఁగఁ రక్షింత్రు కర్మపరిపక్వముగాన్. ౨౦
వ. అంత నక్కడ. ౨౧
కం. కడువడి జలములఁ బడఁగం, బుడబుడమని బుగ్గ లెగయ మునుఁగుచు నున్నం
దడఁబడ కొకపెనుమీనము, కడఁగి గుటుక్కనను మ్రింగెఁ గడి గా నరునిన్.
వ. తదనంతరంబ. ౨౩
ఆ. పొలికి మ్రాఁకుగములఁ బొలుపుగా బంధించి, గొప్పతెప్ప కట్టి యొప్ప మీఱ
దిట్టతనము మీఱఁ బుట్టగోఁచులఁ బెట్టి, కేనిపాతకములఁ గేలఁ దాల్చి. ౨౪
కం. జాలంబుల భీకర మగు,గాలంబుల నురుపవి త్రకంబుల లీలం
గోలముల నించుకొని ఘన,సాలంబులఁ బట్టుతమిని జాలరివారల్. ౨౫
కం. శంబర తేమారి త్రక,దంబాదికములుకరాళి తళతళ మెఱయ
న్నంబరపురకైవర్తజ,నంబులు చని రటు రయంబున న్జలనిధిలోన్. ౨౬
తే. భాగధేయవశంబునఁ బట్టువడియె, మారు మ్రింగినయట్టియావారిచరము
వారిలోఁ గొంతజనముచే వారిలోన, దైవకృత్యంబునకు మాఱుదలయుఁ గలదె.
దోధకము. సారముదంబున జాలరు లంతం, జీరుచు నొండొరుఁ జేర్చిరి యాకూ
పారముతీర మపారముకాఁగం, జేర జనంబులు చెంతలఁ జూడన్. ౨౮
దోధకము. వ్రచ్చి వధించి పురంబున నమ్మ, న్వచ్చునొ పోవునొ పట్టెఁడుకాసు
ల్బిచ్చముపో పృథివీపతి కీయ న్మెచ్చుధనంబుల నిచ్చెడి నంచున్. ౨౯
దోధకము. వావిరి నెంచి నవారిగ వార, ల్వే వసుధాధిపువీటికి దానిం
బోవఁగఁ గొంచును బూనిరి వేడ్క, న్ధీవరు లెంతసుధీవరులొక్కో. ౩౦
స్రగ్విణి. దాససంఘంబులా దైత్యభూమీశ్వరా,వాసముం జేరినిర్వ్యాజన మ్రాంగులై
చేసి యెంతే నతు ల్సెల్వుగ న్రాజుముం, ద్రోసి రామీను సంతుష్టభావంబునన్.
కం. మీనంబు నపారంగత,మానంబును గాంచి తుష్టమానసమున స
న్మానంబును గావించె వి,ధానంబుల దాశజనము దనిసినదాఁకన్. ౩౨
వ. అంత శంబరుండు శంబరచరంబును మహానసంబున సూదకారులకు వండం
బంచిన వారలు. ౩౩
కం. జలచరముకడుపు వ్రచ్చుడుఁ, దళతళ మని కాంతు లెగయ దశదిశలందు
న్జలధరపటలీనిర్గత,కలితకళాపూర్ణసోముకరణి న్వాలిఁగెన్. ౩౪

వ. అంతఁ బాకకారులు మహాశ్చర్యంబునం బొంది యుదంతం బంతయు శంబరునకుం దెలియఁబఱిచి కుమారు నతనికి నప్పగించి రంత నచ్చట నున్న బాలకులు మాయావతి యనుపేర నిర్గుప్తచరిత్రంబున మాయావతియై రక్కసునకు ముఖ్యప్రాణంబుగఁ జరించురతిసతికడకుం జని. ౩౫

కం. పాకాగారమునందు ని,పాకార్థానీతదీర్ఘ పాఠీనంబు
న్వీఁకమెయి ఛేదింపుడుఁ, బాకారిసుతోపమానపాక మొకఁ డటన్. ౩౬

కం. ప్రాకటమతిఁ దోఁచెను శం,పాకమనీయాంగి యందుఁ బటురుచిరసురూ
పాకలితుఁడు జీవాఢ్యుఁడు, పాకవిహీనోపముండు పడఁతీ యనుచున్. ౩౭

వ. రతీదేవియు వారలఁ బిలిపించి బాలకపాలనార్థంబు కొందఱ నియోగించి తదీయరూపలావణ్యతేజోవిభ్రమంబులకు మనంబు భ్రమంబు గొనఁగొంతతడవాలోచించి తనకర్మపరిపాకంబునకై యరుదెంచినపాకంబని నారదవాక్యంబులు దలఁచుచు దినంబు లెన్నికొనుచుఁ గర్తవ్యం బెయ్యది యని యనుకొనుచుఁ దనమనంబున. ౩౮

కం. చూపించి నాకు నీపసి,పాపని ని మ్మన్న నిష్కృపత్వరతుండుం
బాపరతుం డగురక్కసుఁ, డేపున నె యియ్యంగ నూర కున్నె మీఁదన్. ౩౯

కం. క్రౌర్యమునకుఁ బూనినచోఁ, గార్యవిఘాతం బటంచుఁ గమలాక్షి గత
స్థైర్యమతిం జింతిలఁగా, నార్యమనీషఁ జను దెంచి యతిచిత్రముగన్. ౪౦

కం. భారతిపుత్రుఁడు సుజటా, భారాతతలోహితప్రభాభరితజగ
ద్వారుఁడు మంజులతరవర,భారతి ని ట్లనియె సత్కృపారతి రతితోన్. ౪౧

కం. ఓకొమ్మ యీకుమారుఁడు, శ్రీకొమరుం డైనమరుఁడు సిద్ధము సుమ్మీ
నీకే నెఱుఁగం జెప్పితి, నీకరణిని గాదె మున్నె యిందునిభాస్యా. ౪౨

అంబురుహవృత్తము.

ద్వారవతీపురిఁ జెన్నగువెన్నుఁడు వాసి మీఱఁగఁ గృష్ణుఁడై
వారిజవాసిని రుక్మిణియం దిల బాలు నీతని మారునిం
గోరి తనూజుఁగఁ గాంచె నరిష్టము గొబ్బునం దగఁ జొచ్చి దు
ర్వారత శంబరదైత్యుఁడు మాయను బట్టి తెచ్చెఁ దలోదరీ. ౪౩

మాలిని. ఘనపవననిధిలోనం గాలముం జెందు మంచు
న్మనసిజుఁ డగువీని న్మానినీ త్రోచి యేగం
న్ఘనఝషకము మ్రింగ న్రక్కున న్మాంసబుద్ధి
న్జనసుత నయశీలా జాలరు ల్పట్టి దానిన్. ౪౪

కం. పసదనముగ నొసఁగిరి యీ, యసురకు నని తెలియఁ జెప్పి యసమేషునిఁ బెం
పెసఁగఁగ మనుపు మటంచును, బిసరుహభవసుతుఁడు చనియె వేడ్కం దివికిన్.

వ. అంత నమ్మాయావతి దృఙ్జనస్తోషణంబు లగుభూషణంబులుం బురుషహృద్గ్రసనంబు లగువసనంబులుందొడి గట్టి కైసేసికొని నిజరూపంబున శంబరునికటంబునకుం జని సరసపోషణంబు లగుభాషణంబుల ని ట్లనియె. ౪౬

మ. దితిజాధీశ్వర నీ వెఱుంగుదుకదా దేహంబులే రెండు నీ
క్షితినాత్త్రైకత నీకు నాకుఁ గొదవ ల్చింతింపఁగా లేవు స
మ్మతి ని న్నెప్పుడుఁ గూడి యుంటుదుకదా మాయంబో నైజంబో నీ
మతికే దోఁచెడుఁ బుత్రశోకజనితోన్మాదంబు వారింపవే. ౪౭

కం. కాంతుఁడ బలువలపున నే, కాంతంబున నిన్ను దీర్ఘకాలము మోద
స్వాంతంబునఁ గూడియు నీ, చింతామతి నాటఁగోలెఁ జిక్కితి తేఁడా. ౪౮

చం. సురుచులు దేఱు మేనులును జొక్కపుబంగరుఁ గేరుచాయలుం
దరహాసితస్ఫుటాస్యములుఁ దాళఫలోపమము ల్స్తనంబులు
న్సరసవిలోకనంబులును సన్నని కౌనులుఁ గ్రాల జవ్వను
ల్ధరణిని బోఁతబొమ్మలుకదా తలపోయఁగ వంధ్యభామినుల్. ౪౯

కం. కని పెంచనిగొడ్రా లగు, వనితవిలాసంబు రూపుఁ బటుయౌవనము
న్గనులుం జనులుం బిఱుఁదులుఁ, జనవులు మొగు లెగసి యున్న శారదరాత్రుల్.

ఉ. మానవభోజనాధిప శ్రమంపడితింగద రేవగల్ సదా
మానితదైవపూజలను మానుగఁ దద్దయుఁ జూపె భారతీ
జాని మదీయసత్కృతవశంబునఁ గర్మవిపాక మాట సం
తానముగాఁగఁ జేకొనుము తావకసద్గతికి న్నిత్యంబుగన్. ౫౧

కం. వైసారిణోదరంబున, భాసురగతి వెడలినట్టిబాలునిఁ గనుపి
శ్వాసంబుగ రక్షించెద, నాసురపరివృఢ యటంచు నంగన వేఁడన్. ౫౨

వనమయూరము. మత్తిలుచు శంబరుఁడు మారుఁ డతఁ డౌట
న్నిత్తి యని నీరనిధి మేలు గన వాని
న్నొత్తుటయు విస్మృతిని మోహపరుఁ డౌట
న్నెత్తగిలి బాలు దయ మీఱ సతి కిచ్చెన్. ౫౩

వ. అంత నారతియు శిశువు ననేకవిధంబులఁ బోషించుచుండ నతఁడు దినదిన ప్రవర్ధమానుం డై యారూఢయౌవనుం డయ్యె నంత నిరుపమాన సౌందర్య

గాంభీర్య స్థైర్య ధైర్య శీలాదివిశేషంబుల మెఱయుమనసునఁ బుట్టిన వానిపై మన సునఁ బుట్టినమరులు నిలుప లేక యొక్కనాఁడు కేళీగృహంబున కాతనిం దోడ్కొని చని ప్రస్తావోక్తుల ని ట్లనియె. ౫౪

మ. కనరా మాసుత మాధురీమహితవాక్యంబు న్నీవనం గౌఁగిటం
బొనర న్నెక్క వదల్చి ముద్దు లిడెఁ దాపుం జేరి యీసాధ్వి యూఁ
గనరా మా సుత మాధురీమహితవాక్యంబు న్నీవనం గౌఁగిటం
బొనర న్నెక్క వదల్చి ముద్దు లిడి దాపుం జేరదే సాధ్వియై. ౫౫

ఉ. ఏధితసమ్మదంబునఁ బ్రియేశ్వరిఁ గూడి సతీవిభుండు తా
రాధవు నీవు మాధవుఁడ రామరొ నే నని ప్రీతిఁ జూపి ను
త్సేధము లేక మై పెనఁగుచిత్రము గంటివె మాకుమార యూ
మా ధవుఁ డెట్లు చేసినను మానితమే భువనంబులోపలన్. ౫౬

చం. చివురుఁగటారిరౌతు త్వరఁ జేసెడి జాగిఁక నేల రార మా
ధవుఁడవు జాయలం దలఁపు తద్దయు రక్తి నటంచు నల్లవీ
యువతులు వేఁడి గూడి రొగి నుత్సవ మొప్పఁగఁ గృష్ణుఁగంటె మా
ధవుఁ డెటు చేసిన న్ఘనత దప్పునె యొప్పులకుప్ప చెప్పుమా. ౫౭

వ. అని తా నాడువాక్యంబులకుం బ్రతివచనంబుల నేమియు నెఱుంగని వాఁడునుం బోలె నర్థాంతరంబుఁ గల్పించునయ్యంచువిలుకానికి న్నన్మథోద్రేకావహ తట స్థసంభారభారవాహి యగునుద్యానవనంబునకుం దోడ్కొని చని యందలి విశే షంబులం జూపుచు నర్మాలాపంబుల సల్లాపంబు లాడుచు. ౫౮

సీ. వలుఁదగుబ్బలమీఁదిపయ్యెద జాఱించు జాఱించి సవరించుఁ జక్క నొత్తుఁ
దళతళ మనుగండఫలకంబు మెఱయించు మెఱయించి తటుకున మఱుఁగు సేయు
ముసిముసినగవుల మురిపెంబుఁ గడుఁ జూపుఁ గడుఁ జూపి భ్రూలతల్ముడుచుముడిచి
కనుఱెప్ప లల్లార్చుఁ గడకంటఁ దిలకించుఁ దిలకించి పులకించుఁ గులుకు లొలుక
లీలఁ గాల్మెట్టియల రవళింపఁ గొట్టు, దిట్టతనమున నతనిమో మట్టె చూచు
గోల యావేళఁ దమిఁ జాలఁ దాళ లేక, చిత్తజాతుని కేళి కై తత్తఱిలుచు. ౫౯

వ. మఱియు. ౬౦

చం. సవిధరసాలసాలగతజాతిలతాంతచయాపహారకై
తవమున నెత్తెఁ గేలు వనితామణి మందసమీరణాహతి
న్యువతిపయంట జాఱఁ గనె నుబ్బిన నుబ్బున గుబ్బలుం గరం
బవిదితసూక్ష్మమధ్యము మహారుచిరోజ్జ్వలబాహుమూలముల్. ౬౧

వ. ఇట్లు వోలంచినఁ గాంచి కుత్సించుచు నమ్మించుఁబోఁడితోఁ నించువిలుతుం
డి ట్లనియె. ౬౨

ఉ. పెంచితి విన్ని నాళ్లుగను బ్రీతిని మాత యు దేమిసేఁత నేఁ
డించుకయేని భీతి గణియింపక కాముకరీతి నీతి బా
లించుచు నాముఁబెంచి తెద లేదె వివేకవిచార మింత నకా
గాంచవా? నీకుమారుఁడను గానొ? నిజంబుగఁ దెల్పు భామినీ. ౬౩

ఉ. మానితసద్వ్రతంబులను మానక యెప్డు నొనర్చు చున్ననో
మానిని మానసంబునను మా ముద మందుదు సాధ్వి వంచు స
న్మానముతోడ నిట్టియెడ మానము నానయుఁ దూల నిస్సిరో
యానొకో యాలు వెంచు మగనాలికి నీవెలయాలిపోఁడుముల్. ౬౪

మ. తగ దమ్మా సుతుతోడిసంగమునకై తర్షంబు పాపంబు నేఁ
త గదమ్మా పరివారు విన్న వసుధం దర్పించి నవ్వంగ రోఁ
త గదమ్మా మఱి జీవితంబు మరియాదా చూడవా నాకుమా
తగదమ్మా పయి నీకుమారుఁడను గాదా యమ్మ చింతింపుమా. ౬౫

శా. కామోత్కంఠత నన్యకామినులు ద న్గాంక్షించినన్ ధీరుఁడై
భామా పూరుషుఁ డొల్ల కుండినను దద్వ్యాపారము ల్సెల్లునే
భామా సంచితపాపభోజి యగుఁబో వారింపఁగా లేక హా
కామాంధో ననమీాక్షి తే యనెడు వాక్యం బెప్పుడు న్నిల్వదే. ౬౬

చం. అబల లటంచుఁ గామినుల యాశ్రయుఘుం దగఁ బొంది వారి నో
యబలరొ భామ్మలంబలె ననంగుఁడు నిచ్చలుఁ ద్రిప్పు చుండు వా
రి బహువిధంబుల న్వర్తి హరీ మరుగాసిని వాసిఁ బాసి భూ
మి బలిమి నొగ్గఁ బూరుషులు మృత్యువు మాన్చునె మారుఁ డెందులన్. ౬౭

కం. మారుఁడు దుర్మార్గుం డాచారవిహీనుం డెఱుంగఁ జాలఁడు వావి
న్మారునిబారికి వెఱచుచు, నోరామా పాపమునకు నోర్చితిగదవే. ౬౮

చం. అన విని పిన్ననవ్వు తొలఁకాడఁగ ని ట్లనుఁ జేరి మీానకే
తన తగునొక్కొ సాధ్వి యని తద్దయుఁ బల్కియు నిష్ఠురంబు ప్రాఁ
గనె నినుఁ గోరి రాఁగఁ బలుకం జులుకందన మొందఁ జెల్లునా
విను వివరింతు నాచరిత వేద్యముగా మొదలింటినుండియున్. ౬౯

ఉ. మారుఁ డనంగ నేఁడు గనుమా రతికిన్ హృదయభ్రమాకరుం
డారమణుం డెవండు జగదాళిజనాళిముదావహావహా

ధారుఁ డెవండు సూనశరధారుఁ డెవండు దలంప నన్నియు
న్ధారణి నీవెగాక మదనా తగునాయతివిప్రలాపముల్. ౭౦

ఆ. అంకులాడి ననుచుఁ గొంకక వలికితి, బొంకులాడ జలచరాంక యింక
నీదుపూర్వకథయు నాదువృత్తాంతంబు, తెలియఁబఱుతు వినుము తెలిసికొనుము.

లయగ్రాహి. కాంతుఁడ వచింతు విను కాంతుఁడవు నాకు రతికాంతుఁడవు
నీవు రతికాంతను జుమా శ్రీ
కాంతునికుమారుఁడవు కంతుఁడవుకాని యమరాంతకునిపుత్త్రుఁడవె
భ్రాంతి విడు ము న్నా
ధ్వాంతదితిజాంతకుతపోంతకమతిం జని దురంత మగునార్తివశ
యంతముఁ గన న్నే
స్వాంతమున నెంతయును జింతిలుచు నంతకహరాంతికముఁ జేరివ్యాధ
ధ్యాంతరములోనన్. ౭౧

లయహారి. వినయమున మనమునను వినతు లొగి నొనరిచితి నినవనజవనజనయ
నుని హరుని నంత
న్మనిగతిని ఘనముగను గని యతనుముద మెదను బెను పసర సుముఖు
తను ననుగుఱిచి బాలా
వనటలను వగవకుమి మనసిజుఁడు పరజననమునను దనుయుతముగను
నినుఁ గవయువాఁ డౌ
ననుచు సెల వొసఁగఁ జని మునివరుఁడు విధిసుతునిపనుపునను దప
ము లొగి నొనరుచుచు నుంటిన్. ౭౩

కం. హరి కృష్ణుం డయ్యెను శ్రీ, హరిణాయతనేత్ర భైష్మి యయ్యెను నీ వా
వరదంపతులకుఁ బుట్టినఁ, బురుటింటనె నిన్నుఁ దెచ్చి పోకార్పంగన్. ౭౪

కం. శంబరుఁడు వేగ జలనిధి,శంబరముల నిన్ను వైవ సరగున మ్రింగె
న్నంబరచర మొక్కఁడు ని,క్కంబుగ నీపురనివాసకైవర్తజనుల్. ౭౫

ఆ. దానిఁ బట్టి తెచ్చి కానుకగా నిచ్చి, రీనిశాటునకు మహానసమున
దానిఁ దఱుగ నీవు తడయక వెడలిన, బ్రహ్మతనయబోధవలన నిన్ను. ౭౬

ఉ. రక్కసు వేఁడి సాఁకితిని రాజతనూప సుతుండు గావు నా
కక్కట యీశ్వరుండవు యథార్థము వైశమ వీనిఁ ద్రుంచి నీ
నిక్కపుఁదల్లిదండ్రులను నెమ్మదిఁ గానఁగఁ బోవు టొ ప్పగుం
డక్కులు కావు నమ్ము మది నారదవాక్యము నమ్మి మన్మథా. ౭౭

ఉ. కాన సురారి వేగ జముఁ గానఁగఁ బంపి భవజ్జనంబులం
గానఁగఁ బోవు టొప్పు నినుఁ గానక నీతలిదండ్రు లెంత శో
కానలదహ్యమాను లయి యక్కట కుందెదరో మనంబున
న్మానుష నీతి గాదె ననుమాన మిఁక కేటికి నీదుబోఁటికిన్. ౭౮

మత్తకోకిలము. పుట్టి పుట్టక మున్నె ముద్దులఁ బొల్చి యొప్పెడుచక్కనా
పుట్టి ని న్నరుటింటఁ బాపెనె పాపి యేవిధి యంచు నే
పట్టునం నినుఁ గానకే ననుఁ బాసితే సుత యెవ్వఁడో
కట్టి కైకొని పోయె నంచును గాంత కుందక యుండునే. ౭౯

కం. కొడుకండు ప్రక్కలోఁ జను, గుడువఁగ నెవ్వండొ కోడు గుడువఁగఁ జేసె
న్నడయక యని మిడుకుచు వెత, గుడుచుచు నీతల్లి యెంతఁ గుందెడినొక్కో. ౮౦

కం. క్రేపును బాసినగో వనఁ, బాపం డగునిన్నుఁ బాసి పటుదుఃఖముచేఁ
దాపముఁ జెందదె కుందదె, యాపరి నీతల్లి సుతుఁడు యా పతె ననుచున్. ౮౧

వ. అని హారితనయునికిఁ దనయునికి సర్వంబు నెఱింగించి శంబరవధోద్యోగంబు
నకు నియోగించి నిజపితృదత్తం బగుసర్వమాయావినాశిని యగు మహామాయ
నెఱింగించి సర్వసాధనంబులు జతఁగూర్చి యిచ్చిన. ౮౨

కం. క్రుద్ధుం డై సంగరసం,సిద్ధుం డై దనుజుఁ బిల్చెఁ జిత్తజుఁ డంతన్
యుద్ధంబున కసుర న్న,న్నద్ధతఁ దా నేగుదెంచి నగుచుం బలికెన్. ౮౩

ఉ. ఓరి కుమార ఘోరకదనోర్వి నిగర్వనిశాటఝాటప్ర
ధ్వీరమణావతంసు సురవీరశిరోమకుటస్ఫురన్మణీ
భారచితారుణాంఘ్రినఖభాస్వరు శంబరు నోర్చి నీవాకో
పోరఁగఁ జాలువాఁడు నినుఁ బుచ్చినవారి నెఱుంగఁ జెప్పుమా. ౮౪

చం. ఘనకరుణాతిరేకమునఁ గైకొని చెప్పెద శైశవంబున
న్ననియెదు గాన నామనికి మానుమ యాలము ప్రాణము ల్ధరి
త్రిని ధరియింప నిచ్చ గలదేనియు జీవము భార మైనచో
ననికిఁ గడంగు మీ వెఱుఁగ వాత్మపరస్థితితారతమ్యముల్. ౮౫

మ. అకృతాస్త్రుండవు బాలుఁ డాహవసువిద్యాప్రౌఢియు న్లేదు బ
ల్లునకుమారుండవు నీవు సంగరకళాస్ఫూర్తిం దగం జూపు దే
యకటా యోర్వఁగలావె నీ మఱలుమా యారీతి కా దన్నచోఁ
బ్రకటాస్త్రప్రచయప్రహారముల రూపం బార్పెదు న్వాలిశా: ౮౬

శా. నీబుద్ధిం జను మెవ్వరేఁ బనిచిరో నీతిం గనం జాలకే
యో బాలా రుచిరాంగు నిన్నలయఁగా నూహించు నన్నొల్లకే
యాబిబ్బోకవతీవమచోద్ధురిను న్వాక్షించితే యిస్సిరో
స్త్రీబుద్ధిః ప్రళయంకరీ యనుట నోరీ బుద్ధి నూహింపుమా. ౮౭

వ. అనిన విని మన్మథుండు కోపంబున నిట్లనియె. ౮౮

చం. పదరఁగ లాభమా పలువ పల్కఁగ నేల శిశుత్వమందు న
న్నుదధిని వైచినాఁడవు రణోదధి నేఁ డిదె ముంతు నిన్ను నే
బెదరక నిల్వఁ గల్గినను బెద్దయుఁ జిన్నయు నౌట మాటలం
బొదలునె నాదుచేతిబలువుం గను మప్పుడు నీకె తోఁచెడిన్. ౮౯

చం. పుడమిని బిన్న పెద్దతనముం గణియింపఁగ నేల చూడఁగాఁ
బిడు గది యెంత కూలుపదె వే ధరణీధరము న్నృశంస ని
న్నడగనఁ జేయుట ల్ఘనమె నాకు వృథా పదరంగ నేలరా
కుడిచెద నింతలోపలనె కూరలకు న్రుచి చెప్ప నేటికిన్. ౯౦

కం. మాయలు నాకడఁ జెల్లవు, మాయింపుదు నిన్ను నిశితమార్గణతతుల
న్నాయాపి యనుచు నాతఁడు, పాయక సాయకచయంబుఁ బరఁగించె వెసన్. ౯౧

వ. ఇట్లు శంబరుండు నిశితకాండంబుల నిగిడింపఁ గన్నుఁగవ కెంపుపెంపున సొంపా వహింప నిలింపులు గుంపులుకట్టి తొంగి తొంగి నింగిఁ జూడ సుమనఃకోదండుండు మండలీకృతకోదండుఁడై కటకాముఖంబు కర్ణపాళి నలంకరింప దొంతరలుగఁ బరఁగించుశరపరంపర నడుమన వారించుచుఁ బ్రదరకరంబు లగు ప్రదరంబుల నొప్పించి మైమఱువు సించి గుణంబుఁ ద్రెంచి సూతునిఁ ద్రుంచి రథ్యంబుం నొంచిన నయ్యోడగునకుం దప్పించుకొని కుప్పించి యెగసి శాంబరీధ్వాంతప్రచ్ఛన్నుండై యదృశ్యంబగురూపంబున. ౯౨

సీ. శంపాలతాయుతజలదంబులై వడిఁ బిడుగులు వర్షించుఁ బెలుచ నుఱిమి
ఝంఝూప్రభంజనసత్త్వవిస్ఫురణను దలదిమ్ము గొన వీఁచు దలఁగ కంత
భూరిభూధరరూపధారియై తటుకున ధర నిపాతంబుగఁ దలఁకఁ జేయుఁ
జండానిలోపేతసప్తార్చి చెలువున దెస లెల్లఁ దానయై వెస జరించుఁ
జూడఁ జూడంగ శైలాటసూకరాహి, కాసరవ్యాఘ్రనాగమృగాదనాతి
వేలరూపంబులను వేనవేలు గాఁగఁ, బూని యని సేయు నారతీజానితోడ. ౯౩

ఉ. తా నవమాయలం జెలఁగి దానవభర్తయు గాఁగ లోనఁ దాఁ
దానవవైరిసూనుఁడు వ్యథామతి లేక క్రుధాన్వితుండునై

మానుగ నేసె దివ్యశితమార్గణము ల్దివి నింప శాణాసం
ధానముఁ దత్ప్రయోగముఁ గనం బడ కుండ నుదాత్తసత్త్వుఁడై. ౯౪

శా. దానోపాసనసర్వసత్త్రినులపొంత న్నీ వుఱ న్మ్యక్రశి
ష్యానూనాసువు లూడ్చనేనో యన నేలా మున్నె యేఁ బోదు ని
ద్దానంగూల్తునె ద్రోహి నం చడఁగ శ్రోత్రం బన్న డాచేయి యే
లా నే ము న్ననురీతి నేసెఁ గరము ల్సవ్యాపసవ్యంబుగన్. ౯౫

కం. శరవిసరము మెయి నాటిన, ధరపైఁ దా నల్లఁ గ్రక్కి తటుకునఁ బడె శం
బరగాత్రము దివినుండి మ, దిరమతి యరి సచ్చె ననుచుఁ దిరముగ నుబ్బెన్. ౯౬

కం. మానసమున నుప్పొంగుచు, మానసభవు డున్న యంత మానిని రతి స
న్మానముతో వచ్చి యిటులు, మానుగ వాక్రుచ్చె మానుమా యిఁక రణమున్.

కం. శంబరుఁ డీల్గెను భవదా, శంబరమున నీకె గా కడంక గెలువఁగా
నంబరచరులకు వశమే, శంబరచరచిహ్న యింకఁ జనుదమె పురికిన్. ౯౭

చం. పలుకుచు నుండ నచ్చటికి వచ్చె రతీసతి దానిఁ జూచి లోఁ
దొలఁకుచు నుండ నబ్బురము దోఁపక సంయమితక్రియుండు నై
జలజశరుండు నిల్వ ననె సంశయముం దొలఁగంగఁ బెట్టి యా
జలరుహనేత్ర శంబరునిశాంబరిఁ జిక్కితివే మనోహరా. ౯౯

కం. కైదువు కైఁ బాసిన ము, త్తైదువ నేఁ గాను జుమ్మి యాసురమాయా
వేది వధింపుము సంజను, గాదుకదా దైత్యు గెల్వఁగాఁ గుసుమశరా. ౧౦౦

కం. బాలిక గాఁ డీతం డను, నాలోనన మాయ మాదె ననురయు మదనుం
డాలోలాక్షిబోధలఁ, దా లోఁ దెలి వొంది తీవ్రతరకోపమునన్. ౧౦౧

వ. మయదత్తమాయాశ్రయవిజృంభణుం డగునయ్యసురపై సర్వమాయావినాశిని
యగుసాత్త్వికమాయుం బ్రయోగించిన. ౧౦౨

కం. మాయాతిమిరము వాయుడు, మాయురె యని యమరు లెల్ల మఱిమఱి పొగడం
జేయని మృత్యువు డాయఁగ, డాయఁగఁ జనుదెంచె సత్కుతారకరుండై. ౧౦౩

కం. బ్రదుకుదు లేరా యనుచును, జనలను మిడుఁగురులు సెదరఁ జయ్యన వైన
న్మదనుఁడు పో నడిచెను దన, గదచేఁ దుము రగుచు నేలఁ గలయఁగ బ్రాలన్.

ఉ. అంతటఁ బోక వీఁక దనుజాంతకసూనుఁడు పూర్వదేవనా
థాంతికభూమికి న్దశదిశాంతసరత్ప్రకటాసిగోచు ల
త్యంతభయంబు గొల్ప రయ మారఁగ దాఁటి తటుక్కున న్శిరం
బింతటఁ ద్రుంచె మింట భళిరే యని వేల్పులు సంస్తుతింపఁగన్. ౧౦౫

కం. చిగురాకుబాకుచేతను, జగముల సొలయించునట్టిజగజెట్టికి నా
పగిదిం గత్తిం గొని యొక, పగతుని హరియించు టెంతపని తలపోయన్. ౧౦౬

కం. పాడిరి గంధర్వులు గుమి, నాడిరి తెఱగంటినెలఁత లరుసముతోడం
గూడిరి నాకవిటీవిటు, లోడిరి రక్కసులు బెసుల నుండఁగ నంతన్. ౧౦౭

వ. ఇట్లు శంబరు నధించి మించునించువిల్తుకానిఁ గొంచు రతీదేవి యోగ బలవే
గంబున ద్వారకానగరమార్గంబుఁ బట్టి వినుపీథిం జనుదెంచుసమయంబున. ౧౦౮

కం. ఆతపనీయనుచేలుం, డాతపసులగొంగఁ జంప నాతపనీయా
గాతతవాసపుఁ డంపిన, యాతపవారణము లనఁగ నలరె ఘనంబుల్. ౧౦౯

వ. ఇట్లు చని ద్వారకానగరంబుఁ గాంచి పారావతంబులచందంబున రుక్మిణీశుద్ధా
తంబున డిగి కక్ష్యాంతరంబుల దాఁటుచు లోపలికిం జనువారలం గాంచి. ౧౧౦

ఉ. నీరదనీలగాత్రు నళినీదళపత్రవిశాలనేత్రు శృం
గారరసైకపాత్రుఁ దతకర్బురచేత్రు విశాలవక్షు నీ
హారమయూఖవక్త్రు ద్విరదారిపమధ్యునిఁ గాంచి యాదట
న్నారసలోచనాచయము చాటున డాఁగెను గృష్ణుఁ డన్భ్రమన్. ౧౧౧

కం. వెన్నుం డీతం డందురె, యెన్నఁటికిని గాఁడ యీతఁ డెవ్వండో యా
వెన్నునిఁ బోలెడి నందురు, పన్నిద మే మందు రైనఁ బడఁతులు తమలోన్. ౧౧౨

సీ. జలజాక్షి యీతండు జలజాక్షుఁ డైనచో నంచున నెవ్వతె మించుఁబోఁడి
యిప్పుడు వెలసెడియీపదార్వేలును జాలక తెచ్చెనే బాల నొకతె
భాసురాంగుండు శ్రీవాసుదేవుం డైన భైష్మిని గని యేమి పలుక కుంట
శ్రీహరిలీలలు చిత్రము ల్గావె యీచెలియఁ గూడుచు మదిఁ దెలియకొఱకు
నెన్నఁ డీసౌధంబు నెఱుఁగనియట్లుగాఁ గలయఁ జూచుట కేమికారణంబొ
యేమూలలందును నెవ్వ రే మందురో యని పొంచి చూచునే వనజనయన
మేను డస్సినయట్లు కానిపించెడిఁగదే యెందఱఁ గూడెనో యిందుముఖుల
ననుచుఁ దమలోనఁ గా దని యవు నటంచు, గుసగుసలువోయి డగ్గఱి కిసచరణలు
పలుక జంకుచు నుండంగ వారిఁ జూడ, వచ్చెఁ గలకంఠి రుక్మిణి మచ్చెకంటి. ౧౧౩

వ. ఇట్లు వచ్చి వారలం జూచి నివ్వెఱ చెంది దగ్గఱి యున్న చెలియతో నిట్లనియె.

మ. సకియా యీమృగరాజమధ్యముఁడు రాజత్సారసాక్షుండు మే
చకవర్ణుండు ప్రలంబబాహుఁడు విలాసస్ఫూర్తి సీతండు హా

టకచేలు స్ఫురింపవా డెవఁడో వేడ్క నొసంగె నీమేడలో
నికి నీకైరవమిత్రవక్త్రఁ గొని తన్వీ చూడ వింతయ్యెడిన్. ౧౧౫

ఉ. ఆవలెవాటునీటును నొయారపుఁజూపులు నిక్కుమూఁపులు
న్నేవలరక్తివాక్యములు నించెడిమోముఁ జెలంగు చుండఁగా
నీవగకాఁ డెవండొ యిట కేటికి వచ్చెనొ ముద్దుగుమ్మరో
యావలరాజుఁ బోలు మఱి యావల రాజును గెల్చు రూపునన్. ౧౧౬

ఉ. అన్నులమిన్న యీతనిహొయ లనుఁగొన్నను వెన్నుసుద్ది యం
చెన్నఁగఁ బోలుఁ బాలు మఱి యీతనిఁ గన్న స్రవించెఁ జన్నులం
గన్నుల హర్షబాష్పములు గ్రమ్మెడిఁ బైపయి నేమిచిత్రమో
కన్నకుమారుఁ గన్నగతిఁ గాంత మనం బలరారెడిం గదే. ౧౧౭

కం. ఈతనివిలాసగరిమం, బీతనుసౌందర్యమహిమ యేపును రూపం
బీతనుమధ్యముఁ జూడఁగ, నాతనయునిఁ బోలఁ జాలు నాళీకాస్యా.౧౧౮

తే. నేఁటిదాఁక నతం డొప్పి నీలవేణి, బ్రతికియుండిన నీతనిపాటి గాఁడె
ప్రాయమునయందుసురచిరప్రాయమందు,భావమునయందుసుషమాప్రభావమందు.

కం. పాపాత్మం డెవ్వండో, పాపఁడు నాప్రక్క నిదురఁ బండినవేళం
బాప మన కెట్లొ కొని చనె, వాపోయితిఁ బెక్కువగల వనజాతాక్షీ. ౧౨౦

వ. అని. ౧౨౧

కం. నాకొడు కితం డనఁ జనుఁ, గా కుండిన సపతు లెల్లఁ గడుకొని నగరే
సాకుగఁ గొని యని మిన్నక, యాకుండిననాథపుత్త్రి యటు నిటు నిలుచున్.

వ. ఇవ్విధంబున డోలాందోళితమానసాంభోజ యై భోజరాజపుత్త్రి యున్నసమ యంబునఁ గృష్ణుఁ డవ్వార్త యెఱింగి సకలబంధువులం గూడి యచట కరుగు దెంచి వారలఁ గనుఁగొనుచు నూరకుండె నింతలో నారదుండు వచ్చిన నర్ఘ్య పాద్యాదివిధులం బూజించి యర్హాసనాసీనుఁ గావించి కృష్ణుం డి ట్లనియె. ౧౨౩

ఉ. ఎక్కడ నేమహాత్ములో మునీశ్వర తావకపాదపద్మము
లక్కఁగఁ గొల్చు చుండి కడుధన్యత నొందిరి యిన్నినాళ్లుఁ దా
మిక్కడి కేగుదేరనిప నేమియొకో దయఁ దప్పినారుగా
యెక్కడ నేవిశేషముల నేర్పడఁ గంటిరొ చెప్పరే దయన్. ౧౨౪

కం. నారద మిముఁ గన రతి ము, న్నారద చిత్తంబులోన హాళియుఁ గడుఁ జె
న్నారద వీరల మును క, న్నార దయాశీల చెపుమ నా కెవ్వారో. ౧౨౫

వ. అనిన నారదుం డి ట్లనియె. ౧౨౬

కం. ఫీ రెవ్వా రనుచు నిరా, బారిని న న్నడుగ వలెనె వలనుగ నీకు
న్నేరమి గలదే వసుధా, ధారుండవు జీవిజీవితంబవు కృష్ణా. ౧౨౭

ఛత్ర బంధము.

కం. జానవనదవకఖగపవి, భానవపరపదపరపవవనజాసనమా
మానసజానవభనకా, కానభ వనభా విపగఖ కవదననజా. ౧౨౮

శ్వేతచ్ఛత్రము.

దోధకము. రామహామస్తమరాపటయుక్తా, శ్రీమదమచ్చమరీకచకస్థా
నామజరక్షురసారమణీపా, యామరశస్త్రజనార్దనకృష్ణా. ౧౨౯

సుగంధివృత్తము.

తారహీరహారభూషధాతతాతపూతకా, కారణస్వరూపపాదకంజజాభ్రదీర్ఘికా
కారికావినాశకాసుకామితప్రదాయకా, కారుమూపమిత్రనీలకంఠశస్తనామకా.

గుచ్ఛబంధము.

మాణవకవృత్తము. రామకుమారాసమరా, రామసమజ్ఞాద్రుమరా
రామద్రుమాద్యాగమరా, రామగవస్త్రాకుమరా. ౧౩౧

గోమూత్రికా బంధము.

కం. సురవరసంస్తుతవదనా, కరిరాజనుతా ధృతదరకరి లేప హారీ
మురహర నిస్తులవచనా, గిరిరాజభృతాజితపరకిరిరూపహారీ. ౧౩౨

ఖడ్గ బంధము.

కం. ఖరమురసురపరవరహర, కరధృతదరచక్రనందకకమలచాపా
సురహృన్మత్సంధాయక, కరపదసాహస్రనీలకంధరరూపా. ౧౩౩

పాదగోపనము.

కం. రామా మాధవవర తే, జామానవరత్నసముఖశరజవిభాస
ద్ధేమకసుభూషధామా, రామావరజానరసఖరవిసమనుపమా. ౧౩౪

నాగ బంధము.

చం. నరహరిణాంకధీరధరణారవివిశ్రుతరూపకాపరా
స్తరపలలాశివారహననానరమిత్రకన్యాయకోవిదా
దురితపరావిదూరభయతో యదచర్మశిహారిభూమిపా
వరదయనంతశౌరిహరివారిజపత్రవిశాలలోచనా. ౧౩౫

## ద్వాత్రింశద్దళపద్మబంధము.

సీ. సురుచివిసుభగసంస్తుతరణశ్రీభూపద్రవగేహభూసూతిదాపితగుణ
నగవైరివినుతతృణావర్తహాధనుర్భంగదావహారాయనంగతాత
వనచారిపోషకపాపనిర్వాపకహాటకలాపరమారరాజ
రిపుభీషణాశూద్రజపనసురుచిరఖరమురారిసద్బింబశమితహరిణ
పాగబవినాశభూతానువాలిధీవి. శాలబకదర్పధుతమహాశిలిమాళి
రవివిసాదరయచలజాధవజమహిప, శ్రీకరాభర్మపటజధీరాకభవన. ౧౩౬

తోటకము. సురసూరినుతాపరశూరహతా, దరధర్మవిభూషితదానపరా
పరిపాలితసామజభద్రగుణా, హరిహారిసుబింబవిహారపరా. ౧౩౭

## ఏకద్విత్రిచతుష్పంచషడష్టాక్షరసీసము.

కాకకాకాకుకుకౌకకైకాకుకకాకాకకేకౌకకాకకేక
శేశాశశేశాశశాశశశిశుశశాశిశుశిశిశాశాశశేశశాక
కరికారికాకారికరికారికాకారికారకారకరారికరకురైక
మారమామామనోమామానినీమనోరమణమనోరామరామరామ
నందనందననారాయణాయరీణ, మానినుతనామతతమానితా నరేంద్ర
జానకీవల్లభా లోకజనక జనక, బాలగోపాల రుక్మిణీప్రాణలోల. ౧౩౮

## హరిగతిరగడ.

శ్రీరమణీమణిహృదయాంబుజసరసీరుహనాయక కమలానాయక
సారససంభవసకలమునీశ్వరశర్మవిధాయక కమలానాయక
హరి హరనుత నిజవాహనసంఘటితైకవినాయక కమలానాయక
స్థిరవరసౌందర్యకళాపటునిర్జితసుమనాయక కమలానాయక
మ్రొక్కెద కావవె కరుణాసాగర ముక్తిసుదాయక కమలానాయక
యక్కట నీవే దిక్కని నమ్మితి యదుకులనాయక కమలానాయక
త్రిదశాసురముఖరాంబకసాధ్వసకృతిసముదాయక కమలానాయక
హృదయాంబుజసన్యస్తముదర్పిత హితసముదాయక కమలానాయక
యనఘులఁ బ్రోచుట యదియును మే లగు నటమటు సేయక కమలానాయక
ఘనపాపాత్ముని రక్షింపవె దయఁ గడకును ద్రోయక కమలానాయక
మానితగతి నా వెంబడి నుండవె మతి నెడఁబాయక కమలానాయక
సూనృతవాక్పరిపాలనదీక్షా సుగుణామేయక కమలానాయక
కోపులఁ బాపుల భూపుల దాపులఁ గోరిక డాయక కమలానాయక

బాఁపనిపాపని బ్రతికించినయూప్రాపని పాయక కమలానాయక
విమతక మ్రొక్కెద ననవరతంబును వేఁడుసుగాయక కమలానాయక
ముదుఁగనిపరమసుభక్తజనాళికి ముక్తివిధాయక కమలానాయక
మునుకొని జగముల నన్నిటి నీవే మోసెదు నాయక కమలానాయక
గనుఁగొన సర్వస్వరరమ్యుఁడవయి మ్రోసెదు మ్రోయక కమలానాయక
వంచించినమారీచునిఁ జించినవంచిశగాయక కమలానాయక
వంచించినయుజు వంచించినశుభభాసంధాయక కమలానాయక
సంతతపరివృతసురవరహరవిధిశరజవినాయక కమలానాయక
మంతనమున నిను మఱవను సీతామహిళానాయక కమలానాయక. ౧౩౯

దండకము శ్రీమానినీచిత్తకంజాతమిత్రా మహాదిత్యకంజాతకంజాతనేత్రా మునిస్తోత్రపాత్రా వినీలాభ్రగాత్రా హరిద్రాభనేత్రా ధృతాదభ్రగోత్రా యవిజ్ఞాతగోత్రా పతద్రాజపత్రా పయోరాశిసుక్షేత్ర శ్రీభార్గవీక్షేత్ర లోలా దయాశీల గోపాలగోపాలబాలా సుగోపాలబాలామణీభూరివక్షోజకస్తూరి కాకుంకుమోపేతసచ్చేలకా యిందిరాసుందరీమందిరాయిందుకందర్పసత్సుందరా వందికర్మందిరాడ్బృందచేతోరవిందప్రదీవ్య న్మిళిందామిళిందాభసుశ్యామ వందారుబృందారకా నందకానందహృన్నందకా నందకారీ సుధాబిందుసందోహ నిష్యందసానందసామందసచ్ఛందనో చ్ఛీతవాక్కుందళేందిందిరాపాంగసుస్యంద నాస్కుందనోన్మంథసంక్రందనారీంద్ర నిస్తంద్రయోగీంద్రభోగేంద్రభోగీంద్రతల్పా ముకుందాసనందాదివంద్యా వినింద్యాకుభింద్యా జగత్తుందిగోవింద కుందేందుమందారమందాకినీపూరపాటీరనీహారనీహార భూమీధ్రవాణీసతీస్మేరగౌరీ మనశ్చోరతారావళీహారమల్లీలసద్వారసద్ధారవప్రోదినీకాశసీకాశసత్కీర్తివిస్తారతాపింఛవిస్తారభూషా సుధీఘోషదైతేయవిద్వేష సత్యావృదంభోజినీపూష రత్నాకరోద్వేలదుర్వారదుర్గర్వసంశోష సీతాంగనాశ్లేషసంతోష లంకాపురీప్లోషఘోషాంగనామానభంగక్రియాశోష నిర్దోష దోషాచరాధీశకంఠాటవీలుంఠనోత్కంఠ వైకుంఠ వైకుంఠసన్నీలకంఠాదిసంశస్తప్రదానా ప్రదానప్రధానా ప్రధానా ప్రధానోన్నిదానా మణీమంజుమంజీరఝుంఝుంఝుళారావసంసూచితాలస్యసంచారణా ధూతకాంచీలసత్కింకిణీకంకణైకావళీలంబమానోజ్జ్వలత్కంఠభూషారవస్తేనచిత్తాంగదావాపకప్రోల్లసత్కర్ణికా పత్రపాశ్యా శిరోరత్నధాళధ్ధళీధళ్యభాఃపూర సత్కౌశికీభూతనేత్రాంతసంభూతకృష్ణాలికావాగురాబద్ధకృష్ణాంజరీటావళిం బోల్చుదైతేయబృందంబు నీచూపుచందంబు నీచిన్నిహాసంబు సంపద్విలాసంబు నీగుబ్బచన్దోయి చెల్వారుకందోయి పుష్పాస్త్రబల్దూపుల న్మాపుల న్మాపునీచూపు నీపల్కు పెందీపు

నీకుల్కులం దేవు తూఁగాడుపయ్యంట మోహంబు లో నంటఁగాఁ జూచి
తేతెమ్ము నా నాడ కే ధైర్యముంగూడ కే యున్నఁ గై నున్నపీయూషముం దేవతా
శ్రేణికింబోయవే బోయ వేఁడంగనే స్నేహముం జేయవే స్నేహముం జేయవే
రాజునుంజేయవే వైరిదాయాది దాయాదునిం బాసి శోకంబునం గాసి నీద్వా
రముం డాసి మాం పాహియం చేడ్చినం బాఁపఁ డొక్కండు వేవేగ జీవాన్వితుం
జేయవే పాపనిం బాఁపనిం బాము నిన్జూచి తాఁ దోఁకతోఁ దాఁచి బల్కొలిల
గీచి హాలాహలం బూఁచిన న్వచి భోగాళిపై నెక్కి నీకాలిచేఁ ద్రొక్కి ధింధిమ్మి
తైతక్క తోంధిమ్మిధింధిమ్మినాఁ దాండవం బాడఁగాఁ బాడఁగా గానముం గాన
మున్నెప్పుడే నిట్టి దంచు న్వితర్కించుచు న్నెత్తురు ల్గ్రక్కుచు న్మూర్ఛలం జిక్కుచు
న్లోపల న్నుక్కుచు న్నిత్తికిం దక్కు చుండంగ నాపాఁపపాల్తు ల్దగ న్వేఁడఁబో
వీడవే వీడ వే దుస్ససేనుండు తాఁ గట్టువస్త్రంబుఁ దీయంగనాకృష్ణ హా
కృష్ణ హాకృష్ణ హాద్వారకావాస క్వాసి ప్రభో యాదవశ్రేష్ఠ యం చెన్నఁగా
నెన్నఁగా రానికారుణ్యముం జేసి మానంబు కాపాడవే ప్రేమతో మెక్కవే గొల్ల
యిల్లాండ్రు తా రుట్టిపై నుంచి యున్నట్టి బల్వెన్నల న్వెన్నెలం దన్నుల న్వెన్నె
లం గూడి క్రీడింపవే వారితో వారితో దారగర్వాత్ముఁగాఁ జేయవే యాబలా
రాతి వే హా బలా రా తివే పాదసంస్పర్శమాత్రంబునం జేయవే గోలఁగాఁ
గోలఁగాఁ జేసి నీ వైషికం బేయఁగాఁ జేయఁగా మాఱు గామారి లోకేశనాకే
శులుం జాల కున్నంత మాం పాహిభోరామ మాంపాహిభో రామయం చెన్ను
చుం గన్ను బా నిచ్చి తా మిత్తికిం దప్పి లొట్టాయెఁ గన్నన్న లోకోక్తికల్పించి
కాకంబుతా నేగఁగా మందల న్మందల న్గేపుచో నాలకై యెత్తవే శైలము న్శై
లము న్మోవవే నీవు కూర్మంబ వై నిన్ను వర్ణింపఁగా సాధ్యమా నాకు వేకన్నులా
లేవు నిం జూడ వేనోళ్లులా లేవు నిం బాడ వేచేతులా లేవ యర్చింపఁ జర్చింప
నే నెంతవాఁడ న్దయాదృష్టిచే నీవు నం జూడ కున్నంత నానోటికి న్వచ్చిన ట్లెల్ల
నీనామ మే నెంతు నీకీర్తిఁ జింతింతుఁ బాపంబులం ద్రుంతు నింతే సుమీ చేత
వెల్లంగ బల్దివ్వె న న్జేరునే చీఁకటుల్ కృష్ణ నా చిత్తమే సెమ్మె నీభక్తియే తైల
మోరామ నీనామమే వత్తి నీమూర్తియే వెల్గు నీకీర్తియే కాంతి నే నింక నోం డొల్లఁ
బోఁ ద్రోతు మోహాంధకారంబు నిర్ధూతరోగంబు నిస్తుల్యభోగంబు భక్తాను
రాగంబు సంపూర్ణరాగంబు కల్యాణయోగంబు నీభక్తియోగంబు నీయాహ్వ
యోచ్చారణం దప్ప నే నేమియుం జేయ నేరం జుమీ మీఁద నె ట్లైనఁ గానిమ్ము
కృష్ణా మనోహాస్తతృష్ణా నమస్తే నమస్తే నమః. ౧౮౦



వ. అని వినుతించి యి ట్లనియె. ౧౮౧

కం. విన్నారము వీరలగతిం, గన్నారము మున్ను వీరిఁ గన్నారఁగ నీ
కన్న రమణు లిఁక నెవ్వరు, కన్నా రిఁక లాఁతి కగునె కనఁగాఁ గనఁగాన్. ౧౪౨

కం. నీరూపు రేఖ గలిగిన, నీరూపరి ననుచుఁ జెప్పె నేడ్తెఱ నచ్చో
వారలు భ్రమ విన సురుచిర, భారతి భారతిసుతుండు వాగ్వైచిత్రిన్. ౧౪౩

వ. ఇట్లు తెలియఁ జెప్పి యతండు సనుటయు. ౧౪౪

ఉ. నారదుచేత నాయసితనారదవర్ణుఁడు పుత్త్రుఁ డంచు నా
నీరజపత్త్రనేత్ర తననెయ్యపుఁగోడ లటంచు నింపు సొం
పారఁగ విన్నయంతఁ గలశాంబుధికూరిమిపట్టిమేనిపైఁ
దోరము లై నిదాఘఘనతోయము తోఁచె విచిత్రరీతిగన్. ౧౪౫

వ. తదనంతరంబ వారలం జేరఁ దీసి రుక్మిణీరమణీమణి కొడుకుం దొడలపై నుంచు
కొని యక్కున నక్కుఁ జేర్చి ముద్దిడుచు నిట్లనియె. ౧౪౬

శా. అన్నా నాచనుఁబాల కింత యెఁడఁబాయం జేసి వారాశిలో
నిన్నానీచుఁడు ద్రోవ న్నెట్లు మనితో నిన్నెట్లు రక్షించెనో
యిన్నాళ్లీగజయాన కోడ లన నానే నాకు నాపాలివే
ల్పన్నం జెల్లదె చెల్లరే జగతి భాగ్యల్గాచిరే యీగతిన్. ౧౪౭

కం. క్రేపును బాసినగోవన, వాపోవుచు నుంటి నీదువార్త తెలియమి
న్నాపట్టీ నిన్నెవ్వరు, చేపట్టిర నుచుఁ బెల్లు చింతఁ బొగులుచున్. ౧౪౮

కం. నానందన నాభాగ్యము, నానోముల మేలుపంట నాముద్దులయా
నానయనోత్సవముగ నిటు, నే నాలోకింపఁ గలిగె నేఁటికి వత్సా. ౧౪౯

ఆ. పట్టు లేనివారిప ట్టైన శ్రీహరి, పట్టి నయ్యు నరులు మట్టుఁ బెట్టఁ
జెట్టఁ బట్టినట్టిచేడె రక్షించెఁ గా, చెట్టఁ బట్ట కుండఁ జిత్తజాత. ౧౫౦

వ. అని కొడుకుం జూచి ముద్దు లాడి. ౧౫౧

తే. ఆపదాపధి నాగతి నసుర వైన, నాగతిని మన్నిచితివికా మహానిపుణత
కోడలా నాదుతనయుని కోడ లాగు, దతిని బాసట యైతివి దరిని జేర. ౧౫౨

వ. అని కోడలిం బ్రశంసించి వారలకు వేఱువేఱుభవనముల నియమించి సంతసించు
చుండెనంత ౧౫౩

కం. రాజీవకేశవుండీ, రాజీవదళాక్షుఁ డితని రక్షించెనె యా
రా జీవనములఁ గూలిన, రాజీవం బనుచు బంధురాజి నుతించెన్. ౧౫౪

తే. కనులకానందముగఁ గన్నజనములకును, ముదమువొదలంగఁ జేయుచుహృదయము
ననుకందనందనందనందనుం డందముగను, డెందమునయందు నానంద మందుచుండె.

కం. దరకర సంసేవితసుర, పరికరసురపరవినాశపరవగ దర్వీ
కరపరికర గానచర, పరికరసంపత్కరా కృపాకర సుకరా. ౧౪౬

## మంగళమహాశ్రీవృత్తము.

మిత్రనుతగోత్ర శశిమిత్రకృతనేత్రయుగ మిత్రసుతపుత్రకసుమిత్రా
పుత్రయుత గోత్రపరపుత్రమదదాత్ర హరిపుత్రహితగోత్రవరపాత్రా
జైత్రశతపత్రఖగ చైత్రనుతగాత్ర సురశాత్రవపరా కనకనేత్రా
చిత్రసుచరిత్ర శుచిచిత్రకసపిత్రజజసేవ్య ధృతమంగళమహాశ్రీ. ౧౪౭

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాయమానమానసత్వ మహా
వైభవ వావిలికొలను రామచంద్రరాయతనూభవ సుజనవిధేయ
సుబ్బరాయనామధేయ ప్రణీతంబైన శ్రీకుమారాభ్యుదయం
బునందు సర్వంబును దృతీయాశ్వాసము
సంపూర్ణము.

ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.